శ్రీరస్తు.

# ఉద్భటారాధ్య చరిత్రము

తెనాలి రామలింగకవి ప్రణీతము.



మాహిష్మతీముద్రణాలయమందు

ముద్రితము.

ముక్త్యాల.

1925

 [వెల రు 1-0-0.

# ప్రధానరాజపోషకులు.



సీ. శ్రీవి. సి. ల్లి సుర్వవల్లభులలోన దగునంచు వాసిశబ్దంబె తెలుపు
అఖిలరాజాధిరాజాగ్రగణ్యుండని ప్రబలిన రెడ్డిశబ్దంబు నుడువు
నఖిలలోకంబులకు నాహ్లాదకరుడని పరగెడి చంద్రిశబ్దంబె పలుకు.
ధరణీశవులకెల్ల తలమానికంబని తనరెడు మౌళిశబ్దంబె చాటు
గీ. ప్రజనరయునని యీశ్వరపద మెతెలుపు, దయగలదని ప్రసాదశబ్దంబె తెలుపు
అట్టి రాజచంద్రునకు దీర్ఘాయువొసగి, ఎపుడు రక్షించుగాక ముక్తీశ్వరుండు.

# పీఠిక.

[ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. ]

సరస్వతీసతికి యపూర్వములగు సత్ప్రబంధములను వెల్లడించుట సంతోషవిషయము. ఇప్పుడు ప్రకటితమయిన యుద్భటారాధ్య చరిత్ర మట్టియపూర్వసత్ప్రబంధములలో నొక్కటి. దీనికి

కర్త తెనాలి రామలింగకవి.

అనంగానే దీనిసత్ప్రబంధత్వము గొంత సమర్థిత మగునుగదా! తెనాలి రామలింగకవియని, తెనాలి రామకృష్ణకవియని యొక్కనినే యటునిటుగూడఁ లోకము పేర్కొనుట గలదు. తొలుత నాతఁడు శైవుఁడనియు, నప్పుడు రామలింగఁడని పేరయ్యెననియుఁ, దర్వాత వైష్ణవము పుచ్చుకొనెననియు, నప్పుడు రామకృష్ణుఁడని మార్పుపేరయ్యెననియుఁ బ్రతీతి. దీనిని వీరేశలింగముపంతులుగారు మొదలగువారు గొందఱు నమ్మిరి. మఱికొందఱు నమ్మరయిరి. * ఆరెండుపేళ్లు నొక్కనివే యని నేనును విశ్వసించుచున్నాఁడను. అట్లు విశ్వసించుట కిది వఱకున్న యాయైతిహ్యమాత్రమేకాక యపూర్వముగాఁ గొన్ని యాధారములు నాకగపడినవి. తెలుపుచున్నాఁడను:—

[రామలింగఁడే రామకృష్ణుఁడు.]

రామకృష్ణకవికృతములుగా నిదివఱకు దొరకి ప్రకటితములయి యున్న గ్రంథములు రెండు. అవి పాండురంగమాహాత్మ్యమును ఘటికాచలమాహాత్మ్యమును. రామలింగకవికృతిగా నిప్పుడు క్రొత్తగా దొరకి ప్రకటితమయినది యుద్భటారాధ్యచరిత్రము. తొల్త నాతఁడు శైవుఁడుగానుండి తర్వాత వైష్ణవుఁడుగా మాఱెననియే నే నిందు

* విశ్వకర్మవంశ్యుఁడు ధీరజనమనోరంజనకర్త తెనాలి రామలింగకవి యొకఁడున్నాఁడు. అతఁడు వేఱు.

ముందు నిరూపింపనున్నాఁడను గాన యుద్భటారాధ్యచరిత్రము మను పటి గ్రంథముగాను తక్కిన రెంటిని దర్వాతివానిఁగాను దెలుపు చున్నాఁడను.

ఉద్భటారాధ్యచరిత్రమున రామలింగకవి స్వవిషయ మిట్లు తెల్పుకొన్నాఁడు:—

సీ. కౌండిన్యమునిరాజమండలేశ్వరవంశ, పాథోధివసుధాభానుమూర్తిఁ
బాలగుమేలేశపదపయోజద్వయీ, ధ్యానధారణసముదాత్తచిత్తు
మానితాయాతయామానామభావిశ, విపులమహాయజుర్వేదవేది
రామేశ్వరస్వామిరమణీయకరుణావి, శేషపోషితవిలసితసమగ్ర

గీ, సహజసాహిత్యమాధురీసంయుతాత్మ, లక్కమాంబకు ఘనయశోలక్ష్మి వెలయ
రామధీమణికిని బుత్త్రి రామలింగ, నామవిఖ్యాతుఁ గావ్యనిర్ణయధురీణు.

గద్యమునందును,—"వీరేశ్వర గురువరేణ్యచరణారవిందషట్చరణ సకలకలాధర రామనార్య సుపుత్త్ర సుకవిజనమిత్త్ర కుమారభారతీబిరుదాభిరామ రామలింగయ ప్రణీత" మనియున్నది.

పాండురంగమాహాత్మ్యమున రామకృష్ణకవి యిట్లు చెప్పుకొన్నాఁడు.

సీ....శైవవైష్ణవపురాణావళీసార్థ, ములు నీకుఁ గరతలామలకనిభము

గీ, లంధ్రభూమికుచాగ్రహారాభమైన, శ్రీతెనాల్యగ్రహారనిర్ణేత స్వగ
శాఖికాకోకిలము వీవు సరసకవివి, రమ్యగుణకృష్ణ! రామయరామకృష్ణ!

క. కౌండిన్యసగోత్రుఁడ వా, ఖండలగురునిభుఁడ వఖిలకావ్యరససుధా
మండనకుండలుఁడవు భూ, మండలవినుతుఁడవు లక్కమాంబాతనయా!.

"శారద నీరూపము రామకృష్ణకవిచంద్రా సాంద్రకీర్తీశ్వరా!"

క. వాక్కాంతాశ్రయు భట్టరు, చిక్కాచార్యుల మహాత్ము శ్రీగురుమూర్తిన్
నిక్కపుభక్తి భజించెద, సక్కవ్వకళాకలాప మీడేయుటకున్.

గద్యమున:— ఇది శ్రీమత్పరమపదనాథనిరవధికకృపాపరిపాకపరిచితసరస కవితాసనాథ రామకృష్ణకవినాథ ప్రణీతంబైన—అనియున్నది.

| రామలింగకవి. | రామకృష్ణకవి. |
|---|---|
| కౌండిన్యగోత్రుఁడు | కౌండిన్యగోత్రుఁడు |
| శుక్లయజుర్వేది | శుక్లయజుర్వేది |
| తండ్రి, రామయ | తండ్రి, రామయ |
| తల్లి, లక్ష్మమ | తల్లి, లక్ష్మమ |
| కుమారభారతీబిరుదాభి | శారదనీరూపము రా |
| రాముఁడు | మకృష్ణకవిచంద్రా! |

యుద్భటచరిత్రము బాల్యమున రచించినదిగాన 'కుమారభారతి' యని బిరుదు చెప్పుకొన్నాఁడు. పాండురంగమాహాత్మ్యము ముదిమి వయసున రచించినదిగాన 'శారద నీరూపము' అని కృతిపతి తన్ను సంబోధించినట్లు చెప్పుకొన్నాఁడు. కాన యీభేదము సంగతమే. ఇన్ని సరిపడియున్నను నుద్భటచరిత్రమున రామలింగయ యని గ్రంథకర్త పేరును పాలగుమి యోగీశ్వరుఁడని గురుని పేరును, పాండురంగమాహాత్మ్యమున రామకృష్ణుఁడని గ్రంథకర్తపేరును, భట్టరు చిక్కాచార్యులని గురుని పేరును గానవచ్చుట, గద్యములరీతులు భిన్నములుగానుండుట రెండు నొక్కనిపేళ్లేయను సిద్ధాంతమునకుఁ గొంత బాధకముగాఁ గానవచ్చును. ఈభేదములు మతము మాఱుటచే నేర్పడినవేయని నే ననెదను.

అందుకు సాధకములు.

ఇందుమతీపరిణయ మని తెనాలిరామభద్రకవికృతి యొకటి కలదు.
* అం దిట్లున్నది:—

---

*ఇది తంజాపురపు సరస్వతీపుస్తకభాండాగారమునఁ గలదు. శ్రీ మానవల్లి రామకృష్ణకవి, యం. ఏ. గారు దీనివిషయము 1914 సంవత్సరాదిపంచికలో "తెనాలికవులు" అనువ్యాసమునఁ దెలిపినారు. వారే దీనిప్రతిని చెన్నపురి గవర్నమెంటు లైబ్రరికిని ఒసఁగినారు.

# IV.

............కవితాఘనతామహు మత్పితామహుఁ
రామయ రామకృష్ణ కవిరాజుఁ దలంచి నుతించి మ్రొక్కెదన్.

గీ. తదనుసంభవ మణిని సుదక్షిణాపరిణయ ముఖకావ్యరచనాధురీణు సాంధ్ర
కవికదంబములోనఁ బ్రఖ్యాతిఁగన్న,యన్నపకవీంద్రు ధీసాంద్రు నభినుతింతు

*　　*　　*　　*　　*

సీ. ప్రౌఢి మీపెదతాత పాండురంగాది సత్కృతులు చేసెను రామకృష్ణసుకవి
అనుజుఁడన్నప్ప మీపినతాత రచియించెఁ, బరగ సుదక్షిణాపరిణయంబు
మీతాత శ్రీగిరి చాటుకవిఖ్యాతి, శ్రీశైలమాహాత్మ్యకృతి యొనర్చె
కడిమి మీతండ్రి యుమ్మడి రామకృష్ణాఖ్యుఁడనఁ గీర్తిఁగనె సంస్కృతాంధ్రములను

గీ. ఔర యనిపించె మీయన్న వీరరాఘవాఖ్యకవి సత్కవితామహత్త్వమునను
నిన్ను మాచాన సంతాన వెన్నుఁడర మెఱిఁ, బ్రాజ్ఞహృదయాబ్జరవి రామభద్రసుకవి.

దీనింబట్టి చూడఁగాఁ బాండురంగమాహాత్మ్యాదులను రచించిన తెనాలి రామకృష్ణకవియును సుదక్షిణాపరిణయము రచించిన తెనాలి యన్నయకవియును నన్నదమ్ములని యేర్పడుచున్నది. దీనికి సరిగానే సుదక్షిణాపరిణయమున:

గీ. సద్గుణాభిరామ తెనాలిరామ,పండితాగ్రణి సత్పుత్త్రు భవ్యమిత్త్రు
హారపదాంభోజ సౌముఖ్యు నన్నపాఖ్యు,నన్నుఁ బిలిపించి యాదరోన్నతివహించి.

*　　*　　*　　*　　*

గద్యము. 'ఇది శ్రీమత్తెనాలిరామేశ్వర శాశ్వతకృపాకటాక్ష లక్షిత కవితాభిరామ రామయపండిత కుమార సహజశైవాచారసంపన్న ధీమదన్నయ నామధేయ ప్రణీతంబైన సుదక్షిణాపరిణయమందు'- అనియున్నది.

ఈ సుదక్షిణాపరిణయ పద్యములవలనగూడఁ దెనాలి రామకృష్ణుఁడు, తెనాలి యన్నయ యన్నదమ్ములగుట యితరప్రమాణ నిరపేక్షముగానే యేర్పడుచున్నది. ఇద్దరును రామయపండితుని కొడుకులే; తెనాలివారే;

ఒకకాలమువారే (అదిముందు తెలియఁబడును) అంతేకాక రామలింగఁడే రామకృష్ణుఁడయ్యె ననుటకుగూడ నీసుదక్షిణాపరిణయమే స్వతంత్రముగా సాధించుచున్నది. ఉదాహృత గద్యపద్యములవలన నన్నయ సహజశైవాచారుఁడనియు, తెనాలిలో వెలసిన రామేశ్వరస్వామి యనుగ్రహమునఁ గవిత నేర్చినవాఁడనియు, మఱియు-

గీ. కాళిదాసాది సంస్కృతకవులఁ దలఁచి, యంధ్రభాషావిశేష భాషాధిపతుల
నన్నపార్యాదులను బుద్ధి నస్మరించి, పాలగుమి భీమగురుని సద్భక్తిఁ గొలుతు.

అనుపద్యమువలనఁ బాలగుమి భీమయశిష్యుఁడనియు నెఱుకపడుచున్నది. దీనినిబట్టి యన్నయకుటుంబమువారును సహజముగా శైవాచారసంపత్తికలవారనియు, తెనాలిరామలింగస్వామి భక్తులనియుఁ, బాలగుమివారి శిష్యులనియుఁ దలఁపఁగూడును. * ము ప్రస్తుతగ్రంథమగు నుద్భటచరిత్రమును రచించిన రామలింగకవి యిట్టిలక్షణములు గలవాఁడు. ఆతని శైవాచారనిరతి యుద్భటచరిత్రమున స్పష్టముగాఁ గన్పట్టుచున్నది. మఱియు నాతఁడు 'రామేశ్వరస్వామి రమణీయకరుణావిశేషపోషితవిలసితసమగ్ర, సహజసాహిత్యమాధురీసంయుతాత్ముఁ'డనియు 'పాలగుమేలేశపదపయోజద్వయీధ్యానధారణ సముదాత్తచిత్తుఁ'డ ననియుఁ జెప్పుకొన్నాఁడు. పాలగుమి మేలేశ్వరుఁడును బాలగుమిభీమేశ్వరుఁడును నన్నదమ్ములో తండ్రికొడుకులో అయియుందురు.

* పాలగుమివా రారాధ్యులుగాఁబోలును. రామలింగకవి కింకను నూటేండ్లకు ముందొకఁడా యింటిపేరివాఁడు శైవాచార్యుఁడు కొండవీటి రెడ్డిరాజ్యమున నున్నట్లు శాసనమున్నది. శ్లో. పాల్గుమిశ్రీకంఠగురోః పంచాక్షరమంత్రపారకర్తస్య । శిష్యశ్శిష్యపరిషద్రక్షాదాక్షిణ్యపరిపాటాక్షస్య. శక 1886 నాఁటిది, పెదకోమటి వేమారెడ్డిశాసనము శృంగారశ్రీనాథము నను గ్రంథము చూచునది.

మఱి యన్నయ తన యన్నయని రామలింగనిఁ (లేక రామకృష్ణుని) బ్రస్తుతింపకున్నంతమాత్రాన వారి సోదర్యవిషయము సందేహింపఁ దగినదేమో యనరాదు. తెనాలి రామభద్రకవి తన తాతలన్నదమ్ములు ముగ్గురనియు, మొదటివాఁడు పాండురంగమాహాత్మ్యకర్త రామకృష్ణుఁడనియు, రెండవవాఁడు తనతండ్రికిఁ దండ్రి శ్రీగిరియనియు, మూఁడవవాఁడు సుదక్షిణాపరిణయకర్త యన్నయ యనియు స్పష్టముగాఁ జెప్పినాఁడు గాన యిట్టిసందేహమునకు సందు లేదు.

అన్నయకవి మతము మార్చుకొన్నాఁ డన్నయనాదరముచే నన్నగారిని బ్రస్తుతింపక పోయెనేమో! 'సహజశైవాచార'యన్న పదమాయన్న నమమఁదెచ్చుకొన్న వైష్ణవాచారమునిందించి వైమనస్యముచేఁ జేర్చుకొన్నదేమో! రామకృష్ణకవి తనమతముమార్పును దెలుపుకొనకున్నను, పాండురంగమాహాత్మ్యమున 'శైవవైష్ణవ పురాణావళీ నానార్థరచనా పటిష్ఠైకరమ్యామతిః' † అని తన శైవ ప్రబంధరచనమును దెలుపుకొన్నాఁడు.

తెనాలిలో నుండుటచేత నేతర్వాత తెనాలివారని యింటిపే రేర్పడినదిగాని యంతకుముందు వారియింటిపేరు గార్లపాటివారని ప్రాఁత వ్రాఁతలలో నున్నది. గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు వీరేశలింగము పంతులుగారును దీనిని జెప్పిరి. తెనాలిలోనున్న రామకృష్ణపండితుఁడు శైవాచారపరుఁడుగాన యక్కడ వెలసియున్న రామలింగస్వామి పేరే తన ప్రథమ పుత్రునికిఁ బెట్టుకొనెనని నేను దలఁచుచున్నాఁడను. అన్నయ చెప్పుటచేతనే కాక యీక్రిందిసాధనము చేతఁ గూడ నాతఁడు శైవాచారపరుఁడని రామలింగేశ్వరస్వామి భక్తుఁడని యేర్పడుచున్నది.

---

† 'శైవవైష్ణవ పురాణావళీ నానార్థములు నీకుఁ గరతలామలకనిభము' లని పాఠాంతరముకలదు. పాండురంగమాహాత్మ్యమున నీపద్యము పాఠభేదములతో నున్నది.

తెనాలిలో రామలింగేశ్వరస్వామి యాలయమున నొక యుత్సవవిగ్రహముపీఠముమీఁద నీశ్లోక మున్నది-

శ్లో. శ్రీతెనాలి నగరే వ్యరాజయ
ద్గార్లపాటి పురరామచండికః
శుక్లమాఘసిత పంచమీగురౌ
రామలింగ సుమహోత్సవాకృతిమ్.*

రామలింగని యింటిపేరు గార్లపాటివారని యిదివఱకువ్రాసినవా రెవ్వరుగాని యీశ్లోకము నునికి నెఱిఁగినట్లు తెలియరాలేదు. రామలింగని యింటిపేరు తొల్త గార్లపాటివారనుట నీశాసనశ్లోకము స్థిరపఱచుచున్నది. ఉద్భటారాధ్యచరిత్రలో రామలింగఁడు తన యింటిపేరెదో పేర్కొనలేదు రామకృష్ణుఁడు పాండురంగమాహాత్మ్యమునను బేర్కొనలేదు 'శ్రీతెనాల్యగ్రహారనిర్ణేత'ననుమాత్రము జెప్పుకొన్నాఁడు అప్పటికి తెనాలివారని యింటిపేరు స్థిరపడకుండవచ్చును. అన్నయ సుదక్షిణాపరిణయమునఁ 'తెనాలి' యింటిపేరు చెప్పుకొన్నాఁడు.

మనుమఁడగు రామభద్రకవి చెప్పుటచేతను, తల్లిపేరు మొదలగునవి సరిపోవుటచేతను రామకృష్ణుఁడును, నన్నయయును నన్నదమ్ములని స్పష్టపడినది. ఉద్భట చరిత్రమందుఁ గానవచ్చు రామలింగేశ్వరస్వామి యనుగ్రహము, పాలకుఱిక్ వారి శిష్యత్వము, శైవాచారము మొదలగునవి సరిపోవుటచేతను, లోకమందుఁ బారంపర్యముగా వచ్చుచున్న ప్రతీతిఁగూడ నిర్వాహ మేర్పడుటచేతను, నుద్భటారాధ్యచరిత్ర కర్తయగు రామలింగయయే వైష్ణవమతము పుచ్చుకొని రామకృష్ణుఁడై పాండురంగ మాహాత్మ్యము రచియించినాఁడని, వారు వేఱుపురుషులు గారని, నిర్ణయించుట ప్రమాణదూరము కాదు.

---

* పదియేండ్లకుముం దీశ్లోకమునుగూర్చి గుంటూరిలో శ్రీ మల్లాది సోమయాజులుగారు నాకుఁ జెప్పిరి. మూఁడేండ్లకుముందు నేను జూచితిని. ఇప్పుడొకమిత్రుఁడుచూచి వ్రాసి పంపెను. శుక్ల సం|| మాఘ శుద్ధ పంచమీ గురువారము స్వామికణ్ణుపిళ్లగారి పుస్తకమును బట్టిచూడఁగా సరిపడకున్నది.

# VIII

## పోలికలు.

రామలింగకవియే రామకృష్ణుఁడయ్యెననుట కింకను మఱి యొక బలవత్ప్రమాణము చూపెదను. పాండురంగమాహాత్మ్యమున 'శైవవైష్ణవపురాణావళీ నానార్థరచనా పటిష్ఠైక రమ్యమతి' యని చెప్పఁబడుటచే నాతఁడు శైవపురాణకథల రచియించి యుండవలె ననియు నీయుద్భటారాధ్యచరిత్రము వానిలోనిది యగుననియు నను కొంటిమి. తొలుతఁ దాను శైవుఁడై యున్నప్పుడు రచియించిన యుద్భటారాధ్యచరిత్రములోని పద్యములే మార్చి మార్చకుండఁ దర్వాత వైష్ణవుఁడై రచించిన ఘటికాచలమాహాత్మ్యమున నాతఁడు చేర్చికొన్నాఁడు ఇదిగో చూడుఁడు:—

సీ. అచలనాథున కర్పించి మతికాని, మృగములు లేఁ బూరి మేయ వచట
అసమలోచనునకు నర్పించి మతికాని, యళులు క్రొవ్విరితేనె లావ వచట
అంధకధ్వంసికి నర్పించి మతికాని, కోయిల చిగురాకు గొఱుక వచట
అంగజారాతికి నర్పించి మతికాని, చిలుకలు పండ్లు భుజింప వచట
గీ. తక్కుఁగల జంతువులు శంభుఁ దలఁచికాని
యుచితకృత్యములఁ గోరి యుండ వచట
వదనములు వేయుఁగల యాఁతవానికైన
నాయరణ్యంబుఁ గొనియాడ నలవి యగునె?
మ. హరిణంబున్ బులి పొంచు, సింగ మొగి పర్యాటంబు లాడున్ గరిన్
ఖరిసీదన్ ఫణిడింభజాలముల నిల్పుం గేకి, చిట్టెల్కలన్
గరుణన్ బిల్లుల జాలముల్ బెనుచుఁ గాకంబుల్ నిశావేళ ఘో
రఘూకంబుల పొంతఁ గన్నుమొగుచున్ గాంక్షించి తద్భూములన్.
గీ. తపసి మొత్తంబు లేపాడి తానమాడి
డిగ్గియలచేరువలను బూదియు నలందు
కాలమునఁ బల్కును 'త్ర్యంబకం యజామ
హే' యటంచును జలపక్షు లెల్లయెడల.
ఉ. సామగుణంబుఁ గ్రోల్చఁ బికశాబకపంక్తులు శైవధర్మముల్
ప్రేమ నుపన్యసించు శుకబృందము లీశ్వరయోగశాస్త్రముల్

కోమలకీరశారికలు గూడి పఠించు శివోదలీలలన్
గామవిరోధిఁ బాడు నధికంబుగ నచ్చట భృంగలోకముల్.

సీ. అభ్రగంగాపవిత్రాంబువు లెన్నరో కాని, తల ధరియింతు రందఱును వరులు
పదినాలుగవపసగల పాము లెన్నరో కాని, యందఱు సురగేంద్రహారయుతులు
బాలేందుచంద్రఖండంబు లెన్నియో కాని, యందఱు ధరియింతు రమృతకరుని
విషరాశిఁ బుట్టిన విషము లెన్నరో కాని, యందఱు హాలాహలాంకగళులు
గీ. గంధగజదైత్యు లెందఱో కాని యంద, ఱతులగజచర్మపటధారు లైనవారు
కర్మ బంధంబు..............., కాలుకొనకుండ నిద్రింపఁజాలు ఘనులు.

[ఉద్భటచరిత్ర]

సీ. మొకరికేఁటులు మూతి ముట్టవు తేనియన్, శ్రీమధుకాని కల్పించి కాని
కోకిలమ్మలు చిగురాకులు గొఱుకవు, శ్రీవనమాలి కర్పించి కాని
లేఁబచ్చికల్ గబళింపవు హరిణముల్, శ్రీనీలమూర్తి కర్పించి కాని
ఫలభుజికీరములకుఁ జిలుకలు దలఁపవు, శ్రీమాధవునకు నర్పించి కాని
గీ. యితరజంతువులును హరి మతిఁ దలంచి, కాని యేవస్తుసమునకుఁ బూన వనిన
నాతపోవనమాహాత్మ్య మభినుతింప, నలవియే వేమొగంబులచిలువకైన.

మ. పులు లేదున్ మృగశాబకంబుల హరుల్ పోషించు నత్యాదృతిన్
గలభానీకముఁ గాకముల్ మెలఁగు ఘూకశ్రేణితోఁ బిల్లిలె
ల్కలఁ గాచున్ శిఖికోటి లేఁజిలువలన్ లాలించు మత్స్యాళి బ
ల్గలవచ్ఛాయలనుంచి యాస్పటి యరణ్యానీప్రదేశంబులన్.

క. ఒకచిత్ర మచటి జటిపాళికి మున్ సంజలను గ్రుంకి లేచి సమాధిన్
సకలకుమంతంబులు తా,రకమంత్రోచ్చారణాభిరతి మతిఁ బొదలున్.

మ. శుకముల్ ప్రామిషకుల్ గుణించు గణియించున్ ధర్మ మర్మోక్తిహ
సకధల్ శారిక లిరికల్గాను మనిరున్ శేషభాషావిశే
షకశాస్త్రం మాపన్యసించు బకముల్ పాత్రోచితిప్రౌఢిగా
యేకవామాలి కలుక్ పఠించు సతతోద్యద్గీతికాచాతురిన్.

సీ. సనుగాలి దూదిపాములు లెన్నియో కాని, యందఱు శయనీకృతాహివరులు
సురలోకవాహినీనిర్ఝరము లెన్నియో కాని, యందఱు దివ్యతీర్థాంబుపదులు
నీట జనించుమానికము లెన్నియో కాని, యందఱు కౌస్తుభహారయుతులు
చలికేఁడివెలుఁగులసాములు లెందఱో కాని, యందఱు నిందుకంజాప్తదృశులు

గీ. ఖగకులాధీశులెందఱు కలరో కాని, యంతఱును బల్లురా టెక్కెయములవారు
నారువోసినరీతి నున్నారు ధీరు, లన్నగతియందుఁ గాపురం బున్నవారు.

[ఘటికాచలమాహాత్మ్యము.] *

ఉద్భటారాధ్య చరిత్రపద్యముల ఛాయగల పద్యములు పాండురంగ మాహాత్మ్యమునఁగూడ లేకపోలేదు. కాని ప్రౌఢతరమయిన రచనమగుటచేఁ బాండురంగ మాహాత్మ్యమున నీవిధముగాఁ బోలినట్లుండఁదగు పద్యములు గానరావు. ఈసాధనములన్నియు రామలింగఁడే రామకృష్ణుఁ డయ్యెనను సిద్ధాంతమును నిర్వివాదముగా నెలకొల్పఁగలవని నానమ్మకము.

ఇంకొకసాధకము.

ఇన్ని సరిపడినను నుద్భటారాధ్యచరిత్ర రచనాకాలమును, పాండురంగ మాహాత్మ్యరచనాకాలమును నొక్కపురుషుని జీవితపరిమాణమునందుఁ బొందనివిగా నుండినచో నింక నివాదములన్నియు వమ్మయి పోవలసినదేయగును. ఆదిక్కు లేకుండ నదియుఁ గుదురుచున్నది. ఒక్కనికే రెండుపేళ్లను సిద్ధాంతము నిర్వివాదముగా నిల్చుచున్నది.

ఉద్భటచరిత్ర రచనాకాలము.

కొండవీడు దుర్గాధ్యక్షుఁడుగా నున్న నాదిండ్ల గోపమంత్రికిన్ ముఖ్యోద్యోగియైన యయారెదేచమంత్రి యుద్భటారాధ్యచరితము కృతి గొన్నాఁడు. అదియెల్లఁ గృత్యవతరణికలోఁ జూపఁబడును. శ్రీకృష్ణదేవరాయఁడు క్రీ. 1515 సం॥ కొండవీడు జయించెను. అప్పటినుండియుఁ గృష్ణరాయల యేలుబడిలోఁ బడినది. నాయకులమంత్రియగు సాళ్వ తిమ్మరసు కొండవీటిపాలనమును దన మేనల్లుఁడగు నాదిండ్ల గోపమం

* ఘటికాచలమాహాత్మ్యము తెనాలిరామకృష్ణుని రచితమయినను నది యాతని మనుమని కాలమున (ఆమనుమని పేరులేదు) ఖండోజీరాయఁడను మహారాష్ట్రునకు గృతియీయఁబడినది. కావ నందుఁ గృత్యవతరణిక రామకృష్ణుని రచనము గాదు. రామకృష్ణుని విషయ మందేమియును లేదు. అది కళావతీ ముద్రాక్షరశాలలో 1902 సం. ముద్రితమయ్యెను.

త్రి కప్పగించెను. నాదిండ్ల గోపమంత్రి సుప్రఖ్యాతుఁడు. గోపమంత్రి క్రీ. 15 17 న దేచమంత్రి కొకయగ్రహారము నొసఁగెను.

దేచమంత్రి శైవాచార పరాయణుఁడు. పాలనారాధ్యుని వంశమువాఁడగు చంద్రశేఖర వాచంయమిని శిష్యుఁడు. మఱియు మహావిద్వాంసుఁడగు లొల్ల లక్ష్మీధరపండితునకు శిష్యుఁడు. ఆలక్ష్మీధరుఁడు కటాక్షింపఁగా శివపంచస్తవి కిఁదు వ్యాఖ్యానము రచించెను. అందు:—

శ్లో. నాదిండ్ల గోపనృపతే ర్మూరకేశ చ్ఛిధానతా
క్వచిత్స్థః క్వచిన్మైత్రీ క్వచిత్పూర్తః క్వచిద్యశః॥

* * * * * * *

..........యస్యాత్ర దశ్రీ శమాదా, దఖిలమనుపతిం దేచయామాత్యవర్య
స్స్వాయం శ్రీచంద్రమౌళి స్తుయతి గురువరః, పాలనారాధ్య వంశ్యః॥

(ఈ గురువుఁగూర్చి ఉద్భటారాధ్యచరిత్రము వవతరణికను గ్రంథావసానమును గూడఁ జూచునది.)

“నచాయం దేచయామాత్యమహిమ స్తౌతుంచికాన్
లక్ష్మీధర కటాక్షేణ కురుతే గురుతేజసా॥”

దేచమంత్రి గోపమంత్రిచే నగరిహారాది సమ్మానముఁ బడసి ప్రఖ్యాతుఁడయినపిదప నీ యుద్భటచరిత్రము కృతినందియుండును. ఆ కాల మించుమించుగా క్రీ 1546 అని తలఁపవచ్చును. దీనిచేఁ దెనాలి రామలింగకవి కృష్ణదేవరాయలసభలో నున్నాఁడన్న లోకప్రతీతి సదాధారముయి సంరక్షితమగుచున్నది.

‡ పాండురంగమాహాత్మ్య రచనాకాలము.

పాండురంగమాహాత్మ్యము విరూరి వేదాద్రిమంత్రి కంకితము యినది. ఆ వేదాద్రిమంత్రి కందాళ యప్పలాచార్యుల శిష్యుఁడు.

‡ శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు “తెనాలి కవులు” అనుపేరు 1914 ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో వ్రాసిన వ్యాసమున పాండురంగమాహాత్మ్య రచనాకాలమును చక్కఁగా నిర్ణయించినారు, దానిసారమే ఇక్కడ చూపఁబడినది.

మంగయ్యగురువరాజు కుమారు డగు పెదవంగి భూపాలునొద్ద వ్రాయసకాఁడు. చిత్రభారత కృతిపతితండ్రి పెద్దతండ్రులును, వైజయంతీ విలాసకర్తయగు సారంగతమ్మకవియు, నీ కందాళ యప్పలాచార్యులకు శిష్యులు. క్రీ 1543 పరాభవ వత్సరమున గండికోట వ భుక్త కందాళప్పలాచార్యులకు భూదాన మొసగిన శాసనము గలదట. దీనిఁబట్టి పాండురంగ మాహాత్మ్యరచనాకాల మించుమించుగా క్రీ 1556, 1560 అగునని తలంపవచ్చును. మఱియు పాండురంగ మాహాత్మ్యమున రామకృష్ణునిచే

భట్టరు చిక్కాచార్యుఁడు.

తన గురుఁడుగా స్తుతింపఁబడినాఁడు. ఈచిక్కాచార్యునికిఁ బలువు రాంధ్రకవులు శిష్యులయి యుండిరి. చాటుర్వాటికామాహాత్మ్యము, ఆనందకాననమాహాత్మ్యము మొదలగు ప్రబంధములను రచియించిన లింగముకుంట రామకవి (ఈతఁడు తెనాలి రామకృష్ణకవి యల్లుఁడు) యు నాతనితమ్ముఁ డగు లింగముకుంట తిమ్మకవియు నీ చిక్కాచార్యులకు శిష్యులు.

క. గురురాయ పట్టభద్రుని, వరివాగ్ శ్రీరంగనాయకాంశభవుఁ భ
ట్టరు చిక్కాచార్యుల మన్నరుల దలఁచి యడుగులకు నతుల్ గావింతున్.

[లింగముకుంట రామకవి.]

సీ. శ్రీవైష్ణవహితుఁడఁ జిక్కయాభట్టర, శిష్యుఁడ— [లింగముకుంట తిమ్మకవి.]*

మఱియు రామకృష్ణకవులచేఁ గామందకము కృతి గొన్న వాఁడు కొండ్రాజు తిమ్మరాజునకొడుకగు వేంకటాద్రియు నీయాచార్యుని శిష్యుఁడే.

క. శ్రీవంతభట్టరుచిక్కాచార్య వర్య శిష్య యతులిత శౌర్య
ప్రావీణ్యవర్య గుణా,త్మాచల జయలలిత ధైర్యవయతత్త్వనిధీ!

[కామందకము కృతిపతిసంబోధనము.]

* సులక్షణసారకర్త (లింగముకుంట తిమ్మకవి) అప్పకవికంటెఁ దర్వాతి వాఁడని కం. వీ. గారు వ్రాయుట ప్రామాదికము.

మఱియు నీకామందకకృతిపతి, పాండురంగ మాహాత్మ్యకృతిపతి యగు విరూరి వేదాద్రిమంత్రి సేవించిన ప్రభువైన పెదనంగభూపాలునకుఁ జెల్లెలికొడుకు. శా. 1506, క్రీ 1584 స్వభానువత్సరమున వేంకటరామకృష్ణకవులచే నాకొండ్రాజు తిమ్మరాజుకొడు కగు వేంకటాద్రి కామందకకృతి నందుకొన్నాఁడు.

మ. రమణీయంబుగ కాళిదాసకవిత్వంబుల్ గరంస్థై సహా
స్రిమశేషాఖ్యులు వాఙ్మనై వెలయఁగాఁ బ్రౌఢిం దనింగించి రా
ర మహిం దిమ్మయ వేంకటాద్రివిభు పేరన్ వేడ్కఁ గామందకీ
యము శ్రీవేంకటరామ కృష్ణులు స్వభాన్వబ్దంబునన్ ప్రౌఢిగాన్.

వీనిఁబట్టిచూడఁగాఁ బాండురంగ మాహాత్మ్యరచనాకాలము క్రీ 1565 ఇంచుమించుగా నగునని తోఁచుచున్నది. అటుగాఁ దెనాలి రామలింగకవి యించుమించుగా క్రీ 1525 ఉద్భటచరిత్రమును, మఱి ముప్పదియేండ్లకుఁ బాండురంగమాహాత్మ్యమును రచించి యుండునని చెప్పనొప్పుచున్నది. మనకవి తమ్ముఁడగు నన్నయకవి సుదక్షిణాపరిణయరచనాకాలము కూడ నిందుకు సరివచ్చుచున్నది. మఱి పెక్కుమార్గములచేఁగూడ మన కవివర్యుని కాలమును నిర్ణయింప వచ్చునుగాని యామార్గములు కొంత డొంకతిరుగుడుగానుండుటచే తను, ఇప్పుడు చెప్పిన కాలమునకే చేరువగానుండుటచేతను విడనాడినాఁడను.

కవిస్తుతులు.

నేఁ జూచినంతవఱకుఁ గవిస్తుతులలో 'రామలింగకవి'యన్న పేరే కానవచ్చినది. నడుమఁ దెచ్చిపెట్టుకొన్న రామకృష్ణనామము ప్రాచీనకాలమునఁ బ్రఖ్యాతము కాలేదు కాఁబోలును! పాండురంగ మాహాత్మ్యప్రౌఢిమ ప్రఖ్యాతమైనతర్వాత రామకృష్ణనామముగూడ రహికెక్కినది.

ఉ. రంగుగఁ బాండురంగని తెలుంగులరంగ రచించి పెద్దనా
అంగ ఫలోక్తులన్ నృపతిఁ గాంగ నొనర్చు హొరంగు నింగి ము

ట్టంగ మెలఁగుచేరుప్రఁ గడంగి చెలంగు నభంగసద్యశో
లింగుని రామలింగ కవిలింగకళానిధినిన్ గణించెదన్.

[శాఙ్గజిత్తీపరిణయము—ఎల్లూరి నరసింహకవి.]

క. శృంగార రసాలింగిత, రంగత్కవితా నటీతరంగము హృదయా
త్యంగమ్మభంగ మొంగద, లింగన్నా తెనాలి రామలింగముఁ దలఁతున్.

[పృథుచరిత్రము-సరస్వతీసోమయాజి]

పై పద్య మాత్రము లింగధారియనియూహింపఁ జెప్పుచున్నది.

„రంగనాథుని రామలింగకవిని" [మూర్త్యపురాణము, రాజలింగకవి.]

„రామ, లింగకవి రామభద్రుల లీలఁదలఁతు"

[అధ్యాత్మరామాయణము, శరభకవి.]

„భీమకవి రామలింగని" [చంద్రరేఖావిలాసము, జగ్గన.]

ప్రబంధరత్నావళిలో తెనాలి రామలింగకవి కృతులు కందర్పకేతువిలాసము, హరిలీలావిలాసము నను వానినుండి కొన్నిపద్యము లుద్ధరింపబడినవి. వానిఁగూర్చి ముందుఁ దెలుపుదును. అందును రామలింగనామమే యున్నది. మఱియు నీచాటుపద్య మున్నది—

ఉ. లింగనిషిద్ధుఁ గల్వల చెలింగని మేచకకంధరుం డ్రిశూ
లింగనిఁ సంగతాళి లవలింగని కర్దమమూషిత స్మృతా
లింగనిఁ గృష్ణచేలుని హాలింగని నీలకచున్ విధాత్రునా
లింగని రామలింగకవి లింగనికీర్తి హసించు దిక్కులన్.

అప్పకవి మొదలగువారు మఱియుఁ బెక్కురు రామలింగనియే పేర్కొనిరి అయినను అతని యిల్లుఁడగు లింగముకుంట రామకవియు, మనుమఁడగు రామభద్రకవియు రామకృష్ణనామమును బేర్కొనిరి.

చతుర్వాటికామాహాత్మ్యము, ఆనందకానన మాహాత్మ్యము నను కృతులలో:---

సీ. శ్రీరామసేవాప్రసిద్ధుఁ గాశ్యపగోత్రు, శుభదకాత్యాయనసూత్రపాత్రు
లలితచారిత్రుఁ గాళయమంత్రికిని గోవమకును దౌహిత్రు సత్కవిపాత్రు
తిరుమలాంబాగర్భవరవార్ధి పూర్ణేందు, ధన్యాత్ము అక్కవిధానపుత్రు
నిజపాలకజనకనిష్ఠాగరిష్ఠ రామసచివలబ్ధ రామజపధుర్యు

గీ, రామకృష్ణాఖ్యుఁ డాతఁడు ప్రకటవిభవు, శుక్లయజురర్థ్యుఁ డనఁ జేర సూరిమాచ
యానుజాని దిమ్మధీనిధి కగ్రజాతు, ననఘు లింగమకుంట రామార్యు తమ్ము. *

ఇట్లు అల్లుఁడగు రామకవియుఁ బూర్వోదాహృతపద్యమున ననుమానుఁడగు రామభద్రకవియు, రామకృష్ణనామము పేర్కొనుటకు వారు వైష్ణవమతము దెక్కువగా నభినివేశము గలవారగుట కారణము గావచ్చును. వారి వైష్ణవమతాభినివేశ మాయాగ్రంథములఁ జూడవచ్చును.

## మఱికొన్నికృతులు.

తెనాలి రామలింగకవికృతులు మఱిరెండు తెలియవచ్చుచున్నవి. వానిపేళ్లు కందర్పకేతువిలాసము, హరిలీలావిలాసము. ఆప్రబంధము లిప్పుడు గానరావుగాని, వానినుండి కొన్నిపద్యములు ప్రబంధరత్నావళిలో నుద్ధృతము లయినవి. వానినా గ్రంథమునఁ జూడఁదగును. ఇవిగాక పాండురంగ విజయమని మఱియేమో అని యీకవికృతు లున్నట్టు కొందఱు పేర్కొందురుగాని వానివిషయము నమ్మఁదగినది కాదు.

## కథలు.

తెనాలి రామలింగని కథలని దక్షిణ హిందూదేశమెల్లఁ బ్రఖ్యాతికెక్కిన పెక్కుకథలున్నవి. వానిఁగూర్చి మనమేమియుఁ జెప్పఁజాలము. అతఁడు హాస్యచతురుఁడై యుండవచ్చును నిజముగాఁ గొన్నికథ లాతనికి సంబంధించినవే గావచ్చును. లోకులు మఱియు ననేకాద్భుతకథ లాతనితలకుఁ జగిలించియు నుందురు. పెక్కుకథలు క్రొక్క

* ఆనందకానన మాహాత్మ్యములో 'నిజపాలకజనక' అనుచోట "నిజజనకాగ్రజ" అనియున్నది. దీనిచే నాతఁడు తనపెద్దతండ్రికి దత్తుఁ డయ్యెనని తెలియనగును. లింగమకుంట రామకవి తెనాలి రామకృష్ణకవి యల్లుఁడని లింగమకుంటవారెల్లరు నేఁటికిని జెప్పుచున్నారు. నేఁడు లింగమకుంటవారి యల్లురగు శ్రీ కొండ వెంకటకృష్ణయ్య పంతులుగారివల్ల తొల్త నిది విని తర్వాత లింగమకుంటలో విచారించి రామకవికృతుల సంపాదించి యుండుటఁజూచి యిది తథ్యమని నమ్మితిని.

ష్ణదేవరాయల గోష్ఠిలో జరిగినవిగా వినవచ్చెను. రామలింగఁడు రాయల సమకాలమువాఁడే. కావున నవి సంభావ్యములు గావచ్చును. చాటుపద్యమణిమంజరిలో నేనాతని కథలను సంబంధించిన చాటుధారలఁ గొన్నిటిని జేర్చినాఁడను. క్రొత్తదొక్కటి యిక్కడ చూపుచున్నాఁడను.

క. ఓయమ్మలార! మందులు, వేయేల మకారకొమ్ము విషకవిగానిన్
వా యెత్తకుండఁ జేసిన, వా యెత్తదు రామరాయవసుధేశునకున్.

అళియ రామరాయనికి వాయురోగము వచ్చెనట! అంతఃపురస్త్రీలాతనికి మందులనిప్పింపఁ దంటాలు పడుచుండఁగా రామలింగఁ డీపద్యమును జెప్పినాఁడట. మకారకొమ్ము విషకవిగాఁ దనఁగా మూర్తికవి. అతని వాయి=నోరు, ఎత్తకుండఁ జేసినచో రామరాయలకు వాయి=వాయురోగము, తలమూపదని పద్యార్థము. మూర్తికవి విషకవిత్వప్రయోగముచే రాయలకు రోగము వచ్చెనని స్త్రీలను నమ్మించి యాతని యుద్యోగవైభవము నూడగొట్టించుట కెత్తిన యెత్తు గాఁబోలునిది!

ఇఁకఁ గవివిషయమును విడిచి ప్రస్తుతగ్రంథమును గైకొందుము. శైవారాధ్యులలో నొక్కఁడయిన యుద్భటారాధ్యుల చరిత్ర మిందు వర్ణితమయినది.

ఉద్భటుఁడు.

పాల్కురికి సోమనాథకవి రచియించిన బసవపురాణములో సప్తమాశ్వాసమున నీయుద్భటుని చరిత్రము వర్ణితమైనది. ఆకథనే సూరకవి ప్రపంచించి ప్రబంధముచేసినాఁడు తెలుఁగున మల్లికార్జున పండితారాధ్యుఁడును, నన్నిచోడుఁడును నుద్భటుని స్తుతించిరి.

క. హాలీలా స్తవరవశా, స్థిరనియమమథ క్తిఁ దనదుదేహముతోడన్
సురుచిరవిమానమున నీ,పురమున నుద్భటుఁడు కీర్తిఁ బోఁడె రుద్రా!

[శివతత్త్వసారము.]

క. క్రమమున నుద్భటుఁడు గవి, త్వము మెఱయఁ గుమారసంభవము, సాలం
కారము, గూఢవస్తుమయ కా,వ్యముగాహరు (ర?)లీల,చెప్పి హరు మెప్పించెక్
(కుమారసంభవము.)

పయిపద్యములఁబట్టి యుద్భటుఁడు హారలీల, కుమారసంభవము,అలఁకారగ్రంథము (కావ్యాలంకారసంగ్రహము) రచించినాఁడని తెలియనగుచున్నది. ఇందు గావ్యాలంకారసంగ్రహమొకటితక్కఁ దక్కిన విప్పుడు కానరాకున్నవి. అతనికుమారసంభవమునుండికొంద ఱాలంకారికులు కొన్ని శ్లోకముల నుద్ధరించిరి. *ఉద్భటుఁడు కాశ్మీర రాజగు జయాదునిసభలో విద్యాపతిగా నుండెనని (క్రీ. 779 నుండి 813 వఱకు) రాజతరంగిణిలోనున్నది.

ఆంధ్రకవు లీతనిఁ శివకవులలోఁ జేర్కొనుట మనకథానాయకుఁడీతఁడే యనుటకు సాధకముగాని యీకథలో నాగ్రంథముల స్మరణము లేకపోవుటయుఁగాలముసరిపడకపోవుటయుఁగొంత బాధకమగుచున్నది. ఈప్రబంధమున నుద్భటుఁడు ముంజభోజునికి శైవదీక్ష నొసఁగిన గురువుగాఁ జెప్పఁబడినాఁడు. ముంజభోజుఁడు దశమశతాబ్ది వాఁడు. ఉద్భటుని గ్రంథము లీభోజుని కింకను బూర్వకాలముననే పుట్టినవి. ఈయుద్భటారాధ్య చరిత్రలో ముంజభోజుని పేరున్నను దీనికాకరమయిన బసవపురాణమున భోజుఁడనిమాత్రమే యున్నది. పలువురు భోజులున్నారుగాన యీతఁ డాకాలమువాఁ డయి నను గావచ్చును. ముంజభోజు డనుట రామలింగకవి స్వకల్పితముగాన యది యప్రమాణమని త్రోసివేయ వచ్చును. ముదిగొండవారని యిప్పు డాంధ్రదేశమునఁ బ్రఖ్యాతులుగా నున్న యారాధ్యబ్రాహ్మణుల కీయుద్భటారాధ్యుఁడు మూలపురుషు

నన్ని చోడని కుమారసంభవము పీఠిక చూడుము.

డని యీ ప్రబంధమందుఁ గలదు. ఆయుద్భటునిదగ్గఱనుండి ముది గొండవారివంశ క్రమముగూడఁ గొంతగ్రంథాంతమున గానవచ్చుచున్నది. ఈవంశ క్రమము పాల్కురికి సోమనాథుని గ్రంథమునఁ గానరాదు * కర్ణాటభాషలోఁగూడ నుద్భట చరిత్రములు గలవు. సోమరాజకవి బసవాంకకవి యనువారిర్వురు వానిని రచించిరి. పాల్కురికి సోమనాథుడు కుమారపాలఘూర్జరునిదిగాఁ జెప్పినకథనే కర్ణాటకవులుద్భటునికథగాఁ జెప్పిరి. ఆకర్ణాటకకవులకంటె మనసోమనాథుఁడు ...ర్వుడు. కుమారపాలున కుద్భటదేవుఁడని నామాంతరముగా నాయుద్భటదేవచరిత్ర పీఠికలో శ్రీశ్యామాచార్యులుగారు వ్రాసిరి. అది యెట్లో? మల్లికార్జున పండితారాధ్యుఁడు సోమనాథుడు, వారి నిర్వురను వేర్వేఱుగాఁ బేర్కొనిరి. కుమారపాలుని చరిత్రమున నాతని కా నామాంతర మున్నట్టు చెప్పరయిరి. పాల్కురికి సోమనకథ చొప్పున రచియింపఁబడినయీయుద్భటారాధ్యచరిత్రమునకును నాకర్ణాటప్రబంధములకును నేమియు సంబంధమును గానరాదు.

---

* చంద్రశేఖరగురునివరకు నా వంశక్రమమున్నది. ఈచంద్రశేఖరుఁడే దేచయమంత్రి గురుఁడగునని నేననుకొనుచున్నాను.

# విజ్ఞప్తి.



శ్రీమదుద్భటారాధ్యచరిత్ర మనెడి యీ పవిత్రగ్రంథము తెనాలి రామలింగ మహాకవి రచించెనని మాతండ్రిమున్నగువారివలన వినియుండి యీచరిత్రము మామూలపురుషుని దివ్యచారిత్రక మగుట నే నీగ్రంథ సంపాదనమునకై భగీరథ ప్రయత్నము లొనర్చితిని గాని "కష్టఃఫలే నహిపునర్నవతాంవిధత్తే" అను కాళిదాసోక్తి ననుసరించి గ్రంథ సంపాదనాయాసము నిందు వివరింపక గ్రంథమును సంపాదించి ప్రకటింపఁగలభాగ్యము కలిగినందులకుఁ గలిగిన నాసంతోషము నించుక వినిపింపఁదలఁచి మనవిఁజేసికొనుచున్నవాఁడను.

ప్రప్రథమమున నీచరిత్రము నైజాం మండలమునుండి సంపాదించి నాకొసంగినవారు మన్మిత్రులును వేములపల్లి గ్రహారవాస్తవ్యులును అగు ములుగు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. వీరొసంగిన తాళపత్రగ్రంథము శిథిలావస్థనంది మఱియొకప్రతియుండినఁగాని వ్రాయుటకు వలనుపడని స్థితిలోఁ బ్రత్యంతర మొసంగినవారు అస్మద్వంశమౌక్తికాయమానులును విద్వద్వరేణ్యులును తాడికొండవాస్తవ్యులునగు బ్ర॥ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు. ఈరెండవ ప్రతియందు 1, 3 ఆశ్వాసములొకింత శిథిలమైయున్నవి. ద్వితీయాశ్వాస మసలే లేదు. ఈ 1, 2 ప్రతులసంప్రదింపుతోఁ గొఱతపడిన పద్యభాగము లట్లనేయుంచి లభించినంతవఱ కున్నదున్నట్టుల నొకప్రతి నెత్తివ్రాసితిని. తదుపరి నే నిద్దానిసంస్కరణ మెట్లు సమకూరెడునని విచారించుచున్నెడ నుభయశాస్త్రజ్ఞులును భోగేశ్వర సత్యవత్యుపాఖ్యానాదిగ్రంథ రచయితలును పెదనవాస్తవ్యులునగు బ్ర॥ మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి గారు లేఖక ప్రమాదముల సవరించి లుప్తభాగములఁ జాలవఱకుఁ బూరించి దయచేసిరి. అనంతరము దీనిముద్రింపించు ప్రయత్నములో నే నున్నసంగతిని విని సరస్వతీ పత్రికాధిపతులైన మహారాజరాజశ్రీ రాజా వాసిరెడ్డి శ్రీదుర్గా సదాశివేశ్వరప్రసాద్ బహదర్ జయంతిపురం రాజాగారు గురువంశమునకు మూలకందమైన నీయుద్భటారాధ్యచరిత్రము నత్యంతగౌరవ భావముతోఁ దమపత్రికయందుఁ బ్రకటింప నుద్యుక్తులైయుండ నింతలో భాగ్యవశమున మాముక్త్యాల సంస్థానమును దర్శింపవచ్చిన సుప్రసిద్ధవిద్వత్కవివరేణ్యులును మన్మిత్రులునగు బ్ర॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఈయుద్భటచరిత్రమును జూచి తెనాలి రామలింగని కవిత్వమాటఁ గడుంగడు సంతసించి పురాతన గ్రంథములనిన సహజోత్సాహపరులగుశాస్త్రిగారు మాప్రార్థనముపై గ్రంథపరిష్కారమున కియ్యకొని చక్కఁగఁ బరిశోధించి కవిహృదయ మెఱిఁగినంతమట్టు పూరణముల సంస్కరించి మఱింత మెఱుగుపెట్టుటయకాక పాండురంగమాహాత్మ్యాదికృతులు రచించిన రామకృష్ణుఁడే రామలింగకవి యని సిద్ధాంతీకరించు విపులమైన పీఠిక వ్రాసియొసంగిరి. నా కీగ్రంథసంపాదనమునకుఁ

తోడ్పాటుగావించిన బ్ర॥ ములుగు సుబ్రహ్మణ్యశాస్త్రిగారికిని బ్ర॥ ముదిగొండ నాగలింగశాస్త్రులవారికిని సంస్కరించి ప్రకటనానుకూల్యము మొనర్చిన బ్ర॥ మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రిగారికిని బ్ర॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారికిని కృతజ్ఞతాభివందనశతంబు లర్పించుచున్నవాఁడను.

ఈచరిత్రమును తమసరస్వతీ పత్రికయందుఁ బ్రకటింపించి నాకీగ్రంథమును ముద్రింపించి యొసంగిన మ॥ రా॥ రా॥ శ్రీ రాజా వాసిరెడ్డి శ్రీదుర్గాసదాశివేశ్వరప్రసాద్ బహదర్ గారు ఇతోధికసర్వైశ్వర్యవిరాజమానులై వంశాభివృద్ధి నొంది యుల్లరుటకు నస్మదుపాస్యదైవమగు నాయుమామహేశ్వరతత్త్వమును బ్రార్థించుచున్నవాఁడను.

ఏమహానుభావులకడనైన నీయుద్భటారాధ్యచరిత్ర యుండి దయచేసిరేని తక్కుంగలలోపముల ద్వితీయముద్రణమున సవరించి వారికి ముద్రితప్రతుల నొసంగి కృతార్థుఁడ నయ్యెదను.

బుధజనవిధేయుఁడు,

ముక్త్యాల. ముదిగొండ బసవయ్యశాస్త్రి.





# ఉద్భటారాధ్యచరిత్రము.



## ప్రథమాశ్వాసము.



శా. ... ... ... ...
... ... పాదాంభోజుఁ డధ్యాత్మవి
ద్యావిశ్రాంతుఁడు చంద్రశేఖరుఁడు నిత్యశ్రీయుతుం జేయు భ
ద్రాసనుం డగుసూరదేవప్రభు (నిత్యశ్రీయుతుం జేయుతన్.) 1

మ. ... ... ... ...
ఘనమదుద్భటఫణరత్నదీప్తిలహరీసంక్రాంతగండస్థలీ
ఖ మృగాత్యంతరదత్తనూతనసఖాంకం బంచు సంకించునా
హిమశైలాత్మజ ... ... ... 2

ఉ. ... ... చూడామణికాంతి పర్వ ని
త్యాకరరత్నగైరికమహాద్యుతిఁ బోల్పగునీలశైలముం
డీకొను మేను మేటిజగతీధరధారి మరా ...
... ... ... ... 3

ఉ. అంచితపక్షపాతగతి నారయఁ గూరుట గల్గి శారదా
చంచలనేత్రి హంసికిరియఁ జారునిజాననపద్మమందుఁ గ్రీ
డించ సుఖించుపో ... ... ...
... ... కంబుగ. నన్నయమంత్రి దేచనిన్.

సీ. సజలవలాహకశ్యామమోహనమూర్తి, భరిగాలికి నేత్రపర్వ మొసఁగ
వీరరసాం ... ... ... ...
... ... లంబులు, నెలపూవు నమృతంపుఁగలిమిఁ బోల్పఁ
దరళదంష్ట్రాధాళధళ్యంబులును ధూమ్రఘనప్రభాంకురము లున్నతిఁ దలిర్పఁ

గీ, గొండపీటి ... ... ... ...
... శ్రీవీర♦శరభమూర్తి, పోషిను నూరన్నధీమణి♦దేచమంత్రి. 5

చ. అమృతకరావతంసుతల♦కుండలియేటిజలంబుఁ గోరి తుం
డము గొ ... ... ... .
... ... ... యుగ్మవి
భ్రమము వహించుహస్తిముఖుఁ ♦ బ్రార్థన చేసెద విఘ్నసిద్ధికిన్. 6

ఉ. అధ్వరకర్మకౌశలస♦మంచితు మానసపద్మకేలితో
ఉధ్వజ ... ... ...
... ... ... ణిన్
సాధ్వనుభావు మస్కరుఁ బ్రసన్ను భజించెద శైలనాహ్వయున్. 7

మ. కలశాంభోనిధియాఁడుబిడ్డ శశికిం ♦ గారాబుతోఁబుట్టు ..
... ... ... ...
... ... నిరతైశ్వర్యం బవార్యంబుగా
నలఘుప్రాభవు నూరయన్నవిభు దేచామాత్యు నిత్యోన్నతున్. 8

సీ. సింహా ... ... ... ... ...
... ... భోజ, సైంధవీకృత మద♦స్ఫారహంసి
ప్రియసఖీకృతమన♦ప్రియదపాండురకీర, సరసీకృతాంభోజ♦జాతవ (దన)
... ... ... ... ...

గీ, ... ... ,రణిత మణిమయవీణా♦పితరఝంకృ (?]
యా సమాశ్లిష్టపుస్తక♦హస్తాంతరంగ, శారదా దేవి మతిఁ గృతీ♦శ్వరున కొసఁగు.

శా. సంసా(రాహ్వయసింధు)పోతము జగ♦త్సంబోధదీపాంకురున్
కంసారాతిపదాబ్జబంభరము సా♦క్షాత్పద్మగర్భున్ బుధో
త్తంసంబున్ శ్రుతిసంకరోద్దళనపా♦ణిక్షీరభేదక్రియా
హంసంబున్ బరిశీలితస్మృతిరనున్ ♦ వ్యాసున్ బ్రశంసించెదన్. 10

క. శ్రీరామాయణదుగ్ధాంభోరాశిసుధామయూఖు ♦ బుధవినుతగుణో(ణా)
దా(ధా)రు నఖుమత్తవారణ, వారణరిపుఁ బ్రస్తుతింతు ♦ వాల్మీకిమునిన్. 11

ఉ. గ్రాంథికసన్నుతప్రతిభఁ ♦ గాంచి రసజ్ఞత మించి యాతిమ
గ్రంథము లుగ్గడించి ఫణి♦రాట్పరికల్పితశాస్త్రవీధికిన్
బంధువు లైనసత్కవులఁ ♦ బ్రార్థన చేసెద దుష్ప్రబంధసం
బంధమహాంధకారఖర♦భానుగభీరవచోమచర్చికన్, 12

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును, విశిష్టసత్కవికీర్తనంబును బరిఢవించి యొక్క ప్రసిద్ధప్రబంధరచనాకౌతూహలంబు మనంబునం బెనంగొని యుండునవసరంబున. 18

సీ. మహితమూలస్థాన◆మల్లికార్జునశిర,స్స్థలచంద్రచంద్రికా◆ధవళిమంబు
చెదలువాటీపుర◆శ్రీరఘూద్వహభుజా,స్తంభరక్షణవిధా◆సంభృతంబు
వేదండముఖతుండా◆గ్రోదితపద్మసౌ,గంధికగంధపా◆ళింధమంబు
రాజబింబాననా◆రాజితగాంధర్వ,మాధురీసాధురీ◆తీధరంబు
గీ. కరటికటనిర్గళద్దాన◆నిగనఖిక, మగ్రిమాతనసృష్టిజం◆బాలితాఖి
లావనీపాలమందిర◆ప్రాంగణంబు, గుసుసమృద్ధులసయిదోడు ◆ కొండవీడు. 14

మ. పరగంగన్ వారిధివేష్టితాఖిలమహీ◆భాగంబునన్ రెడ్డిభూ
వరసింహాసనమై శుభాయతనమై ◆ వర్ధిల్లుతత్పట్టణం
బురుబాహాబలసంపదం బెనుచు భద్రో◆ద్యోగి నాదెండ్లగో
పరసాధీశుఁ డశేషబంధుకుముద◆ప్రాలేయధామాకృతిన్. 15

సీ. భూధురంధరభావ◆మున భోగిపతి యయ్యు, విప్రవరాసక్తి ◆ వృద్ధిఁ బొంది
పరవిక్రమప్రౌఢి ◆ నరసింహుఁ డయ్యు నెవ్వుడు హిరణ్యకశిపు◆స్ఫురణ గాంచి
దివ్యభోగవ్యాప్తి ◆ దేవతావిభుఁ డయ్యు, బలపోషణఖ్యాతిఁ ◆ బరిఢవిల్లి
ప్రమదకారుణ్యసం◆పద రాఘవుం డయ్యు, శివధర్మపాలన◆స్థితి వహించి
గీ. బాణబాణాసనస్ఫూర్తి ◆ ద్రోణుఁ డయ్యు
సవ్యసాచాలలక్షణో◆న్నతి వహించి
జలధివలయిత వసుమతీ◆స్థలమునందుఁ
గొమరు దీపించు నాదెండ్ల◆గోపవిభుఁడు. 16

సీ. దరహాసచంద్రికా◆ధాళధళ్యంబులు, భుజగేంద్రకాంతాక◆పోలములకు
తారహారచ్ఛటా◆ధాగధగ్యంబులు, చారణకామినీ◆స్తనములకును
సంఫుల్లమల్లికా◆చాకచక్యంబులు, గంధర్వమదవతీ◆కబరికలకు
నవచందనాలేప◆నైగనిగ్యంబులు, దివిషన్నితంబినీ◆దేహములకు
గీ. ధవళధామసుధాకార◆దాపటీర
దరసుధావారినిధిసుధాం◆ధఃకరీంద్ర
సాంద్రతరకాంతివిభ్రమ◆సంగతములు
తిమ్మవిభుగోపమంత్రిస◆త్కీర్తిరుచులు. 17

సీ. కరవాలకామారి ♦ కరివధూనయనక,జ్జలము హాలాహలభో♦జనము గాఁగ
పరిచురదానాంబుధా♦రా పద్మ కల్పకా,స్తంబులు వరనీర♦జములు గాఁగ
అకలంకమతిమరా♦ళికిఁ జతుర్నీతివీధి, సాంద్రపయఃపూర♦సరసి గాఁగ
గుణమూర్తికములకుఁ ♦ గోవిదశ్రీతిసీమ, లకుటిలగుప్తి శే♦ఖరలు గాఁగ
గీ, భూమ సప్తార్ణవీన స్తం♦కీమనోజ్ఞ. సర్వసర్వంసహాపూర్ణ♦చంద్రవదన
రాణివాసంబు గా ఖ్యాతి ♦ రాసి కెక్కె,గురుయశోహారి నాదెండ్ల♦గోపశౌరి.

సీ. అరిపురజయలక్ష్మి ♦ హరునిఁ బోలెనె కాని, తగులండు విషధర♦త్వంబు వింత
సంపూర్ణతరకాంతిఁ ♦ జంద్రుఁ బోలెనెకాని, దోషాకరోన్నతి♦దొరలఁ డెందు
నిజభుజాబలరేఖ ♦ విజయుఁ బోలెనె కాని, భీమోన్నతస్ఫూర్తిఁ ♦ బెరుఁగనీఁడు
గాంభీర్యమునఁ బాల♦కడలిఁ బోలెనె కాని, భంగసాంగత్యంబుఁ ♦ బట్టఁ డక్కి
గీ, నఖిలదుర్మంత్రివచనము♦ద్రావతారుఁ
డాత్మపంకజవీథీవి♦హారిశౌరి
కీర్తి గంగాపవిత్రిత♦క్షితితలుండు
గుణమరున్మంత్రి నాదెండ్ల ♦ గోపమంత్రి. 19

ఉ. ఆహవశౌళలపరిహసి♦తార్జునతర్జ సముదీర్ణదైర్య రే
ఖాహృతమేరుసారత మ♦హాద్భుతుఁ డై గుణనిర్జితేభర
క్షోహరుఁ (డై చెలంగునల)♦గోపనమంత్రికి రాజకార్య ని
ర్వాహకుఁ డూరదేచసచి♦వప్రవరుండు దలిర్చు నుర్వరన్. 20

సీ. తనదానవిభవంబు ♦ ధనదానవద్యవి,శ్రాణనప్రక్రియఁ ♦ జౌక వలప
తనవచశ్శుద్ధి శాం♦తనవపౌత్త్రాదులం,తటివారలకు నద్భు♦తం బొసర్ప
తనమూర్తి చూచినం♦తన మూర్ధములు వంచి, దర్పితారాతిబృం♦దములు దలఁక
తనమనస్స్థితి పురా♦తనమహామునివ్యగ్య, మగుశేఁభుత త్వంబుఁ ♦ దగిలి ప్రబల
గీ, ప్రబలుఁ డై యొప్పు నాదెండ్ల♦భవ్యవంశ,దీపతిమ్మప్రధానేంద్ర♦గోపసచివ
రాజ్యసంరక్షణక్రియా♦రక్షబుద్ధి,గోచరుం డూరయన్నయ♦దేచమంత్రి. 21

వ. ఇట్లు మహనీయమనీషి మనఃకమలదివాకరుండును, వివిధవిరోధిహృదయభీకరుం డును, రసనాగ్రజాగ్రదశేష విద్యాసందర్భుండును, నభంగురప్రతిభాపద్మగర్భుం డును, విశ్రుతవిశ్రాణనవిజితసముద్రుండును, విశుద్ధస్వాంతవిశ్రాంతవీరభద్రుం డును, వనీపకపనోల్లాసనవచైత్రుండును, గౌండిన్యగోత్రుండును, సమున్నతసమ స్నతమహాభోగసంక్రందనుండును, నిబిడభుజాబలవిడంబితకుమారుండును, గృష్ణ

ాంబికాకుమారుండును, శాశ్వతైశ్వర్యపురశాసనుండును నగునాత్రిభాగపర
మేశ్వరుం డొక్కనాఁడు. 22

మ. కవులున్ బాఠకులున్ బ్రధానులు సుధీ,గాయకుల్ పురాణజ్ఞులున్
వివిధార్థుల్ సఖులున్ బురోహితులు ను◆ర్వీనాథులున్ జోస్యులున్
ధవళాత్ము ల్గొలువంగ నీడుకోలునై ◆ దైవారుహస్తంబుతో
నవధానంబున నుండి శంకరకథా◆వ్యాసక్తి భాసిల్లుచున్. 23

సీ. కౌండిన్యమునిరాజ◆మండలేశ్వరవంశ,పాథోధినవసుధా◆భానుమూర్తి
బాఁగుమ్మ్రలేశ◆పదపయోజద్వయీ,ధ్యానధారణసము◆దాత్తచిత్తు
మానితాయాతయా◆మా(నామ)భావిత, విపులమహాయజా◆శ్వేదవేది
రామేశ్వరస్వామి◆రమణీయకరుణావి,శేషపోషితవిల◆సితసమగ్ర

గీ. సహజసాహిత్యమాధురీ◆సంయుతాత్మ
లక్కమాంబకు ఘనయశో◆లక్ష్మి నెలయు
రామధీమణికిని బుత్త్రు◆ రామలింగ
నామవిఖ్యాతుఁ గావ్యని◆ర్ణయధురీణు. 24

వ. నన్ను సబహుమానంబుగా రావించి సమున్నతాసనంబునఁ గూర్చుండ నియమించి కర్పూరతాంబూలంబు జాంబూనదపాత్రంబున నొసంగి తారహారాంగుళీయకకంకణకర్ణభూషణపట్టమాంజిష్ఠాదివిశిష్టవిస్తారవస్త్రప్రదానపురస్సరంబుగా ని ట్లనియె. 25

చ. విలసదయాతయామబహు◆వేదవివేకపవిత్రభావసం
కలితము లైనవాక్యములఁ ◆ గావ్యముఁ జెప్పఁగ నేర్తు వాదికా
వ్యలకవితానిగుంభనస◆మున్నతిఁ గాంచినవాఁడ వౌదు నీ
వలఘువచోవిలాససుగు◆ణాకర రామయలింగసత్కవీ. 26

మ. భవపాశత్రుటనక్షమంబు లగునా◆ఫాలాక్షుగాథావలుల్
చెవులారన్ వినుచుండు నెవ్వఁ డతఁ డీ◆క్షింపన్ మహాభాగుఁ డ
ట్లవుటన్ మామకబుద్ధి యెల్లపుడు దీ◆వ్యచ్ఛైవశాస్త్రార్థసం
భవసాంద్రామృతసేవఁ దృప్తిఁ గనుచున్ ◆ భాసిల్లు నిస్తంద్రమై. 27

గీ. హరునికంటెను దద్భక్తు ◆ లధికు లనుచు,వేదవేదులు వివరింతు ◆ రిందు మెపుడుఁ
గాన తద్భక్తసత్కథా◆ఖ్యాత మైన,భవ్యచరితంబు వినువారు ◆ ప్రాజ్ఞతములు.

క. హరభక్తులందు నుద్భట,గురుఁ డధికుఁడు తత్ప్రసిద్ధ◆గుణమణిగణవి
స్ఫురణాభిరామమును నీ,వ రచింపుము కావ్య మొకటి ◆ వర్ణన కెక్కన్. 29

మ. అని ప్రార్థించినదేచధీమణికి ని◆ష్టావాప్తియుం గీర్తిశ్రీ
లనయున్ భాగ్యసమృద్ధియున్ జయముఁ దు◆ల్యాఖ్యాతి వర్తిల్ల స
జ్జనతావర్ణితరీతి నాంధ్రమగు నా◆పాపద్దతిన్ బల్కితిన్
వినుతశ్రీధరితోద్భటస్ఫుటకథా◆విఖ్యాతసత్కావ్యమున్. 30

వ. ఇమ్మహాప్రారంభమునకు మంగళాచరణంబుగాఁ గృతీశ్వరువంశావతారం బభి
వర్ణించెద. 31

## కృతిపతివంశావతారవర్ణనము.

ఉ. ధన్యవివేకశాలి ప్రమ◆థప్రభుపాదపయోజయుగ్మమూ
ర్ధన్యమనోద్విరేఫపతి ◆ ప్రాఘనచఃపరిభూతపండితం
మన్యుఁడు మాన్యకీర్తినిధి ◆ మన్యువిదూరుఁడు పైనయట్టికౌం
డిన్యమహామునీంద్రుఁడు మ◆నీషికులాగ్రణి యొప్పు నెప్పుడున్. 32

శా. ఆవిర్భావము నొందెఁ దత్కులమునం ◆ దత్యుగ్రకీర్త్యావృత
ద్యావాపృథ్వ్యవకాశుఁ డీశపదప◆ద్మధ్యానసంధానవి
ద్యావిశ్రాంతుఁడు సత్ప్రభాభరితశాం◆తస్వాంతుఁ డారాగ్రహా
రావాసుండు పెదన్నమంత్రిమణి కొ◆మ్మాంబామనోభర్తయై. 33

క. ఆజంపతులకుఁ గలిగిరి, భూజనకల్పద్రుమములు ◆ పురహరపూజా
భ్రాజిష్ణు లెలమఁ ద్రియుఁ, దేజోనిధి తిప్పవిభుఁడు ◆ దేచప్రభుఁడున్. 34

క. వారలలోఁ గవిజనమం,దారుఁ డుదారుండు కీర్తి◆ధగధగితదిశా
వారణదంతాచలుఁ డగ,ధీరుఁడు ధీరుచిరమూర్తి ◆ తిప్పన వెలయున్. 35

గీ. చెప్పఁ జిత్రంబు శ్రీయార◆తిప్పమంత్రి,యర్థులకు ధారవోయుట◆కఖిలనదులు
వెచ్చపెట్టంగ నీక్షించి◆వృషభకేతుఁ,డభ్రనది నాఁచికొనియుండు◆నాత్మమౌళి.

చ. బిసరుహపత్రనేత్ర యగు◆పేరమకున్ బ్రతివాసరార్చిత
ప్రసవశిలీముఖారిపద◆పద్మయుగుండగుతిప్పమంత్రికిన్
మసృణయశోవిభూషితస,మస్తదిశావదనుండు నిర్జరేం
ద్రసముఁడు సంభవించె జిత◆తామసుఁ డన్నవిభుండు సొంపునన్. 37

సీ. సింహికాసుతుదంష్ట్రఁ ◆ జిక్కి నొవ్వనినాఁటి,సంపూర్ణపూర్ణిమా◆చంద్రకాంతి
పెలుచఁ గవ్వపుఁగొండ ◆ గలఁచి యాడనినాఁటి,క్షీరవారాశిగం◆భీరగుణము
దారుణతరవజ్ర◆ధార యంటనినాఁటి,దైవతాహార్యంబు◆ధైర్యమహిమ
వితతవైరవకరా◆హతిఁ దలంకనినాఁటి,పద్మగర్భునిప్రతి◆భాభరంబు

గీ. సర్వభౌమాధిపతి చేతఁ ♦ జలవ మొంది, బలిమి దిశలను బవనినాఁటిక ♦ ల్పద్రుమములు
వితరణంబును దనరుండ వెలయ నెలయు, నూరయన్న ప్రధానక ♦ రీరవుఁడు. 38

చ. హిమగిరిధైర్యుఁ డన్నవిభుఁ డీశ్వరపెద్దిడమల్లనార్యుగా
రమకుఁ గుమారియై రమకు ♦ నద్భుతసంపద సాటియై మనో
రమకులరూపగర్మృపోరమయి ♦ పౌఢి వహించినకృష్ణమాంబ నె
య్యమున వరించి మించె శివుఁ ♦ డద్రిసుతన్ వరియించు కైవడిన్. 39

సీ. సర్వసర్వంసహా ♦ దుర్వారతరభార, నిర్వాహకభుజాండు ♦ పర్వతయ్య
నీలకంధరహిమ ♦ నాళీకరిపుహార, కైలాసవిభకీర్తి ♦ యైలమంత్రి
శ్రీచంద్రశేఖర ♦ వాచంయమేంద్రసే, వాచారుతరబుద్ధి ♦ దేచమంత్రి
కుంపలిమండలా ♦ ఖండదోర్దండాసి, మండలాహృతవైరి ♦ కొండశౌరి
గీ. యనఁగఁ గరిగిరి సత్పుత్రు ♦ లన్ననార్యు, భార్యకృష్ణాంబకును నిత్య ♦ భాగ్యనిధికిఁ
బ్రబలభూపాలకోటీర ♦ మణిమయూఖ, రాజినీరాజితాంఘ్రిని ♦ రేజ లగుచు. 40

క. భూభాగజంభభేదను, నాభోగదలీపతుల్య ♦ నరపరమాన్య
శ్రీభరితు నూరపర్వతుఁ, బ్రాభవనిధిఁ బ్రస్తుతింతుఁ ♦ బటుతరఫణితిన్. 41

సీ. నిటలలోచనజటా ♦ పటలాంతరమునకు, భాగీరథీపయో ♦ భారధార
జంభభంజనపురీ ♦ కుంభివల్లభకర్ణ, సీమకు నభిరామ ♦ చామరంబు
జలజాతభవసహా ♦ స్తనకుంభపాళికి, నవపద్యతరహృద్య ♦ హారయష్టి
సంపూర్ణపూర్ణిమా ♦ చంద్రబింబమునకు, విస్ఫురచ్చంద్రికా ♦ విలసనంబు
గీ. నగుచు జగముల విహరించు ♦ నహరహంబు, నిర్నిరోధవిహారమా ♦ నితవిభూతి
మూర్తియూరయ్యసుప్రధా ♦ నోత్తమప్రి, వృద్ధసుస్నిగ్ధసయశో ♦ విశదకాంతి. 42

ఉ. యాచనకామరద్రుమ ము ♦ దగ్రతరాంతరరాతిపక్రియా
మోచనకారణాంబఖిల ♦ భూజనసంతతసత్కృపాలస
ల్లోచనపద్మపత్రుఁ డతి ♦ లోకగుణాఢ్యుఁడు నై వసుంధరన్
దేచనమంత్రి యొప్పు జగ ♦ తీధరకార్ముకదత్తచిత్తుఁడై. 43

క. ఖండపరశుపదసేవా, ఖండలనందనుఁడు కీర్తి ♦ గర్భీకృతది
క్కుండలుఁ డూరన్నయవిభు, కొండన ధైర్యమునఁ బసిఁడి ♦ కొండన వెలయున్.

వ. వారిలోన. 45

మ. ప్రణుతప్రాభవుఁ డూరదేచవిభుఁ డంభ్యర్చించు హస్తాగ్రకం
కణరుగ్ఘంటాగము లంకురింప విరులన్ ♦ గంధంబునన్ బత్తిరిన్
మణిహారంబులఁ గాంచనాత్మతల కుంభద్వర్ణపంచాత్మకన్
బ్రణవాత్మున్ బరమప్రకాశు గిరిజా ♦ ప్రాణేశు వర్ణింతమున్. 46

షష్ఠ్యంతములు.

క. ఏతాదృశకులమణికిని, మాతాపితృభక్తియుక్తిమహిమాఢ్యునకున్
కాతరజనసురశాఖికి, వాతాశనసార్వభౌమవాగ్వైఖరికిన్.

క. శ్రీకరనిజగుణమణి, క్ష్మాకీర్ణపయోజసంభవాండకరండా
స్తోకాచ్ఛాదనసితవ, స్త్రీకృతసత్కీర్తినిధికి ◆ ధీసన్నిధికిన్.

క. గీష్పతినిభమతికిని వా, స్తోష్పతివిభవునకు నాత్మదోఃఖడ్గలతా
ర్చిష్పతివిపులజ్వాలా, నిష్పీడితనిఖిలవిమతనృపసచివునకున్. 49

క. అలఘుతరహరిద్దంతా, వళికర్ణోద్ఘాతగంధవాహాభరపరి
జ్వలితచలులపరితాపా, నలునకు నసమాన (స్థైర్య)నయధుర్యునకున్. 50

క. శ్రీచంద్రశేఖరాహ్వయ, వాచంయమచంద్రపాదవనరుహసేవా
శ్రీచతురాత్మున కన్నయ, దేచామాత్యునకు సత్యధీనిత్యునకున్. 51

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన యీమహాప్రబంధంబునకుఁ
గథాక్రమం బెట్టి దనిన. 52

కథాప్రారంభము.

ఉ. గణ్యము దండకప్రముఖకాననకోటులయందు సర్వసై
గుణ్యనివారణక్షమ మకుంఠితవైభవశోభితంబు స
త్పుణ్యఫలాదికారణము ◆ భూనుతిపాత్రము నైన నైమిశా
రణ్యము (తేజరిల్లు) మునిరాజనికేతనభాసమానమై. 53

సీ. అచలసుతాభర్త ◆ కర్పించి మఱికాని, మృగములు లేఁబూరి ◆ మేయ వచట
అసమలోచనునకు ◆ నర్పించి మఱికాని, యళులు క్రొవ్విరితేనె ◆ లాన వచట
అంధకధ్వంసికి ◆ నర్పించి మఱికాని, కోయిల లిగురాకుఁ ◆ గొఱుక వచట
అంగజారాతికి ◆ నర్పించి మఱికాని, చిలుకలు పండ్లు భుజింప వచట

గీ. తక్కఁగల జంతువులు శంభుఁ ◆ దలఁచికాని
యుచితవర్తనములఁ గోరియుండ వచట
వదనములు వేయుఁ గలయంత ◆ వానికైన
నాయరణ్యంబుఁ గొనియాడ ◆ నలవి యగునె. 54

మ. హరిణంబున్ బులి వెంచు సింగ మొగి సయ్యాటంబు లాడున్ గిరిన్
బురినీడన్ ఫణిడింభజాలములు నిల్వుం గేకి చిట్టెల్కలం
గరుణన్ బిల్లులజాలముల్ పెనుచుఁ గాకంబుల్ నిశావేళ ఘూ
కరఘూకంబులపొంతఁ గన్ను మొగుచున్ ◆ గాంచి తద్భావములన్. 55

గీ. తలిసి మొత్తంబు లేపాడి ♦ తానమాడి
దిగ్గియలచేరువలను బ్రూ♦దియ లలందు)
కాలమునఁ బల్కుచును ఁదిరియుంబ♦కం యజామ
హా,, యటంచును జలపక్షు ♦ లెల్లయెడల. 56

ఉ. సామగుణంబుఁ గొల్చుఁ బిక♦శాబకపంక్తులు శైవధర్మముల్
పేరిమ నుపన్యసించు శుక♦బృందము లీశ్వరయోగశాస్త్రముల్
కోమలరీతి శారికలు గూడి పఠించు వినోదలీలలన్
గామవిరోధిఁ బాడు నధికంబుగ ముచ్చట భృంగపోతముల్. 57

ఉ. పూచినకోరిపులుం దొరఁగుపుష్పాడిఁ జెల్వగుమావులుం దగన్
గాచినమావులున్ శుకనికాయసమప్రిభ మించుజావులున్
వాచవియైనఁ బంచజనవాంఛలు తీర్చునవంట్లపోరివులున్
జూచి ముదంబునన్ నిలువఁజాతురు తద్వనవీథి దేవతల్. 58

ఉ. నాలుగువేదముల్ గడచనంగఁ బఠించి సమస్తశాస్త్రముల్
మూలము ముట్టఁగాఁ దెలిసి మోహముఖాహితులం జయించి సఠ
శీలిత శైవధర్మగతిచేఁ దనరారుచు నద్భుతస్థితిన్
గాలముఁ ద్రోచియుందురు రశర్వతపోనిధు లవ్వనంబునన్. 59

క. ద్వాదశవార్షిక మగుక్రితు, వాదరమునఁ జేయుచున్నయవర్ణానులసం
పాదితపుణ్యఫలము డా,నై దైవికఘటన సూతుఁ డట కేతెంచెన్. 60

క. ఏతెంచినసూతుం గని, యాతాపసముఖ్యు లెల్ల నతనికి వినయో
పేతమతి నుక్తవిధిచే, నాతిథ్యముచేసి రప్పు డధికప్రీతిన్. 61

సీ. అంతట నర్హాసనాసీనుఁ డైయున్న,సూతు సద్వినయసమేతుఁ జూచి
యప్పుణ్యకుశలంబు నడిగి యాయన దమ్ము, నడిగినఁ దమసేమ మర్థిఁ జెప్పి
యుచితభాషణముల నొక్కింతపడి కాల,యాపనం బొనరించి యనఘచరిత
యఖిలపురాణరహస్యంబు గరతలా,మలకమై యుండు నీమదికి నెపుడు

గీ, శైవధర్మసదాచారసరణి మిగుల, వినఁ బ్రియం బగుఁ జెప్పవే విశదఫణితి
ననుచుఁ ద న్నట్లు ప్రార్థించి యదుగుశౌన,కాదిమానుల కిట్లను నతఁడు ప్రీతి.

చ. అనఘవిచారులార! వినుఁ డాగమతత్త్వమునందు మీరెఱుం
గనియది లేదు నన్నుఁ ద్రిజగద్వినుతోదయుఁ జేయఁగాఁ దలం
చినపని కాదె యే నొకటి చెప్పఁగ నిందు మటంచు నిట్లు మీ
యునికి భవత్కృపాగరిమ నొందితిఁ జెందితి భాగ్యసంపదన్. 63

ఉ. వాలుక లెన్నవచ్చు నుడువర్గము లెన్నఁగవచ్చు భూరజో
జాలము లెన్నవచ్చు నతిచంచలవార్ధివికీర్ణవీచికా
మాలిక లెన్నవచ్చు బుధమండలకర్ణపుటామృతంబు తా
బాలశశాంకశేఖరునిభవ్యచరిత్రము లెన్నవచ్చునే? 64

ఉ. అంగద యోగసిద్ధికిఁ బ్రయాసముఁ బొందఁగ నేల సంశయా
బ్ధిం గడు ముంపుచున్నబహుభిన్నపథంబులఁ బోవ నేల భ
క్తిం గనఁజాల        ను బ్రస్తుతి సేయుచుండినన్
దంగటిజున్న గాదె హిమధామకిరీటుఁడు భక్తకోటికిన్. 65

ఉ. ఆకులఁ గందమూలముల నంబుఫలంబులఁ గూరగాయలం
జేకొని ప్రాణరక్షణముఁ జేసి మహాటవిలోనఁ దీవ్రని
ష్ఠాకలనన్ శరీరము కృశంబుగ నుండిన ముక్తి గల్గునే
ప్రాకట మైనభక్తిఁ బురభంజనుఁ బూజ యొనర్పకుండినన్. 66

సీ. మ్రొక్కు నెవ్వాఁ డష్టమూర్తికి నలపోక,బల నాటఁ డమరులప్రణతి యందుఁ
జల్లు నెవ్వాఁడు ధూర్జటిమీఁదఁ బుడిసెడు,జలము లాతఁడు సుధాజలధిఁ దేలు
నుతియించు నెవ్వాఁడు శితికంఠు నేకవా,రం బాతఁ డలవచోరమణి నేలు
నిలుపు నెవ్వాఁ డీశు నిమిషమాత్రముమనం,బున నాతఁ డామీఁదిపొడవుఁ దెలియుఁ
గీ. గాన మ్రొక్కంగ నభిషిక్తుఁ గా నొనర్ప,వినుతి సేయంగఁ దవిలి భావింప నెందుఁ
దగినదేవాదిదేవుఁ డాతండు సూవె, భుక్తిముక్తు లపేక్షించుభక్తులకును. 67

ఉ. వాసన లేనిపూవు రసవర్ణన లేనికవిత్వరేఖ య
భ్యాసము లేనివిద్య జలజాప్తుఁడు లేనిదినంబు చంద్రికో
ల్లాసము లేనిరాత్రి కమలస్థితి లేనికొలంకు చూడ శై
లాసనివాసు నాత్మలఁ దలంపనిమూఢులజన్మ మారయన్. 68

గీ. చూడఁదగదే వివేకించి సుజనులకును, జంద్రరేఖావతంసునిచరణయుగళి
యెంతచక్కనిదో రమాకాంతుఁ డంత,వాఁడు నందును దనకన్ను వైచె మున్న.

గీ. శైవు లగువారు చెప్పినజాడయందు, నడువ నేరదు మూఢులగడుసుబుద్ధి
వానపై వానగురిసిన నానునొక్కొ, సహజకాఠిన్య ముడిగి పాషాణకులము. 70

సీ. శివపదాంభోరుహప్రవిమలోదకపాన,సిద్ధి నాలుక చవిఁ జెలఁగదేని
శంభుదాసాంగైకసంస్పర్శనంబున, నెమ్మేను పులకల నిలువదేని
త్రిపురదానవవైరిదివ్యలింగస్ఫూర్తి, కన్నులారఁగఁ జూడఁ గలుగదేని
దర్పకధ్వంసిపాదలగ్నపూవుల,తావిపై నాసిక దవులదేని

గీ. కాలకంధరసత్కథాకర్ణనంబు, కర్ణపుటవీథి నందంద కదియ దేని
వానిజన్మంబు జన్మమే వాని బ్రతుకు బ్రతుకె పరదూరుఁడగువాఁడు పశువు దెలియ.

క. శివలింగదర్శనంబును, శివపూజావైభవంబు శివసద్గుణసం
శ్రవణంబును మానవులకు, భవనీరదపటలచటులపవమానంబుల్. 72

సీ. ఏవేల్పు పదముల కింగిరావల్లభు, పలకన్న పూజనావారిజాత
మే వేల్పు కటిసీమ కిభదైత్యనాయకు, బలితంపుఁ జర్మంబు పట్టుచేల
మే వేల్పు తనువున కిక్షుబాణాసను, గరువంపు నెమ్మేను కమ్మబూది
యే వేల్పు చెంజాయ నేపారుజడలకు, విధికపాలశ్రేణి విరులదండ

గీ. యట్టిభువనాధినాథున కాగి దేవు, నకును మానసపుత్త్రుఁడై ప్రకటమహిమ
వెలయు నుద్భటగురుమూర్తి గలఁ డొకండు, సకలభవపాశలుంఠకచతురబుద్ధి.

గీ. అతులదుర్మతకరటిపంచాననుండు, నిఖిలశైవాగమజ్ఞానసఖిమనీషుఁ
డాశ్రితేప్సితదానదివ్యద్రుమంబు, నైనయుద్భటుచరిత నెయ్యమున వినుఁడు. 74

వ. మహాత్ములారా! ఇది మీయడిగినప్రశ్నంబునకు సదుత్తరంబై యుండు నీచరి
త్రంబు భవలతాలవిత్రంబు, నిశ్శ్రేయసక్షేత్రంబును నై వెలయు నని యక్కథ
కుండు కథాకథనోన్ముఖుండై మహర్షుల కిట్లనియె. 75

చ. విలసదుదారనాగకులవిశ్రుత మాశ్రితసర్వమంగళం
బలఘుగణేశ్వరంబు హరిదంబరసంకలితంబునున్ మహో
జ్జ్వలము మృగాంకశేఖరము సాంద్రసితద్యుతిభాసురంబు నై
పొలుపు వహించు తారగిరి భూతపతిం దనభర్తఁ బోలుచున్. 76

ఉ. వాలికకన్నులున్ పలుదపట్రువచన్నులుఁ దీయమోవులున్
నీలపురంగులం దగడ నేర్చినకొప్పులు నిండుచందురుం
బోలినముద్దుమోములును బుత్తడిబొమ్మల గెల్చుపూనిక్కకిం
జాలినమేనులున్ గలుగుసాధ్యసుముఖ్యలు పొల్తు రగ్గిరిన్. 77

చ. సమములు గానిపాదములజాడలు వామపదంబు చొప్పునం
దమరినక్రొత్తలత్తుకలయంకములుం గలతన్నగేంద్రకూ
టములు ప్రియంబునం గని కడంక నుతింతురు సిద్ధదంపతుల్
ప్రమథవిభుండు శాంకరియుఁ బాయక యొక్కట నున్నచందముల్. 78

ఉ. కిన్నరకామినుల్ పసిఁడికిన్నర లంది యభిన్నరీతులన్
దిన్నని పాటఁ గూర్చి జగతీధరకార్ముకపాణిఁ బాడఁగా

మిన్నక యాలకింపుచు నమేయగతిం బులకించియున్నరే
ఖ న్నగ మొప్ప వ్రజకలికాకలితాఖిలసానుభాగ మై. 79

సీ. చిగురుజొంపంబుల నిగుడినకెంజాయ, రుచిరజటాచ్ఛటారోచి గాఁగ
కలయంగఁ గప్పినకమ్రపుప్పొడిదుమ్ము, పొలుపొందుభసితంపుఁబూఁత గాఁగ
సోలుచుఁ బూఁదేనెఁ గ్రోలురోలంబబాలిక లంచితాక్షమాలికలు గాఁగ
తఱచుకొమ్మలవెంటఁ దగిలి ప్రాఁకినవన్యలత లహిభూషణతతులు గాఁగ
గీ. ఇనుక చల్లిన రాలక పసరుడాలు, నాకు దళసరిహస్తిచర్మాంబరముగ
నలరి సాక్షాత్కరించినహరునిఁ బోలి, పాదుకొనియుండు నక్కొండఁ బాదపములు.

సీ. పరయోగశక్తి శంకరు మనఃపద్మంబు,పై జేర్చి మోదించుపాశుపతులు
హరసమారాధనాయత్తులై సందడి,గా విహారము సల్పుదేవముఖ్యు
లఖిలదర్శనములయందు నిందుధరుండె, పరతత్త్వ మని చూచువరమునులు
నిటలలోచనునితొల్లిటివిజయాంకంబు, లమరఁ బాడుచు నాడుప్రమథవరులు
గీ. పావడంబులు గల్చి పాత్రిభసము దాల్చి, భవునిసారూప్యమున నుండుభక్తజనులు
గలిగి జగదేకకల్యాణకరవిభూతి,లక్షణంబుల మించుఁ గైలాసశిఖరి. 81

చ. గుహగణమాతృకావలులు కుంజరవక్త్రుఁడు భృంగియున్ మహా
మహిమయుతుండు నందియు సమంచితభక్తిసమృద్ధిఁ గొల్వ న
య్యహివలయుండు శంభుఁడు హిమాద్రిసుతారమణుండు తద్గిరిన్
రహి వహియించియుండు సురరాజముఖామరపూజితాంఘ్రియై. 82

క. చిగురులఁ గ్రొవ్విరిగుత్తుల, నగజాధిపుఁ బూజసేయ నరుదెంచె ననన్
దగి యొక్కకాలమున నా,జగతీధరవనములన్ వసంతము దోఁచెన్. 83

సీ. భవుఁ గొల్చువారలపాతకంబులరీతి, రమణఁ గారాకులు రాలెఁ దరులఁ
బార్వతీపతిమీఁదఁ బ్రాజ్ఞుల కనురాగ,మునుబోలె నిగురెత్తె భూరుహములు
నీశానభక్తులయిండ్ల సంపదలీలఁ, గలయంగ ననుచుట గలిగెఁ జెట్ల
శశిమౌళిదాసులసంకల్పములభంగి, ఫలియించె నందంద పాదపములు
గీ. సకలపాదపవికసితస్వచ్ఛగుచ్ఛ,సాంద్రమకరందరససమాస్వాదముదిత
మత్తమధుకరజేగీయమాన మగుచు, మించి మధుమాస మావిర్భవించె నపుడు. 84

క. కుసుమితరక్తాశోక,ప్రసక్తిచేఁ బొలుపుమిగులుబంభరగణముల్
కుసుమాయుధ [పేరిమసరా?],గ్నిసముత్థితధూమవితతికిని బోలిక యై. 85

గీ. బాలచంద్రకళాకలాపమునఁ బొల్చి, గమియుఁ గతితోలు నెమ్మెనఁ గప్పుకొన్న
హరుని నడకించె మొగ్గల నతిశయిల్లి, నీలరుచి మీఱుమునిగొరుణీరుహములు. 86

క. కురువిందకమ్మఁదీఁగెలు, సరవిం దమ వనఁగి పెనఁగ సహకారంబుల్
గిరివరతనయాలింగిత,హరమూర్తిం దలఁపఁజేసె నామనివేళన్. 87

వ. ఇవ్విధంబునఁ జిగురులకుం జిగియును, గొన్నెలకుం జెన్నును, విరులకు మురిపెమ్మును, భింగెలకు నందమ్మును, గాయలకు సోయగంబును, దోరలకు గౌరవంబును, బండులకు మెండును గలిగించి పలాయితహేమంతంబుగ వసంతం బర్యేవర్యేడ. 88

ఉ. చల్లనిగాడ్పులన్ సొబగు చల్లెడువెన్నెలఁబువ్వుఁదావులన్
బల్లవవిభ్రమస్ఫురణఁ బ్రౌఢపికాళిశుకాళివల్కులన్
బల్లిదుఁడైనయట్టిగణభర్త భవానియుఁ దాను వేడ్క న
ద్ధిల్లఁగ నెల్లచోట విహరింపఁగ నొప్పె సఖీపరీతుఁడై. 89

సీ. కలకంఠకులకుహూకారాంతరము లైన,మావిమోకలజాడ మరలి మరలి
సొలయూనెత్తావులు చోడుముట్టెడు పుష్పఁ,బొదరిండ్లనెలవులఁ బొదలి పొదలి
అలిబాలికామనోహరఝుంక్రియలఁ బొల్చు,దీర్ఘికాతటములఁ దిరిగి తిరిగి
మకరందపంకిలమంజుమార్గంబుల,నీడల నీడల శేఁగి యేఁగి

గీ. చంద్రికాధౌతనిర్మలచంద్రకాంత,నిచితనవపుష్పశయ్యల నిలిచి నిలిచి
కలికిబాగునఁ బొదలలోఁ గలసి తిరిగి, రతుల దంపతు లావనాభ్యంతరమున. 90

క. విరులం బుప్పొడి రేఁపుచుఁ, దరఁగలు గదలించి కొలఁకు తండంబులలోఁ
జిరుగుచు మందసమీరణ, మరయుచు మురిపెమునఁ దిరిగె నభవునిమీఁదన్. 91

సీ. కమలకర్ణికలు బంగారంపుదుద్దుల,మురువు సూపఁగఁ గర్ణముల ఘటించి
పొగడఁ జోటగుకమ్మపొగడపూవులచేరఁ, గమనీయముగఁ గూర్చి కటి నమర్చి
సిందువారశ్రేణి సీమంతవీధికి, సొబగుముత్యాలచేర్చుక్కఁ జేసి
పాలుపొందుపూఁదేనెఁ బోసి మేదించిన,పొన్నక్రొవ్విరులపుప్పొడి యలంది

గీ. కలయ నవకంపుమెఱుఁగులు దొలఁకరించు,చంపకావలి పతకంబుసరణిఁ జూపి
శంకరుఁడు పార్వతికి నిట్లు సలిపి వేడ్క, శంబరారాతిమదిలోనిశంక యుడిపె.

ఉ. అల్లన మావికొమ్మచిగురాకు నిజాంచితచంచుధారచేఁ
జిల్లులు వుచ్చి తద్రసవిశేషము నాలుక సోఁకఁ జొక్కుచున్
దుర్లిపికంబుఁ జూడు మని ధూర్జటి చూపినఁ జూచి పార్వతీ
హల్లకగంధి వంచె పదనాబ్జము కన్నుల నవ్వు దేరఁగాన్. 93

సీ. తరుణశశాంకశేఖరమరాళమునకు, సారగంభీరరక్తాసార మగుచు
కైలాసగిరినాథకలకంఠభర్తృకుఁ, గొమరారులేమావికొమ్మ యగుచు
సురలోకవాహినీధరషట్పదమునకుఁ, బ్రాతరుద్బుద్ధకంజాత మగుచు
రాజరాజప్రియరాజకీరమునకు, మానితపంజరస్థాన మగుచు
గీ. సురగవల్లభహారమయూరమునకుఁ, జెన్నుమీఱినభూధరశిఖర మగుచు
లలితసౌభాగ్యలక్షణలక్ష్మిఁ దాంగి, యద్రినందన వొల్చె విహారవేళ. 94

క. అలకాంతకలితముఖి యగు,కులకాంతయుఁ దానుఁ గూడి గోపతిగమనుం
డలకాంతకలధౌతా,చలకాంతిస్థలులఁ గ్రీడ సలుపుచునుండెన్. 95

వ. ఇట్లు సాక్షాత్కరించినపంచశరసామ్రాజ్యలక్ష్మియుంబోలెఁ బ్రేక్షణీయ యగు దాక్షాయణిం గూడి క్రీడాపరాయణుండై నారాయణసఖుం డఖండితానంద కందళితహృదయారవిందుండై యుండునవసరంబున. 96

సీ. తేటవెన్నెలమించఁ దెలిచిరా జనిపించు,నకలంకహారవల్లికలతోడ
తేపఁ గాంతులవెల్లుగా వసంతము చల్లు,కటకాంగదకిరీటకములతోడ
తివుట నెత్తావులదిక్కుగుతావుల, నలమి వాసించుమాల్యములతోడ
ప్రకటితంబుగఁ జూపులకు విస్మయముఁ జూపు,రమణీయచిత్రపత్త్రములతోడ
గీ. ప్రమదసల్లాపకోలాహలములతోడఁ,గాంతులొలుకంగఁ దొడసిరాఁ జెంతరాలు
పుష్పాదులతోడగంధర్వముఖ్యు లటకు,సురువిమానంబు లెక్కి వచ్చిరి ప్రియమున.

ఉ. పొచ్చెము గాని సేమమునఁ బోఁడిమికిం దమ మెచ్చి ధాత మ
న్నిచ్చినతద్వరస్ఫురణ నెచ్చుటఁ గొంకొక యింత లేక క
న్నిచ్చకు వచ్చినట్టుల చరించెదువారలు గాన వారు వా
రచ్చటఁ గేల్మొక్కి నిలిచి రాత్మవిమానము లోలి డిగ్గుచున్. 98

క. ఇది రజతాచల మిందున్, మదనారి వసించు విబుధమానిత మని యె
మ్మదిఁ దలఁపక గంధర్వులు, ఒదద్రిపై విడిచి రధికదర్పం బెసఁగన్. 99

క. గంధర్వులు మోహనమృదు,గాంధర్వము గలుగుపుష్పగంధులతో గ
ర్వాంధత నీప్సితమతికలి,బంధురులై తన్నగేంద్రపాదస్థలులన్. 100

సీ. కాంచీకలాపంబు కటిమండలముమీఁద,నొక్కింత సడలినఁ జక్కనిలిపి
పలుచపాలిండ్లకేవల జాఱి నెలిగొన్న,యాణిముత్తెములపై రనువుపఱచి
కలికిచెక్కులమీఁదఁ దొలకరించినఘర్మ,జలకణంబులఁ గాంతు లొలుకఁ దుడిచి
రాలుపుప్పొడి ధూసరము లైనచూర్ణాల,కంబులు కొనగోళ్లఁ గలయ దువ్వి

గీ. అతులపుష్పావచయఘనాయాస ముడుగ, నంకపీఠిక శాంకరి నావరించు
త్రిపురమర్దనుపుష్పమంటపసమీప,వసుధ నిలిచిరి గంధర్వవర్యు లంత. 101

చ. చిలుకలకొల్కు లైనవరసీరుహనేత్రిలఁ గూడి వేడుకన్
గొలకొలమంచుఁ దత్తరకోటులు వ్రాలుడు నందికేశ్వరుం
డలికవిలోచనానుచరుఁ డద్భుతమై దివి నిండఁ బర్వతి
త్కాలకల మోర్వఁజాలక యఖండితకోపకషాయితాత్ముఁడై. 102

ఉ. భీకరరేఖతోఁ బసిఁడిబెత్తముఁ ద్రిప్పుచు ఘర్మబిందుజా
లాకరమై మొగంబు తరుణారుణతేజము లీనఁ గన్ను లు
ల్కాకళిలన్ జ్వలింపఁ దమకంబున శంకరుపువ్వుటింటియ
వ్వాకిట నిల్చి యిట్లనియె వారలతోఁ ద్వరమాణవాణియై. 103

క. చీకులరె మీర? లీశుఁడు, లోకేశ్వరుఁ డీవనంబులో నీశ్వరితో
నేకాంతంబున నుండఁగ, నీకాంతలు మీరు వచ్చు టిది తగ వగునే. 104

క. అని తము నిరసించినసం,దినిఁ జేరికిఁ గొనకవారు దిగ్గన మాఖ్యం
బునఁ బుష్పఁజప్పరము డా,సిన వప్పగ మాత్ర వెతేఁగి శివుఁడు కుపితుఁడై).

గీ. పులుఁ గరంబునఁ బూని మీరలు పిశాచ,రూపమున నుండుఁ డని నైజ రూపరేఖ
దప్పి వికటాంగు లైరి గంధర్వనాథు,లెంతవారికిఁ దప్పునే యీశ్వరాజ్ఞ? 106

క. ఆయందము లాచందము, లాయద్భుతరూపరేఖ లామంజుసుధా
పాయిరోక్తులు మిడిపోయెను, గాయజహరుకినుకకతన గంధర్వులకున్. 107

క. కొఱకును బోనం బడిక,ల్లుఱక పయిం బడినకరణి నొకపని కై రా
నులుమనిపిడుగ్గ వారి(కిఁ, గఱకంఠునిచేత) నీచగతి వాటిల్లెన్. 108

గీ. చంప నలిగినను నొక్కింత చలము మాని,విషమనయనుండు పులి నాకి విడిచినట్లు
చావుతోడుత జోడైనచటులఘోర,కష్టరూపంబు వారికి గలుగఁజేయ. 109

సీ. ఎఱసంజకెంజాయ నెక్కుసక్కింబొడు,చికిచికిపళ్లవెండుకలవారు
గమకంబులగు గచ్చకాయలఁ దలఁపించు,కూరంబు లగుమిట్టగుడ్లవారు
ముడిబొమ్మలును బెద్దమిడిగుడ్లు వెడఁ గోర,దౌడలు గల్గువక్త్రములవారు
పెనుబీఱవరములు పెనఁగి పైఁ బొరికుటఁ, గనుపట్టుపొట్టపొంకములవారు

గీ. కుఱుచలగు హస్తపాదముల్ గుదియఁ బొడిచి,నట్లుబలసినమెడలతో నరయనూచ
లైనయూరులతో వికటాంగు లైన,వారు నై రిట్లు గంధర్వవరులు వెలుచ. 110

చ. పెదవుల నెత్తు రుండియును బేడులువారు బరళ్లమేనులన్
గదిసి పిశంగరోమములు గ్రమ్ముకొనన్ నిశితోగ్రదంష్ట్రిలన్

చెదరినవిస్ఫులింగములు చిందఱవందఱ గాఁగరూపముల్
ఘనవనవిరోధిభావమున మార్పడిరొక్క ఖచరేంద్రపంక్తికిన్. 111

మ. చటులోదగ్రకరాట్టహాసములఁ గేళచ్ఛన్నఘోరాస్యముల్
కుటిలక్రూరవిలోచనంబులు మెఱుంగుల్ గ్రాయుఫూత్కారముల్
కటుభీమోద్భటదంతపీడనము లస్పష్టాంగసంధుల్ మహా
ఘటపీనోన్నతకుక్షిభస్త్రికలు వేగం దాల్చి రాఖేచరుల్. 112

వ. మఱియు భల్లూకపల్లభుల నుల్లసంబాడెడువల్లజుంజులుమేనులును, దష్టారకూట చ్ఛాయాదాయాదంబు లగుపిశంగాంగంబులును, మంకెనక్రొవ్విరులబింకంబు హుంకరించుకెంపు సంపాదించుపొడవు గలయొడళ్లును, గలిగి కిలకలభాషణం బులుం గహకహాట్టహాసంబులును, ధళధళద్దంష్ట్రాంకురంబులును, ధగద్ధగత్ప్రేక్ష ణంబులుం గనుపట్టి యెక్కడ యసృక్పానం బెక్కడ మాంసభక్షణం బెక్కడ మేదోలేపనం బెక్కడ కపాలధారణం బనుచుఁ గోరిక లీరికలెత్తఁ జిత్తంబులు మత్తిల్లి పందడింపుచుఁ గ్రిందుకొనుపిశాచబృందంబులఁ జూచి డెందంబునం గొం దలం బంది తదధినాథుం డగుచిత్రరథుండు. 113

సీ. కలికినీలపుఁగంగుఁ దూలకించుకచములు, వల్లవెండ్రుక లైన బ్రిమసి బ్రిమసి
నిండుజవ్వనముచే గండుమీఱినమేను, వికలభావం బైన వెలిచి వెలిచి
కమనీయమణిహారకటకకంఠిక లెల్ల, నాంత్రబంధము లైన నలికి యలికి
యొల్లదిక్కులఁ దావి చల్లుగందపుఁబూఁత, మెదడుచందం బైన బెదరి బెదరి

గీ. కటిపటము పచ్చితో లైనః గలఁగి కలఁగి
యువ్విధం బెల్ల హరుచేఁత యగుట దెలిసి
యభవునకు మ్రొక్కి లేచి యి ట్లనియె భక్తి
భయము లొనగూడ నూపిరి పట్టి యపుడు. 114

ఉ. ఓపరమప్రభావ! పురుహూతముఖామరవంద్య! మేము నీ
పాపలవంటివారము కృపాపరతంత్రత దక్క యక్కటా
మాపయి ని ట్లనుగ్రహము మానుటయే మఱి యింతమాత్రలోఁ
గోపము మానుమయ్య! యిఁక గోపతికేతన! దైత్యఘాతనా! 115

సీ. తలఁప వైతివె కాలఁ దాఁచి పై నుమిసిన, యొఱుకమాలినయట్టియొఱుకవాని
ధృతిఁ జిత్తమున మానితివె తాలుగోనిఱువ్వ, సాంఖ్యతొండఁడు సేయుసాహసంబు
చింతింపవైతివె సేవ వంటను బెట్టి, కొన్నకుంతీదేవికొడుకుఁగుఱ్ఱ

ఊహింపవైతివె యుగ్రధాటీచలచ్ఛరమక్షితిపతిచేతిగాసి
గీ. అకట నీబంటుబంటుల మైనమమ్ము, నొక్కతప్పును సైరింప కుఱక ఘోర
శాపదావానలంబున సగముచావు, చంపితివి చాలు నీకఁ బ్రోవు చంద్రజూట.
చ. తెలియఁగ లోకపూజ్యుఁ డగునీచెలికానిఁ గుబేరుఁ గొల్చి మే
ముఱక వికారభావమున నొందుట నీకుఁ గొఱంత గాదయి
గ్గెలుఁగక మందమేలమున నే మొనరించినతప్పు గాని యం
దఱఁ గరుణారసాబ్ధిఁ బరితాపము మాననఁ దేల్చు శంకరా. 117
గీ. మృత్యుదేవత యోర్వదు మిహిరతనయుఁ
డోర్వఁ డిభదైత్యనాయకుఁ డోర్వఁ డెందుఁ
ద్రిపురదానవు లోర్వరు తీవ్రమయిన
నీదుకినుకకు నే నెంత నీలకంఠ! 118
క. కలుషించి తేల తృణకల్పుల మగుమామీఁదఁ గరుణ వోనాడి కటా!
బలుదెగఁ గొని బ్రహ్మాస్త్రం, బిలఁ బిచ్చుకమీఁదఁ బూని యేయఁగఁ దగునే?
వ. అని యనేకప్రకారంబుల సకరుణంబుగాఁ బ్రార్థింపుచుఁ బ్రణతుం డైనగంధ
ర్వాధ్యక్షుమీఁదం గృపాకటాక్షవీక్షణామృతంబు వాలయ దాక్షాయణీవల్లభుం
డిట్లనియె. 120
క. ఓహో వగ యుడుగుఁడు మీ, సాహసమున నింత పుట్టె శాపావధి నే
మూహించి తెరువుఁ జెప్పెద, మీపై న్యాయముఁ గొంత యోర్వుఁడీ ధైర్యమునన్.
సీ. అఖిల నార్యావర్త మనుదేశమున లోకమానితవైభవస్థాన మగుచు
నమరుఁ గాండవకాశి యై వల్లకీనామ, మునఁ గల్గి యొకమహాపురము దాని
యుదగ్రభూమికిఁ జేర్వ రుద్ధార్కశశిమండలం బగునొక్క వటంబు వొల్చు
నావృక్షమున నీవు సానుచరుండవై, కృతి నుండు మొకనూఱుదివ్యసమలు
గీ. అంత హాయనములు గొన్ని యరుగుపిదప
రాజకులరత్నమై ముంజభోజుఁ డనఁగ
రాజు జనియించు నుద్భటారాధ్యశిష్యుఁ
డై మదంశంబు గొని యందు నతులమహిమ. 122
క. మాయంశంబునఁ గలిగెడి, యాయవనీపతికిఁ గూర్మి నాచార్యకమున్
జేయు సన్మానసనుతుఁ, డై యుద్భటగురువరేణ్యుఁ డధికప్రీతిన్. 123
ఉ. అగుణమూర్తి కాలగతి నంతటఁ దత్తమధూమయూర్తిచే
వేగ భవన్మహావికృతవేషము లన్నియు మాని పూర్వరే

ఖాగరిమంబుఁ జాల్పుటయు కాదు మదీయగణాధినాథతా
యోగము గల్గి నాకడన యుండెద రేఁగుఁడు భూతధాత్రికిన్. 124

సీ. శివలింగధారణాంచితమూర్తు లగువార, లష్టాంగయోగజ్ఞు లైనవార
లరసి స న్నఖిలంబునందుఁ గన్గొనువార, లాప్తప్రపంచాతురు లైనవార
లెడసినమద్ధర్మ మీడేర్చి మనువార, లంతర్విరోధము నడఁచువార
లసమతాపత్రయం బార్పఁ జాలినవార, లేన దైవం బని యెఱుఁగువార

గీ. లర్హ్యాప్తనమ్ములఁ గూడి యలరువార, లెవ్వరిల గొండుమురు వార లెల్ల మీకు
దుర్లభులు గాన వారలతోవఁ బోకుఁ, డన్యజనములఁ గారింపుఁ డరుగుఁ డీరు.

క. శవశోణితపానాదిక, మవుకుత్సితభోగ మెల్ల నటుఁ సుధాపా
నవిశేషమునకు సవతుగ, భువి మత్కృపచేతఁ గలుగుఁ బొం డిఁక వేగన్. 126

వ. "ప్రారబ్ధకర్మణాంభోగాదేవక్షయ" యనువాక్యం బనుభవింపక తెగదు కావున నిందునకుం గొండలం బడ దలవదు కాలక్షేపంబు సేయక మదుపదిష్టం బగుమార్గంబున శాపావధిం గాంచి మదీయసాలోక్యంబున నుండెదరు పొం డని కుండలిమండలేశ్వరకుఁడలుండు కొండరాచూలితో నంతర్ధానంబు నొందెఁ బిశాచబృందంబులు నమ్మహాదేవునానతింబునం గొంత సంతాపంబు వాసెఁ దదనంతరంబ. 127

మ. భవకోపోద్ధతశాపఘోరపవనభ్రాంతంబులై ఖేచర
ప్రవరాంభోధరబృందముల్ కహకహాప్రస్ఫీతగర్జామహా
రవముల్ దిక్కులఁ బిక్కటిల్ల నటఁ జేరన్వచ్చెఁ గాత్యాతునీ
భవనిర్దిష్టవటావనీరుహనగోత్తాలాగ్రవాసార్థమై. 128

మత్త. ఆవనస్పతియాకుఁదండమునందు నూడలు మొత్తమై
జీవురించు నభోగ్రవీధులఁ జిమ్మచీఁకటిఁ గప్పడన్
ద్రోవ గానక తత్తఱింపుచుఁ దోయజాప్తతురంగముల్
పోవు నన్వలఁ ద్రోచి యంకియఁ బూని నూతుఁ డదల్చినన్. 129

క. ఆయుగము బహుళతరశా,ఖాయతచాలనముకలిమి నవని భరింపన్
జేయూఁదుదిశాకరులకుఁ, జే యిచ్చువిధంబుఁ దోఁపఁ జెలువు వహించున్. 130

గీ. ఇట్లు దిశ లెల్లఁ దానయై యెసక మెసఁగు
నమ్మహీరుహవరము డాయంగ వచ్చెఁ
దీఁగె తెంపుగ రజతాద్రిదిక్కునందు
నుండి ఖేచరమిథునంబు లొక్కమొగిని. 131

క. తొల్లిటిపుణ్యానుభవము, చెల్లిన దివినుండి మహికి జిరజిరమనుచుఁ
దెళ్లెడిపురుషులకై వడి, నుల్లాసం బేది శాఖిశొరగిరి ఖచరుల్. 132

సీ. రా రక్తలోచన! రమ్మ ఘంటాకర్ణ!, రా వ్యాఘ్రనఖ! యిందు రమ్మ వికట
రా సరీసృపరోమ! రా స్థూలనాసిక, రమ్మ కుంభశిరస్క! రా వృకాస్య!
రమ్మ విద్యుజ్జిహ్వ రమ్మాంత్రమేఖల, రా మహోదర! వేగ రా మృతాసి
రా వజ్రదంష్ట్ర రా రా విస్ఫులింగాక్ష, రా బాలఘాతుక! రా విరూప!
గీ, రమ్మ కుంభాండ! రమ్మ నిర్ఘాతఘోష, రమ్మ సుప్తఘ్న! రమ్మ కర్కశశిరోజ
యనుచు బహువిధనామంబు లమర నిలిచి, రావటంబున ఖేచరు లావటముగ.

మ. అలకాచైత్రరథాంతికస్థితమణివ్యాకీర్ణకేలీనగం
బులపైఁ బూవులచప్పరంబులకడన్ బుష్పాళితో సైనవే
దులఁ గూర్చుండి మిటారికత్తె లగునింతుల్ వాడ మోదించువా
రలకా యీదురవస్థ? దైవగతిఁ దీర్పన్ శక్యమే యేరికిన్? 134

సీ. వాసవద్రుమమున వడసినసురఁ గ్రోలు,కడఁక నెత్తురు లానుకతన మఱచి
పగఁగుసాంబ్రాణిధూపంబువాసన మెచ్చు,టలు శవధూమంబు వోలయ మఱచి
హరిచందనముఁ జాల నలఁది రేవఁ జరించు,పోడిమి మెదడుఁ బైఁ బూసి మఱచి
వీణానినాదంబు వీనుల నాలించు,పని భూతకహకహధ్వనుల మఱచి
గీ, హరసఖోపవనాశోకతరులనురువుఁ, జూడఁగోరుట చితిచిహ్నఁ జూచి మఱచి
వాలుపర్గము గాఁగ నవ్వటముఁ జేరి, ఖచరు లొకకొన్నిసమములు గడపి రందు.

మ. పడఁతుల్ దారు నదృశ్యులై నడికికే ల్వారాడి గంధర్వు లె
క్కడ రుద్రాక్షయు భూతియుం దొఱఁగుమార్గవ్రాతముల్ గల్గు న
క్కడికిం బోయి తదీయబాలకుల జోకన్ వారు వే పోయి పె
న్నడుముల్ గైకొని తృప్తిఁ జెందుదురు దౌర్భాగ్యంబె యోగ్యంబుగన్. 136

సీ. తలలపైఁ బచ్చపూసలు కండతిండియు, భీషణదగ్ధాస్థిభూషణములు
శూలాగ్రనరకంఠశోణితాస్వాదంబు, బిలసంస్థశిశుశిరఃఫలలసేవ
నవ్యకంకాళదండములు చేపట్టుట, యూరక నట్టడఁ జిచ్చు లుమియుటయును
బలితంపుఁ జేప్రుల మొలనూలిచేఁతయుఁ, గిలకిలనగుచును బొబ్బనులివుతపణి
గీ, కొఱవిమసిబొట్టు పురి యాకోఱలంచు
నింగలం బిడి రాజించు కెట్టుగుడ్లు
మిడుఁగుఱులు గ్రమ్మఁ ద్రిప్పుచుఁ బుడమి మింట
బ్రమరివాఱుటయును బిశాచముల కొదవె. 137

గీ. చిత్రసౌభాగ్యశాలియై చిత్రరథుఁడు, మాఱ్య నలకాపురములోన సౌఖ్యలబ్ధిఁ
దనరుగంధర్వపతి వజ్రదంష్ట్రుఁ డనఁగ, వటముపై నుండె భూతభావము భజించి.

క. ఆమఱ్ఱియ యలకాపురి, గా మది నూహించి ఖచరగణము లొగి నిజ
స్వామి యగువజ్రదంష్ట్రుఁడుఁ, దాము ను వర్తించు నివ్విధమున శివాజ్ఞన్. 139

క. చెల్లుబడి వజ్రదంష్ట్రుఁడు, పల్లదమున సకలభూతబలముల కెల్లన్
వల్లభుఁడై తనకెల్లా, కల్లగఁ జెల్లింపుచుండె హేలాగతులన్. 140

గీ. ఓలి నెనిమిదిదిశల కొక్కొక్కదిశకు నైవురును నల్వురును గాఁగ నలఘుబలులఁ
దళవరుల ముప్పదిరువుర నెలవుకొలిపి, తాఁ బిశాచాధిపత్య మతఁడు వహించె.

శా. క్రొటన్నీట విషంబునన్ శిఖి నిజప్రాణంబులన్ బాసి వ
ధ్యాటన్ ఘోరపిశాచరూపమున వైరస్యం బొందుత న్మర్త్యసం
ఘాటంబందు[బుంద]నఁ గొల్వుపట్టునపనై కైకొల్వు నానాదిశా
పాటి(వాట)వ్యాప్తనిజాజ్ఞుఁడై చెడనిరేవన్ వజ్రదంష్ట్రుం డొగిన్. 142

వ. మఱియు నతం డాతపతాపంబున జీవితంబు వోవిడిచియు, నిర్ఘాతఘాతంబున మృతి వడసియు, సింహశార్దూలకుంభీనసవృశ్చికాదులచేత నీలిగియు, జిహ్వోత్పాటనంబున జీవితోత్పాటనంబు సేసియు, సానుపతనం బెసియుఁ బ్రాణంబు లుజ్జగించియుఁ గాంతానిమిత్తంబున నంతంబుఁ గనియును, నిరశనత్వంబునఁ బంచత్వంబు నొందియు, శూలంబునం గూలి కాలవశతఁ బొందియు, వెండియు నానావిధదుర్మరణంబులను దుష్కర్మంబులను బట్టువడియు, పుట్టుగతిలేక భూతప్రేతపిశాచరూపంబులం బ్రాపలంబునం గ్రిమ్మరుచున్నవారలం గలపికొని వర్తించి వర్తించి. 143

చ. కొలిచిన యప్పిశాచములఁ గూరిమి నిట్టను వజ్రదంష్ట్రుఁ డీ
రిలు భయ మింక మానుఁడు ధరాస్థలిఁ బుట్టఁగలండు భూరిని
ర్మలయశుఁ డుద్భటుండు గురుమండలకుండలకుండలుండుఁ ద
న్మలహారమూర్తి కారణమునన్ గతి మీకును మాకుఁ గల్గెడిన్. 144

... ... (ఇచట గ్రంథము లోపించి నట్లున్నది.)

సీ. పెఱపరివారల వెలిపించి పనిగొని, కొలిచినవారిపైఁ గూర్మి చూపి
శివచిహ్నదూరుల చిత్తంబు లగలించి, కలహించువారి సీమలు హరించి
యధినాథునాజ్ఞ దిగంతరంబుల నించి, తగులునంతర్విరోధంబు లుడిపి
శరణమభావంబు లరసి జీవిత మిచ్చి, నిజమండలము పెంచు నేర్పుఁ గాంచి

ఆ. దానభేదసామదండంబు లనఁ గల్గు,చతురుపాయవిధులజాడఁ దెలిసి
సరిపిశాచలోకసామ్రాజ్య మొదవించి, వజ్రదంష్ట్రమంత్రి వజ్రముఖుఁడు. 145

సీ. కొలువుండు నొకవేళ గుణపశీర్షోపల,కీలితోన్నతకేలి శైలశిఖల
విహరించు నొకవేళఁ గహకవాద్యనులతో, దడము లొక్కటఁ గొల్వ నడికిరేల
వినుఁ జేరిమ నొకవేళ వీనుల కింపైన,కూశ్మాండగాయకకుముపాట
నండెత్తు నొకవేళ దర్పితబేతాళ,మండలంబులమీఁదఁ జండదాడిఁ

గీ, బనుచు నొకవేళఁ బనువులు తనకుఁదిరుగఁ,బడినవారలసంపద నొడిచికొనఁగ
భూనభోంతరసంచరద్భూతలోక,దండనోద్రగుఁ డగువజ్రదంష్ట్రుఁ డెలమి. 148

గీ, సకలభూతాధినాథుఁడై జగతి నేలుచు,విజయమునఁ గ్రాలుతద్భూతవిభునిఁ జేరి
బ్రహ్మరాక్షను లత్యంతభయముతోడ,రమణ దీవింతు రార్ద్రాక్షతములు చల్లి.

క. ఈచందంబున ఖచరపి,శాచనిశాచరము లిష్టసంచారములన్
నీచగతిఁ బైకొను వసు,ధాచక్రమునందుఁ గలదుఁ దత్కాలమునన్. 148

సీ. శ్రీకంధరాచలోర్జితసముజ్జ్వలకూట,సంకాశవిధుకాంతసౌధకులము
శాతమన్యవశిలాశకలదామజధామ,కల్పితకారండ(గాఢాంధ?)కారభరము
చంద్రకాలాశరచ్చంద్రబింబాననా,తాహారీభవత్తారకంబు
వితతగవాక్షనిర్గతనవాగరుధూప,సౌరభవాసితాశాముఖంబు

గీ, విమలపరిఖాజలాంతరవికచకుముద,కమలకల్హారకింజల్కకలికలలిత
గంధవహధూతరతిఖేదకాముకంబు,గోపురోపమ మగువల్లకీపురంబు. 149

సీ. శ్రీసముల్లాసంబు చెలఁగు నాయందును, దనయందె కల దనఁదగదు సుమ్ము
సంతతార్యాసక్తి సాగు నాయందును, దనయందె కల దనఁగదు సుమ్ము
వృషలాలనఖ్యాతి వెలయు నాయందును, దనయందె కల దనఁదగదు సుమ్ము
రాజభూ(పో)షణకేళి పరిబలు నాయందును, దనయందె కల దనఁదగదు సుమ్ము

గీ, తాన సేనానిగలవాఁడు గాని యేను, గా ననఁగఁబోల దమిత సేనాని యేను
ననుచు నప్పురి హరుపై నహంకరించు, హర్మ్యకేతనకింకిణీకారవముల. 150

మ. వలదిందోపలఖండదీధితులకేవల్ కగంధహాలాహలం
బులు నున్నంబులు భూతి వెల్లపడగల్ మూర్ధస్థితస్వర్ధునీ
జలపూరంబులు లోనఁ గ్రుమ్మరుసతుల్ సాంబాలు పైఁగొన్నయా
యాలరుంబోఁడులయొప్పునై తగుఁ బురిన్ హర్మ్యేశ్వరశ్రేణికిన్. 151

ఉ. కేతువు నీట ముంచి తమకించి ధనుర్లత మల్లఁ బెట్టి వి
ఖ్యాతబలంబుఁ జెట్టులను గట్టి గుణంబునఁ గల్గుపక్షముల్
వేత్రరలించి యంపగమి వేడుకమూలకుఁ దోఁచి యమ్మహో
జాతుఁడు తత్పురిం గలుగు శైవులపైఁ జన లోఁగు నెంతయున్. 152

గీ. అతిమనోహరగుణవిశాలాక్షి యగుచు, నిత్యశివసంవిధానసంస్తుత్య యగుచు
సమరవాహినిగలదియు నై తలంప, నమ్మహాపురి శ్రీకాశి యనఁగ వెలయు. 153

సీ. కడఁగి దీవించి యక్షతలు పైఁ జల్లి, వట్టినమ్రీఁకు లిగురువట్టింతు రనఁగఁ
బ్రతిఘటించినబ్రహ్మపట్టంబుఁ దిగఁద్రోచి, యొకపూరిపైసృష్టి యొనుతు రనఁగఁ
బ్రాహ్మవాదక్రీడ ఫణిలోకపతి నైనఁ, బో[బ]త్రిఁ గన్నులు గప్పిపుత్తు రనఁగఁ
ద్రినయనుఁడే దైవ మని రహస్యస్థితి, నిగమంబులకుఁ దెల్ప నేర్తు రనఁగ

గీ, సఫల వాక్సిద్ధి బ్రహ్మవర్చససమృద్ధి
శబ్దపరిశుద్ధి శివదత్తశాంతబుద్ధి
తార తముఁ బోలఁదగుఁ గాక తత్పురంబు
బ్రాహ్మణులఁ బోల వ్యాససంభవునివశమె. 154

ఉ. ఆడినమాట బోఁకనిమహామహు లర్థికి సంగరార్థికిన్
మాడలు లేల్పువీటఁ గలమాడుగులుం గనిపించు నేర్పరుల్
క్రోడపకచ్ఛపేంద్రకులగోత్రవిభుల్ జయవెట్ట ధారుణిన్
గ్రిడలపోలెఁ దాల్చుకృతకృత్యులు రాజకుమారు లప్పురిన్. 155

గీ. ధనసమృద్ధుల ధననాథుతాత లనఁగ, వర్తకంబునఁ గీర్తిపవిత్రు లనఁగ
వసృతలాభంబు లోభంబు నపనయించి, వీటఁ బొగడొందఁగలరు కిరాటపతులు.

శా. చూడాభూషణరత్నమై వెలయుచున్ శ్రుత్యుత్తమాంగంబులన్
జాడంగాఁ దగువిష్ణుపాదమునకున్ నూను ల్బలోద్భాసితుల్
తోడంబుట్టువు లభ్రిగంగకు మఱుందుల్ పాలమున్నీటికిన్
బ్రోడల్ కీర్తిధనార్జనంబునఁ బురిన్ బొల్పారుశూద్రోత్తముల్. 157

మ. పవిలీలన్ బహుధారలన్ మురియుచున్ బద్మాక్షుచందంబునన్
భువనస్తుత్యనువర్యనోదయముచేఁ బొల్పొందుచున్ వార్ధిరే
ఖవలద్వాహినిచొచ్చునేర్పుఁ గొనుచున్ గర్వంబుఁ గాంచున్ బురిన్
బవనాఖ్యేయజవంబు లైన హయముల్ భవ్యపరిచారఁబులై. 158

ఉ. రాజగృహంబులట్లు బహురాజితకక్ష్యల మించి వాహినీ
రాజియుఁ బోలెఁ బద్మనికరంబులఁ బెంపు వహించి విశ్వధా

తీర్థజనవంద్యవిప్రులగలిగె మహానీయపదక్రమంబులన్
దేజముఁ గాంచు నవ్వరి సుదీర్ఘబలాఢ్యకరిప్రకాండముల్. 159
గీ. చక్రసంపత్తి వాహినీసమితిఁ బోలి
వ్రథిత యగుయుక్తిఁ గాఁవిభ్రమముఁ దాల్చి
యక్షమాలాసదాసక్తి యతుల మీఱి
నగరమునఁ జూడ నొప్పు నున్నతిరథములు. 160
ఉ. మింతురు సత్త్వసంపద సమీరకుమారకుమారముఖ్యులన్
నింతురు కీర్తి నల్లడల నిల్కడఁ బొంది రణాగ్రవీథులన్
గాంతురు వీరధర్మ మతిగర్వితశత్రుతవజ్రపాణులై
సంతతమానుషోదయవిచారులు శూరులు తత్పురంబునన్. 161
సీ. ఇవికావు నీలంబు లివికావు తుమ్మెద, లవియుఁగా వివి కుటిలాలకంబు
లిందునిబింబంబు లివి గావు నెత్తమ్ము, లవి కావు గా వివి మోహనాననంబు
లిభకుంభపాళిక లివికావు జక్కవ, లవియుఁగా వివి మెఱుఁగారుచన్ను
లించువిల్తునిదొన లివికావు కాహళ, లవియుఁగా వివి జంఘ లరసిచూడ
గీ. ననుచు జనములు సంశయం బడిగమింప, మఱిముకతమున, విడిపడ్డమదనురాణి
ముద్దురాచిల్కబోదలమురువు చూపి, భామినులు మింతు రమ్మహాపట్టణమున. 162
చ. సిరులకుఁ బుట్టినిల్లు పరసీమ నిరంతరభోగసిద్ధికిన్
శరణము ధర్మనిర్వృతికి జాడ మహోత్సవిహారలీలకున్
బరిసర మాగమంబులకుఁ బండితపంక్తికి నిల్వనీడ త
త్పురము తదీశ్వరుం డమరుఁ బుణ్యుఁడు శ్రీప్రమథేశ్వరుం డిలన్. 163
ఉ. ఆయతబాహువుల్ వెడఁదయై కనుపట్టుభుజాంతరంబునున్
గాయజుఁ గేరిణిసేయునవకంబగుచక్కఁదనంబు గల్గుల
క్ష్మీయుతమూర్తియుం జనులచిత్తములం గరఁగింప నొప్పునా
గాయుతసత్త్వశాలి తుహినాంశుకులోద్భవుఁ డాతఁ డున్నతిన్. 164
చ. కువలయరక్షకుండు బుధకోటికిఁ బ్రాణపదంబు పార్వతీ
ధవునకుఁ బువ్వుదండ యమృతంబులపెన్నిధి దుగ్ధవార్ధిసం
భవుఁ డిటువంటిరాజు కులభర్తగఁ దేజముగన్నయవ్విభు
ప్రవరునిఁ బ్రస్తుతింప నహిరాజునకైనఁ దరంబె యిమ్మహిన్. 165
సీ. చపలతరేంద్రియాశ్వముల శంకరపాదకమలంబు లనుసాహిణములఁ గట్టి
తాపత్రయాఖిలదావానలస్ఫూర్తి, విలసితవిజ్ఞానదృష్టి నడఁచి

యకలంకకీర్తిచంద్రికల లోకాలోక,శిఖరాలకుం దెలివి నూల్కొనఁగఁ జేసి
చటులవిత్రాపాంకుశము శత్రురాజన్య,కరిశిరస్థలులపై నిరవుకొలిపి
గీ. పలికి బొంకక ఋణముల నెలితిగాక, నడక నడలక యడిగిన గడునుపడక
యన్వయాచార మెడలక యాదిశైవ,లక్షణంబుల నాధరాధ్యక్షుఁ డమరు.
మ. తనజిహ్వాంచలరంగమధ్యమున విద్యావర్తకీరత్న మిం
పున నర్తింపఁ గరాంబుజంబున మరుద్భూజంబుచూపట్టఁ జా
ఫునఁ జింతామణి విశ్రమింప వినయంబుల్ విక్రమంబుల్ జగ
ద్వినుతౌదార్యము బాహువీర్యమును జెందెన్ రాజు రాజత్ప్రభన్ 167
ఉ. భరతభగీరథాంగగయభార్గవరామయయాతిముఖ్యభూ
వరచరితానుపాలన మవశ్యము తెల్లమిగాఁగ భూప్రజం
గురుభుజశక్తికల్మి ననుకూలముగా జనకుండువోలె ను
స్థిరముగ నేలు నైదుపదిసేయఁ డతండు రణాగ్రవీథులన్. 168
ఉ. కానుక రాజధర్మ మని గైకొను లోభముపూని కాదు శి
క్షానియమంబునన్ రిపులఁ గాంచు విరోధముఁ దాల్చికాదు రా
జ్యానుపమానముద్రకు బలావలి నేలు భయంబుఁ బొంది కా
దానరనాథచంద్రుఁడు మహాద్భుత మాతనివర్తనం బిలన్. 169
సీ. కులిశాయుధుఁడు స్వాతిఁ గురియించు వానలు, పైరులు ముక్కారుపంటఁ బండు
పురుషాయుషమ్మును బూర్ణమై గరివోదు, నడవడి చక్కనై నడచుఁ బ్రజకు
ధర్మంబు నాల్గుపాదంబుల వర్తించుఁ, గలుషంబునకు నెడ గలుగ దింత
ధరమీఁద గనులు రత్నంబులు ఫలి(లఫలి)యించు.రవళి ధేనువులు చన్నవిసిపితుకు
గీ. నామయవ్యాప్తి యొక్కింతయైన లేమి.జెజ్జుమని చీఁద రెవ్వారు చిత్రకలన
సోమవంశాబ్ధిపరిపూర్ణసోముఁ డయిన,యానృపాగ్రణి సేయురాజ్యంబునందు.
గీ. చూచు శుద్ధాత్మవీథిలో సోమధరునిఁ
గాంచు శరణన్నమాత్రలోఁ గడిఁదిపగఱఁ
ద్రోచుఁ గలిదోష మెచ్చట దొరలకుండఁ
బ్రోచు నారాజు జనువెట్టి భూమిప్రజల. 171
మ. అలకైలాసమునందు హేమమయకూటాగ్రంబులన్ రత్నని
ర్మలపీఠంబుల నిల్చి పార్శ్వములఁ బ్రేమన్ వల్లభుల్ తోడుగాఁ
గలరాగంబుగ మేళవించి కడువేడ్కన్ సిద్ధకాంతాముఖుల్
శిల లెల్లన్ గరఁగంగఁ బాడుదురు సంశీలించి తత్కీర్తులన్. 172

సీ. కట్టింపఁ డేలకో కటిని రింగులువాఱ, మెఱుఁగుటొల్లియగాఁగ మేకముతోలు
సవరింపఁ డేలకో శంఖతుల్యగ్రీవ, వదనంబు నాలుగాఁ బాఁపపేని
నెలకొల్పఁ డేలకో నిటలభాగమునఁ గా,శ్మీరబిందువుగాఁగఁ జిచ్చుఁగన్ను
ఘటియింపఁ డేలకో కలికిచుక్కలరాజుఁ, దలమీఁద మల్లికాకళిక గాఁగ
గీ. నలఁదఁ డేలకో నెమ్మేన నంగరాగ,విలసనము చూపు వల్ఫలనెల్లపూఁత
యఖిలలక్షణశేఖరు నరసిచూడ, నాదిరుద్రుండు గాఁడె యీయవనివిభుఁడు. 173
క. రుద్రాక్షఖచితభూషా, ముద్రాంగుఁడు శివగుణోక్తిముఖరితముఖుఁడు
న్నిద్రభసితాంగరాగుఁడు, క్రమానుతకటకనిభుఁడు ఘనుఁ డతఁ డలరున్. 174
ఉ. పూర్వభవంబునన్ హరునిపూజకుఁ బత్త్రి దే హుటాహుటిన్
బర్వతకోటులం దిరుగఁ బ్రస్త్రఘాతముచేత నెత్తురుల్
పర్వఁగఁ జేసి యన్నృపతిపాదపయోజము లప్పు సర్వదృ
క్పర్వము లయ్యె నవ్విసపాల కిరీటమణీమరీచులన్. 175
సీ. తిలయుతాక్షతల దూర్వలఁ గమ్మపువ్వులఁ, బిల్వదళంబుల బిసరుహములఁ
గలువల బోండుమల్లెల నాగకేసరంబుల దవనంబునఁ దులసి మాచి
పత్రిఁ జేమంతి బంతి పారగ్వధంబులఁ గాంచనంబులఁ బొన్నవిరుల
మరువంపునవలఁ గన్నెరులఁ బలాశపత్రి,సహముల జాజులఁ జంపకముల
గీ, సాంద్రఘనసారమయగంధసారచర్చ, ధూపముల దీపముల ఫలాపూపపాయ
సాదులను దృప్తి గావించు నతఁడు మంత్ర,పూతజలధాతమూర్తికి భూతపతికి.
సీ. అంత్యజుండును విరూపాక్షుఁ గాఁడనువానిఁ, జూచును బోడపుర్వుఁ జూచినట్లు
పసిబాలకుఁడు వేడ్కఁ బాపణమ్ములఁ గూడఁ,బెట్టు నీశ్వరుగుడి గట్ట ననుచు
నతిదరిద్రుం డైన శైవారాధనమునకు, బోదపెట్టు ప్రాణంబుఁ గుదువపెట్టి
యఖిలదూషకుఁ డైన నాహార మొల్లఁడు, భసితంబు నొసలిపైఁ బ్రామికాని
గీ, గొల్లవాఁడును శివకథాగోష్ఠిఁ గొంత, ప్రొద్దుపుచ్చును గడుభక్తిఁ బొలములోన
సకలశివభక్తమకుటాగ్రజాతిరత్న,మతఁడు పాలించుధారుణియందు నెల్ల. 177
సీ. ముగ్ధచంద్రకిరీటుమూర్తి వీక్షింపని,ఖలుని వీక్షింపఁడు కన్ను విచ్చి
వృషభేంద్రవాహనువిమలచారిత్రంబు, పలుకనిజడుతోడఁ బలుకఁ డర్థి
హరునర్చనావేళ నంటఁగానని నీచు, నంటండు కలఁ గాని యవసరమునఁ
బురవైరి మానసాంభోజకర్ణికఁ గూర్పఁ, దలఁపనికష్టాత్ముఁ దలఁపఁ గోరఁ
గీ, దక్షికానాథునగరికి నరుగనట్టి,భాగ్యహీనులభవనంబు బజ్జ నరుగఁ
డఖిలశైవరహస్యసిద్ధాంతవేది, పరమనిర్మలగుణవార్ధి పార్థివుండు. 178

చ. జడసులు మేరగాఁ గలరసావలయంబు నిజాంసపీఠిపై
నిడి పరమేశ్వరుండు పరమేశ్వరతుల్యుఁడు వృద్ధిఁ బొందుచోఁ
బుడిసెఁడునీళ్లఁ బూన నొకపువ్వు నెఱుంగనిపాడుగుళ్లలో
మృడులకుఁ గల్గెఁ గుంకుమవిమిశ్రితనీరము రత్నహారముల్. 179

సీ. క్రోధాదిరిపులమార్గంబున లోనఁ దలపోయుఁ, దలపోయుఁ బ్రభుశక్తిబలము వెలిని
అష్టాంగయోగవిద్యల లోనఁ దలపోయుఁ, దలపోయు సత్కీర్తిచెలువు వెలిని
మనను శంకరుఁ గూర్చి మన లోనఁ దలపోయుఁ, దలపోయు ధరఁ జేయుపాలుప వెలిని
చపలేంద్రియములశిక్షకు లోనఁ దలపోయుఁ, దలపోయు ఖలులఁ బోఁదఱుమ వెలిని
గీ. లోనఁ దలపోయు భవములు మానుపూన్కి, వెలిని దలపోయు లోభంబు వీడనాడ
నౌర! సాక్షాత్కరించినయాదిరుద్రుఁ, డఖిలరాజర్షిమార్తాండుఁ డవ్విభుండు.

ఉ. కుండలిసార్వభౌమకృతకుండలకృత్యనమాకశత్రుఁ బ్ర
హ్మాండములోన గల్గినచరాచరసులయందుఁ బూర్ణుఁడై
యుండ నెఱింగి యాన్నృపతి యుత్తమశత్రులదుశ్చరిత్రులన్
గండడగించుచున్ గరుణ గైకొని దూలును రాజధర్మమున్. 181

సీ. చివికినపథికరశ్రేణిఁ దాల్చుట మాని, జడఁగైన విరిదండ ముడువఁ గోరి
తూలిపోయినపులితోలుఁ గట్టుట మాని, గట్టికెంపట్టును గట్టఁ గోరి
వేమఱుఁ బితృవనభూమి నుండుట మాని, సురసౌధములలోన నుండఁ గోరి
జవముమాలినజరద్వృషము నెక్కుట మాని, హయసమూహము నెక్కి యాడఁ గోరి
గీ. సగము మగరూపు మాని లక్షణసమగ్ర, పుంవపుస్ఫూర్తి నిరతంబుఁ బూనఁ గోరి
రాజమూర్తి వహించినరాజమౌళిఁ, బోలె పొలుపొందె నమ్మహీపాలవరుఁడు.

మ. జగదేకస్తవనీయుఁ డాన్నృపతి యీచందంబునన్ ధాత్రి మె
ప్పుగఁ బాలింపుచు నన్నకాలమున నత్యుగ్రానుకంపాన్వితం
బగుచిత్తంబునఁ జిత్తజారి నిజశాపాయత్తు లౌ ఖేచరేం
ద్రగణాధ్యక్షులఁ బ్రోవఁగాఁ దలఁచె నంతం దత్ప్రసాదంబునన్. 183

ఉ. కోమలచంద్రరేఖ గలకొప్పును ఫాలవిలోచనంబుఁ బెన్
బాముసరంబుచే నమరుబంధురకంధరముం దలంపులన్
గామవికారముల్ నిలుపుగంధము గల్గి యొకండు పుట్టె జ్యో
త్స్నామహిమాస్పదంబు లసత్సాంద్రతనుప్రభ లుల్లసిల్లఁగాన్. 184

క. అద్భుతముగ నీకైవడి, నుద్భవముం బొంది యున్నయారుద్రగణాగ్రణి నో
యుద్భట! యిటు రా రమ్మని, సద్భణితులఁ జేరఁ బిలిచె శంభుఁడు గరుణన్.

చ. శిలిచిన సూర్ఖుఁడుండు పురభేదనుపాదపయోజయుగ్మముం
దిలకవిభూతిచే మిగులఁ దీఁడ్రి వహింపఁగ మొక్కి పల్కె నం
జలియుతుఁడై తదంతికరసాస్థలి నిల్చి పనేమి సేఁత! యీ
స్థలనికిఁ బోవఁగావలయు వారిక నన్నిపంపు నావుడున్. 187

గీ. జలధరధ్వాననిభ మైనయెలుఁగునఁ బలికి, తారగిరిసానువునఁ బ్రతిధ్వనులు మూరఁ
బుణ్యచారిత్రు మనపుత్రుఁ జూచి, యర్ధచంద్రకిరీటుఁ డిట్లనియెఁ బ్రియ.

చ. విను మనఘాత్మ! మున్ ఖచరవీరులు గొందఱు కుంది నాకు నైఁ
పనిక్రియఁ దుప్పిలినం గినిసి పల్కితి వారిఁ బిశాచులౌ! పొం
డని యిటు లన్నమాత్రనె మహోగ్రనిపాతము వోలె వారలం
గొనమునిఁగించి నాకలుపు కుత్సితరూపులుగాఁగఁ జేయుచున్. 188

క. తలఁచనితలపై యాక్రోశము, నలమినపచ్చాపవాక్యహతిఁ బీడితులై
యులికిపడి ఖచరవీరులు, వల నొండొక టెందుఁ గననివారలు కతనన్. 189

ఉ. కన్నుల బాష్పముల్ దొరఁగఁగా గుమిగూడుక వచ్చి మొక్కి యో
పన్నగరాజభూషణ కృపాపరతంత్రకటాక్ష! మమ్ము నా
పన్నుల ఖిన్నులన్ దలిపివాసినవారలఁ గావు శాంతిసం
పన్నుఁడ వింతకిన్క మదిఁ బర్వితి వంచును నన్ను దూఱుడున్. 190

క. ఏనును గరుణారసమున, మానినడెందంబులోడ నోడకుఁడని యా
దీనుల దైర్యాధీనులఁగా నూఱడఁ బల్కి శాపగతి మరలింపన్. 191

వ. ఒక్కయుపాయాంతరంబుఁ దలపోసి యిట్లంటి. 192

సీ. గంధర్వులార! యాకర్ణింపుఁడీ మత్ప్రసాదంబుఁ దప్పింపఁ దరంబె యేతి
కది యట్లు నుండె మీ ఘనతివినయస్ఫూర్తి, కాత్మ మెచ్చితి దైన్య మడఁగుఁ యుంపుఁ
డని నారావర్త మనుదేశమున వల్లి, సోమవిఖ్యాత మైనపురము
పాలుచుఁ దత్పురరుద్రభూమిచేరువ నొక్కవటము పున్న దందు సంవత్సరములు

గీ. దేవపరిమాణమున నూఱు దీఱఁద్రోయుఁడంత నామూర్తి యగునుద్భటాహ్వయుండు
గురువరేణ్యుండు గలుగుఁదద్గుణపయోధి, కతనమీయట్టిదురవస్థఁ గడచుఁ బొందు.

ఉ. నా విని నన్ను వీడ్కొని పునఃపున రానతు లాచరింపుచున్
డెంగణంబు లేఁగ నతిదీనములై వటశాఖ నుండఁగాఁ
బోవెస నీవు భూస్థలికిఁ బోయి మదీరితవాక్యపద్ధతిన్
శ్రీవిభవాభిరాములుగఁ జేయుము తత్ఖచరాధినాథులన్. 194

సీ. కెంజాయజడలపైఁ గీలుకొల్పినచిన్ని, చెలువంక లేఁతవెన్నెలలు గాయఁ
గుండలీకృతమహాకుండలీశ్వరుఫణా, మణికాంతి మోముఁదామర నలర్ప
విపులవక్షఃపీఠి విధిశిరోన్విత మైన, ఘనమాలికావల్లి గునిసియాడఁ
గటిసీమఁ గట్టినకరిచర్మబొబ్బలితోలు, మెఱుఁగు లాతావీధి మిఱికొనఁగ
గీ. వలుదశూలంబు డమరువు నలిక నేత్ర, మాదియగుచిహ్నములు దాల్చి యలరు నన్నుఁ
బోలి యీలోకమున నుండి పొలుపు గానఁ, గలరు నీదుకరంబున ఖచరులనఘ!.

మ. సకలాశాముఖముల్ సముగ్రరుచులన్ సంఛన్నముల్ చేసి మి
న్నక లీలాసమ మైనయిట్టిబలు మేనన్ ధాత్రి నీ వుండఁగా
దకలంకోదయు యుండితేని జను లత్యంతంబు భీతిల్ల సా
రెకు నిల్పోపరు గాన మానుషవపుశ్శ్రీఁ జెంది పొ మ్మిమ్మహిన్. 196

క. సంసారయోగివై పర,హింసకు లోనీక నమున కేగి యము జీవో
త్తంసుండ వగుచు దిక్కుల, మాంసలసత్కీర్తిఁ దెలుపుమా గురుముఖ్యా. 197

క నావచనమార్గమునఁ జని, పావనమతి పూని భూతపరివృఢు లనత
ద్దేవకు మాననీయులఁ, బోల్పుము పరిమళేశుఁ డేలుపురి వల్లికిలోన్. 198

మ చతురాశావధికుంభికుంభవిలుఠచ్ఛాతపరితాపాంకురుం
బతఁ డంభోనిధివేష్టితాఖిలమహీయుక్షోణిఁ బాలింపఁద
త్పరితపీఠపరిమదాకపోలకలముల్ పారిపింపుఁ గస్తూరికా
యుతనానావిధపత్రిభంగములమారై సరి సకేశచ్ఛటల్ 199

గీ, అట్టిపరిమళేశ్వరునికూర్మిపట్టి యైన, ముంజభోజాహ్వయుఁడు రాజకుంజరుండు
నీకుఁ బ్రియశిష్యుఁడై కీర్తి నిక్కటిల్ల, సాధుసాలోక్యముక్తిఁ జెందంగఁ గలఁడు.

ఉ. గోపతి నెక్కి మంచుమలకూఁతురితో నిట యున్కి మాని నే
నేపురిఁ గాఁపురంబు వసియింపుదు నా ముదిగొండపట్టణం
బో పురుషాగ్రగణ్య భవదుత్తమవంశజాలుం దపోధన
శ్రీపులు నైనధీరులకుఁ జేరుపదం బగు ధామ మయ్యెడిన్. 201

సీ. నిఖిలశైవారాధ్యనేతృగ్వమహిమచేఁ, బరఁగుచు గురుసార్వభౌము లనఁగ
దుర్మతధ్వంసబంధురులైచుఁ బ్రతివాది, జనభయంకరయశస్సాంద్రు లనఁగ
పట్టికులశంభుపూజావరాయణవృత్తి, జరుపుచు గురురాయశంభు లనఁగఁ
గొలుచువారికి విష్టఫలదులై నిజశిష్య, బహుళదారిద్ర్యవిఘాతు లనఁగ
గీ, నన్ను సర్వంబునందుఁ గావఁగఁజాలు ఘనత చేపట్టి వేదమార్గప్రతిష్ఠ
బదిలు లనమండుదుగు భవద్భావితంశ, జాతు లాచార్యముఖ్యులు ధారుణిని. 202

సీ. ప్రతివాదివేదండపంచాననంబులు, నిజధర్మపాలననిపుణమతులు
కలలోననైన నవ్వులకైన భవి యాగు, మాధు నీక్షింపనిగాఢయశులు
షట్కాలములయందు శాస్త్రోక్తమార్గంబు,చే సమారాధించుశిష్టమూర్తు
లిది సుఖ మిది దుఃఖ మిది నాయ దిది వాని,దనివిభేదంబు సేయనిమహాత్ము
గీ, లాపలఘనదాలసు నింతయును మనమున, నఱుతలఁచనినిత్యపుణ్యాభిరాము
లర్థి ముదిగొండపురవరాధ్యక్షు లగుచు, వెలయఁగల రింక మీవారు విమలచరిత!
గీ. ఖచరవరులను రక్షింపఁ గలుగుఁ గీర్తి,వలదు తడవికఁ జేయ నోయలఘుమూర్తి
పావనము సేయుము పాదసంస్పర్శనమునఁ, గలుషయుత మైనవసుమతీతలము నెల్ల.

ఆశ్వాసాంతము.

శా. ధీవిస్ఫూర్తి పయోజ సంభవ భవానీ సంధీశ స్తవోచ్చారణ
పారీణ్యక్షమభావ! భావభవదూరస్వాంతరాజీవ రా
జీవాంభోరుహసంభచామరముఖస్నిగ్ధస్ఫురద్భాగ్య రే
ఖాపాళ్యంకితపాద! పాదనఖశోభాస్ఫోటితోడుప్రభా! 205
క. విద్వజ్జనచింతామణి, విద్విట్కులహృదయభయదవిజయాంక! ప్రతీ
పద్విపధూపదత్రిజ,గద్వినుతసమస్తవస్తుగర్భితధామా. 206
మాలిని. త్రిపురమథనపాదాధిష్ఠితధ్యాన! వేదా
ర్థపరిచయపవిత్రోద్యద్గిరిజిహ్వాగ్ర! మిత్రో
డుపతినయన శౌర్యాటోపనిర్భిన్నదరి దైత్యా
స్థిపరిచితనిజాంగా! ధీపరీతాంతరంగా! 207

గద్యము.

ఇతి శ్రీమదేలేశ్వరగురువరేణ్యచరణారవిందషట్చరణ సకలకళాభరణ
రామనార్యపుత్త్ర సుకవిజనమిత్త్ర కుమారభారతి
బిరుదాభిరామ రామలింగయప్రణీతం బైన
శ్రీమదుద్భటారాధ్యచరిత్రం బనుమహా
ప్రబంధంబునందు ప్రథమా
శ్వాసము.

శ్రీ





# ఉద్భటారాధ్యచరిత్రము

## ద్వితీయాశ్వాసము.



క. శ్రీనగజాధిపచరణ,ధ్యానసుధానుభవలోల దర్పవిదూరా
భానుసమదీప్తిభాసుర, ధీనిత్యా అన్నమంత్రి దేచామాత్యా! 1

వ. ఆకర్ణింపుము. 2

చ. అని పలుకంగఁ దా వినతుఁడై తగ మాఱు వచించి వేడ్కఁ జెం
దినమది వాఁడు వేగఁ జనుదెంచె ధరిత్రి కదృశ్యమూర్తియై
మనమున శంకరుం డను తను మన్ననఁ జేరఁగఁ బిల్చి యప్పుడా
డినఘనవాక్యవైఖరికి డింపనిహర్షము నూలుకొల్పుచున్. 3

సీ. నునుపార బు,గముక్కమై యావటుభాగమున వ్రేల
రుద్రాక్షమయహేమరూఢికుండలకాంతి, నిద్దంపుఁజెక్కుల ముద్దుగులియ
జమిలించితాల్చిన జన్నిదంబుల......య్యానూర్తిఁ బొత్తుదోడుకఁ
గటి ఘటియించినసిరు పింజ,కడకొన్నమోఁకాళ్లు కప్పి దూల

గీ. నొసలిభసితంబు ముఖలక్ష్మి నొసలుసేయ, సనతుదయాదుఁ బంచాక్షరంబు గ్రాల
యూను బ్రహ్మవర్చసము గలిగి, యుద్భటుం డీశ్వరాకృతి నుర్వి నిల్చె. 4

క. హానవాజ్ఞఁజేసి ప్రమథులు, వరవిగ్రాకృతులు దాల్చి వర్ణక్రమముల్
పరితతుష్టిముఖులై వచ్చిరిధర కగ్గురునిపజ్జ శిష్యత్వమునన్. 5

సీ. పరమతంబులు వేరుపట్టినఁ దెరలించి, శైవాగమంబులు జాడపఱిచి
ఇందుశేఖరుతత్త్వ మెఱుఁగక దైవతాంతరలగ్నులగువారి తెరువు లుడిపి
యొందు శంకరుతీర్థ మెసఁగు నచ్చటి కేఁగి, మతిమంతులకు మహామహిమ దెలిపి
శాంతుఁడై లోన విశ్వాసంబు గల్గిన,సచ్ఛిష్యులకు మంత్రిసరణి చూపి

గీ. స్నానదానాదివిధులఁ బ్రసూనబాణ,దమనునకుఁ దుష్టి గావించుధన్యమతులఁ
గలసి వర్తించి మఱిపెక్కుగతులనవనిఁ, బ్రబలి విహరించు నుద్భటారాధ్యవరుఁడు.

క. పరుసము సోఁకిన లోహము, వెరవారఁగ హేమ మైనవిధమున నాస
ద్గురువరుని మహిమకతమున, బరశుభసంపన్ను లైరి వసుధాజనముల్. 7

గీ. భాస్కరుఁడు చీఁకటుల్ బాపంచు గాఁగఁ, గిరణమాలిక చేఁ దోలుకరణి మోవ
నమ్మహాభాగుఁ డద్రిజాప్రాణనాథ, కథల దురితంబు లన్నియుఁ గనుపుగొట్టె. 8

మ. స్ఫురితజ్ఞాననిధాన మాగురుకులాంభోరాశిచంద్రుండు శం
కరుఁడై తాఁ దనుఁ గొల్చువారికి నమోఘశ్రీవిశేషంబులం
దొరకం జేయుచు ధాత్రినుండు దోడ్తోఁ గించిదూనంబుగా
హరశాపాబ్ధచయంబుఁ ద్రోచిరి కుబేరాప్తుల్ పిశాచాకృతిన్. 9

గీ. ఎన్నఁ డుద్భటుఁ డిలఁ బుట్టె నెన్నఁ డిట్టి, కలుషముగ్రశ దిగఁద్రోయుఁ గరుణ
దురితమూలమనప్పిశాచ, పతులపాటులు గడతేర్ప నతఁడు గలిగె. 10

ఉ. తత్సమయంబునన్ ధవళధామకిరీటపదాబ్జభక్తిసం
పత్సుఖవేది రాజకులమండనుఁ డాప్రమథేశ్వరుండు భూ
భృత్సుతవోలె భద్రములఁ జేర్చి ప్రభావతినామధేయమా
వన్నృపాలపుత్త్రి తగువల్లభ గా విలసిల్లె నల్లకిన్. 11

గీ. పద్మినీవల్లభునకును బ్రభయుఁబోలెఁ, గువలయాధీశునకు... ...
... ... ...,నగుచుఁ బొల్చెఁ బ్రభావతీహరిణనేత్ర.

మ. అలిపోతంబులు చంద్రరేఖ మరువిండ్లందంబు ముత్తెంపుఁజి
ప్పలు నూఁగుబువ్వను శ్రీలు శంఖము లతల్ భద్రేభరాట్కుంభముల్
జలదావర్తంబు తరంగముల్ నుడి తమవ్వారంబు చక్రంబు రం
భలు తూణీరము లబ్జముల్ మదిఁ దలంపం గాంతకాంతాంగముల్. 13

గీ. అఖిలజగదేకమోహిని యగుచు, ... ... లోలనేత్రి
తనకు నర్ధాంగలక్ష్మి గా ధర్మమార్గ మునఁ బ్రవర్తించు నమ్మహీభుజుఁడు ప్రీతి.

క. ప్రాలేయకిరణముఖి యగు, బాలామణిఁ గూడి ప్రమథపాలాఖ్యుఁడు భూ
పాలా... ... ... లమనస్కుఁ డయ్యె యౌవనవేళన్.

క. కలిమి సుకీర్తముఁ బ్రాయముఁ, గలిగియుఁ గలకంఠిపొందు గలిగియు లోనన్
గలుగంగనీఁడు దుర్మద,మలహాయ......నృపకులాగ్రణి యెందున్. 16

ఉ. పరమపవిత్రయై తగుప్రభావతితోడుత నిష్టభోగముల్
బొరయుచు నేలనల్గడలు పూని నిజాజ్ఞకు లోనుజేయుచున్
హరుఁ దరుణేందుమౌళి భువనాధిపుఁ భక్తి భజిలచునన్నరే
శ్వరునకుఁ గల్గదయ్యె సుతసంపద సంపదకెల్లఁ బోదియై. 17

వ. ... ... వల్లభుండు వక్షోపవనస్పర్శంబునం గోరకించిన నీప
భూరుహంబునుంబోలె హర్షోత్కవచనంబునం బులకితతనుఫలకుండయ్యెం బ్రి
భావతియుం బ్రాగ్లక్ష్మియుం బోలె వికసితముఖారవిందయయ్యె నిట్లు దంప
తులు సుప్రా........ సంతానులుకాం జెలంగి యన్యోన్యవాక్యామృతంబుల
నితరేతరహృదయంబులు చొలింపుచుం గాశికావిభుం గాద్రివేయమద్రికాము
ద్రికరాంగుళికిసలయుం గిసలయభాసిశితంగటాధరు ధరాశరాసనవిజితవిరో
ధిపురుం బురుషత్రియరూపు నారాధించుతలంపున జగదేకరమ్యంబ[illegible]విముక్త
క్షేత్రంబునకుం బోవ సమకట్టి రంత నొక్కనాండు, 26

మ. పరభూపాలుర దైన్యముం నిజబలప్రాచుర్యముం నిశ్చయిం
చి సాంసారి ధాన్యముం ధనము లక్షీణంబులై యున్కికిన్
బరితోషంబు సహించి మాళవనగరిన్ భవ్యాత్ములం రక్షణ
స్థిరుం జేసి మహీమహేంద్రుండు దలంచెన్ గాశికిం బోవంగన్. 27

ఆ. అమ్మహీధరుండు ప్రాణేశ్వరియుం దాను, హరిశిల్పమైన యరద మెక్కి
విశ్వనాథ పురికి విజయంబుచేసిరి, పుత్త్రకాంక్ష హృదయమాత్రపడంగ. 28

చ. శ్రీపరపూర్ణాభిరామమృదురావములన్ విలసిల్లి లోచనో
త్సవకరమైన తేరు ... లోచనతోడ నెక్కి భూ
భువనవిభుండు వొల్చె మణిపుష్పక మెక్కి వినోదలీలలన్
దివిని శచీపురందరులు ధారుణిపై విహరించు నైవడిన్. 29

సీ. కమనీయకల్లోలకలితకుంభాంభోధి, కడంగి వేలాకాంతం గౌంగిలించెం
బ్రమసంబును నీభావంబు నలదూప, మందగంధవహంబు మలసె దిశల
అతినిర్మలాకారులైరి ఖేచరేంద్రుడు, చలవలించ దోలంకమాయ లీనె
గంధర్వభామినీగాంధర్వములం గూడి, సురపుష్పవృష్టియుం గురిసె మింట
గీ. వినుతవిలసనశకుల చేం దనర వహ్ని, యవని సంపూర్ణసౌభాగ్య మావహించెం
గాశికాభర్త గౌరీశుం గాలకంఠు, నమ్మహీపతి సేవింప నరుగువేళ. 30

గీ. ఇట్లు మందానిలాదిసమిద్ధశుభ, సూచకంబుల వీక్షించుచుం బ్రభావ
తికి నతిప్రీతిం దెలుపుచు ధీరవృత్తి, నానరాధీశుండల్లన నరిగి మోలిల. 31

గీ. భూరికైవల్యలక్ష్మికిం బుట్టినిల్లు, పరమవిజ్ఞానసిద్ధికిం బట్టుంగొమ్మ
యైనకాండిన్యనాశ్రమం బధికభక్తి, సరసె నప్పుడు రవి నిల్చెం జరమశిఖరి. 32

చ. మొదలం బురందరాశం దగ ముట్టితి రాగముతోడం బద్మినిన్
విడపం జెమర్కరించితివి వేడ్కం గరంబులు సాంచి యింక నన్

బోదువకు మించు దూఱుచు నపూర్వదిశాంగన కాలఁ దాఁచినన్
దదమితియావకద్రవముఁ దాల్చెను నా నినుఁ డొప్పె రక్తిమన్. 33

చ. ఉదయమునొందె సానులకు నొద్దికఁ బద్మినిఁ దేర్చె తద్గృహం
బదవదనేసెఁ దత్కువలయప్రిభఁ దూలిచె నట్టి వారుశిం
దుడిఁ గనె నంచుఁ బక్షి జనులు దూలఁగనాడిన నింద యోర్వకో
గొడ[illegible]ని పశ్చిమాంబునిధిఁ గ్రుంకె సరోరుహమిత్రుఁ డత్తఱిన్. 34

సీ. పాటలంబులవన్నె తేట మించెనలబింకము ......క్రుమములసొబగు
పద్మరాగంబులపస పిరియంగుచ్ఛాయ,కుసుమమొప్పిదము కుంకుమము చెలువు
లత్తుకచెన్ను పల్లవసముల్లాసంబు, కాశ్మీరజాంగరాగంబుపూఁత
చక్రవదనంబు హంసములచంచుస్ఫూర్తి, పటుపలాశద్రుమప్రసవకాంతి
గీ, బింబఫలవిభవము చందిరంబుకావి, యాదిగాఁగలగ (పదా)ర్థసమితి
నయవ తేలికి నొకచోట నలమికూర్చి,నవఁగఁ జెలువొందె నెఱసంజయపరిశను.

సీ. అంతటఁ జరమసంధ్యావేళ జపతి, యరదంబు డిగ్గి సంధ్యావార్చ్య
ములు మనంబలరఁగఁ గొలనులోపలఁ దీర్చి, పుణ్యంబులకు జన్మభూమి యైన
(కాండిన్య)నాశ్రమకమఁ గ్గి కనుపట్టె,బహువిశేషములకుఁ బరమహర్ష
మాత్మఁ జెంపెనలార నానిజాన్వయగురు,నుటజంబు డాయంగ నుచితవృత్తి
గీ, నిందుబింబాస్యతోఁ గూడ నేఁగి తనను,రాకఁ బగువారిచే మానిలోకమాళి
రత్నమున కెఱిఁగింప (నా) రంఘునకును, సమ్ముఖంబి బెచ్చెనాతండు సంభ్రమమున.

చ కులపతిపాదపద్మములకున్ సతియున్ బతియున్ బ్రిణామముల్
దిలకితభక్తిఁ జేయుడు సుధీమణి యమ్ము(ని)ముఖ్ మనోంబుజం
బలఘుతరప్రిమోదముయమై విలసిల్లఁగ వారిఁ జెక్కురీ
తులఁ దగ గారవించి సిరిఁ దోఁచినదీవన లిచ్చె మెచ్చుగన్. 37

వ. ఇట్లు కమనీయపరిభ్రాంతియగు ప్రభావతియును సదారాధితప్రమథేశ్వరుండగు ప్రమథేశ్వరుండును మానిమండలమాన్యుండగు కౌండిన్యు నుచితోపచారంబులం బరిసన్నుం గావించి రమ్మహర్షియు రాజునకు నాతిథ్యం బొసంగి యర్ఘ్యాసనంబునం గూర్చుండ నియమించి దర్భపాటికాతలంబగు కరకమలంబున వినమైకసారంబగు తచ్ఛరీరంబు నివురుచు నిట్లనియె. 38

సీ. హెచ్చువచ్చునె పురోహితముఖంబున నీకు, శాస్త్రోక్తనిర్మలాచారసరణి
ఆరగించుదురె వచ్చి యజ్ఞవేళలఁ గోరి, హవిరన్నకబళంబు లమరవరులు
శిరసావహింతురె పిరులదండియ పోలెఁ, బరమండలంబుభూపాలు రాజ్ఞ

గీ. పుత్త్రలాభంబుపైఁ గాంక్ష పొదలుకతన, నదియు నాఁగాక యనివింటినభ్రవాణి
పడుచుఁబని గాదు.....డక గాదు, బయలుపందిరి వెట్టంగఁ బరగునయ్య! 66

క. గౌరీశువలనఁ గానీ, సారయుత(భవత్ప్ర)సాదచాతురిఁ గానీ
యేరీతినైన నా కీ,కోరిక సిద్ధింపఁజేయు గుణరత్ననిధీ. 67

క. అని యీచందంబున నం,(దనుకొఱకై కాం)క్ష చేయుధరణీపతి కో
రినకోర్కి ఫలితమగుతలఁ,పున నిట్లని పలుకు మానిపుంగవుఁ డెలమిన్. 68

క. సంతానలాభమునకై, చింతాసంతాప మేల క్షితివర! గౌరీ
కాం(తామనోహరుఁడు వర,చిం)తారత్నంబు నీకుఁ జేకుఱియుండన్. 69

శా. ఆవైహాయసభారతీవిభవ మార్య(గాహ్య మ్మహాంబుగా
దా విశ్వాసము చేయు మిందున విరూపాక్షుం డుమాభర్త కా
శీవాసుండు... ... ... ...శ్వనిష్టార్థముల్
ప్రావీణ్యంబున దీన సంశయము దాల్పంబోల దుర్వీశ్వరా! 70

క. భవమునకు సత్ఫలంబుగ, భవు నగజాప్రాణనాథు భజియింపుటకై
యవిముక్తభక్తిసంపద, భువి నవిముక్తంబునకును బోవఁగవలదే? 71

ఉ. గుబ్బలకూనిమూఁతుచనుగుబ్బలకమ్మజవాదిగంధముల్
బొబ్బిలఁబూయఁజూఁడని...చూపులు మూఁడగువేల్పుఁబెద్దకుం
గిబ్బలరాచ తేజి నుతికింపుచు ... ... ...
...బ్బినభక్తి మ్రొక్కలిడఁ జొబ్బనమూరఁగఁ గల్గు సౌఖ్యముల్. 72

సీ. గగనగంగోత్తుంగకల్లోలరేఖయును, మల్లికాదామంబు మౌళి నమర
నునుపారువెలిచాయ పెనుబాము ముత్యాల,పేరువక్షఃపీఠి బిత్తరింప
(కాలకూటకఠోరకా)ంతిరింఛోళియును, మృగనాభిముద్రయు మెడఁ దలిర్ప
మెఱుఁగెక్కుమువ్వన్నె మెకముదుప్పటియును, మాంజిష్ఠమును గటి మలసియుండ
గీ. పలుదశూలంబు నుత్ఫుల్లవనరుహంబు, (హస్తములకు) విలాసంబు నాచరింప
నర్ధనారీశ్వరాకారుఁడైన విశ్వ,భర్త కాకాశికాపురి ప్రాణపదము. 73

శా. ఆగంగాజలసేక మావటుకనాథావాససంవీక్షణం
బాగంధేభముఖప్రసాద(విభవం బా)యన్నపూర్ణార్చనం
బాగంగాధరపాదపంకజయుగధ్యానావరాగంబు నా
హా! గీర్వాణులకైన ముచ్చటలు సేయంజాలవే భూవరా! 74

క. అవిముక్తంబులు దక్కిన,యవి ముక్తశరీరజంతుపుంజంబులు దా
రవిముక్తంబులు నీల్గిన,యవి ముక్తము లరసి చూడ నవనీనాథా! 75

సీ. ఒనర నానందకాననమునందనె యుండు, ప్రోదదండనె బన్ను భూతబలము
నమరాపగాజలం బాడఁజూచినధన్యుఁ, డాడఁజూచును లలాటాంబకమున
గజరాజముఖు డుంకెఁ గన నెవ్వనిం గూడుఁ, గూడు వానికిఁ బాఁపకోరచేఁదు
చేరి విశ్వేశుఁ బూజించి మించినపేరు, పేరురంబునఁ బున్కపేరుఁ దాల్చు
గీ. మేన మణికర్ణికామృత్స్న మెత్తుఘనుఁడు, మేనసాయకమున నేయమింటియాల్లి
కాన శ్రీకాశికాపురిఁ గాదిరేయ, సార్వభౌముండు నుతియింపఁ జాలఁ డధిప!
సీ. పేర్చు కెంజడముడి బింజించి నలుదెస, జాహ్నవిసలిలంబు జాలువార
అద్రిజాదత్తనఖాంకంబు నాఁజాలి, గండమండలిఁ జంద్రికళ నటింప
భుజగేంద్రహారంబుఁ బునకపేరును పీకఁ, బృగులవక్షఃపీఠిఁ బెనఁగొనంగ
తోరంపుఁగటిసీమ దుసికిలి పసిదిండి, గలువ మాటికిఁ జెళ్ల పెళ్లమనంగ
గీ. అన్నపూర్ణామహాదేవి యంతనింత, వెంటఁ జనుదేరఁ బ్రమథులు వెఱఁగుపడఁగ
విశ్వనాథుండు భవనంబు వెడలివచ్చి, కాశి నీల్గినవరుఁ జేరి కాచుఁ బ్రేమ. 77
మ. అదె గంగాజలరేఖ యల్లదె శశాంకార్ధంబు ఫాలాక్షు మ
ల్లదె కాకోదరహారవల్లి యదె పద్మాపత్యభస్మచ్ఛటా
సదలంకారవిశేష మల్లదె మహాశాతత్రిశూలాయుధం
బదె యంచున్ నురలందు (రచ్చట మృతుం డా) దేహిదేహంబునన్. 78
సీ. దర్వీకరంబైన దర్వీకరముఁ జుట్టు, మృగమైనఁ గెంగేలు మృగముఁ బట్టు
శార్దూలపతియైన శార్దూలపతిఁ జీఱుఁ, గరియైనఁ గరితోలుఁ గట్టి మీఱు
... ... ...నె మోచు, నెద్దైన వెలిచాయయెద్దుఁ బూన్చు
బోయవాఁడైనను బోయవానిరాడు, నవియైన గావించు నవినవీడు
గీ. పునుకయైనను విధిఁ గొట్టుఁ బునుకడుల్ల, నెముకయైనను మెడఁదాల్చు నెముకపేరు
(గాశికాపురిఁ బ్రవహిం)చుగగనగంగ, నీటఁ దోఁగినమాత్రనె నృపవరేణ్య! 79
మ. కకుబంతంబులవెంట గ్రాసమునకై కాలీచవో పారెసా
రెకుఁ గష్టాశఁ జరింపుచున్ ఫలముఁ దూలింపన్ వృథాయానులై
... ... పరిగళద్విజ్ఞానులై తూలి శా
శికిఁ బోఁగాననివారిజన్మములు వీక్షింపన్ మృతిప్రాయముల్. 80
మ. నుతు లంచున్ సతు లంచు గాంచనము లంచున్ దేరు లంచున్ బురో
హితు లంచున్ బొ ... ... ... ...
సతతమ్ముల్గా మది నమ్మి మూఢుఁడు దురాశాపాశబద్ధాత్ముఁడై
శితికంఠున్ భజియింప లేఁ డహహా! కాశీపుణ్యదేశంబునన్. 81

సీ. పవడరిపుఁబొదరింట బాలహంసముపోలె, జడముడి శశిరేఖ సడలుకొనఁగ
(నాకాశమండలి) నంగారకుఁడువోలె, నిటలపట్టిక నగ్నినేత్ర మమర
వలుదశంఖములోనఁ బొలుచు నీలముపోలెఁ, గంధరమున మచ్చ గానుపింప
అమృతాంబురాశి నీరానుమేఘముపోలె, నెమ్మేనఁ గరిచర్మ మెమ్మె మీఱ
గీ, వలనుమిగిలినభాగ్యదేవతయపోలె, శ్రీవిశాలాక్షి చెంగటఁ జెలువుమిగులఁ
గాశికాపురిఁ బట్టంబు గట్టుకొన్న, విశ్వపతిఁ గొల్వ సౌఖ్యంబు శాశ్వతంబు
క. పాపియము మేనుచాఁచాయా, పాపియ ము విదుఁ(?) నిన్ని కాయ ధంగుర మరయన్
గాయము కాశికిఁ బోవుట, నాయము పేహులకు ధరణినాయక! వింటే!. 83
సీ. పంచేంద్రియస్ఫూర్తి పాఱఁబట్టినఁ గాని, చిత్తంబు నిల్కడ పట్టుకొనదు
చిత్తంబునిలుకడ పట్టియుండినఁగాని, బుధసంగమునకు బుద్ధి చొరదు
బుధసంగమంబునఁ బొరిఁబొరిఁ దోఁచినఁగాని, విధ్యుక్తమార్గంబు వినఁగఁబడదు
విధ్యుక్తమార్గప్రవేశవైపుణిఁ గాని, సత్త్వగుణంబు నిశ్చలము గాదు
గీ, సత్త్వగుణమునఁగాని ధూర్జటియె దైవ, మనువిబోధంబు సమకూడ దందుఁగాని
యొండు దెస ముక్తి గనుపట్ట దుగ్రుఁ డేలు, నగరికడ నీల్గుమాత్రనె తగులు ముక్తి.
సీ. కన్నులారఁగఁ గాశిఁ గనని వానిభవంబు, సలిలంబులేని కాసార మట్లు
కాశి చేరఁగఁ బ్రియంబు గలుగకుండినవాని, భావంబు దలపోయఁ బాడుకొంప
కలదు తీర్థము కాశికకుఁ దుల్యమనువాని, కెందుఁ బ్రాయశ్చిత్త మింతలేదు
కాశికాపురమున్నఁ గడచియొండొకచోటఁ, జేఁగునెవ్వఁడుభాగ్యహీనుఁడతఁడు
గీ, యాగములు వేయు చేయంగనైనఫలము, కోటిగోదానముల నొనగూడుఫలము
పెక్కునల్లిండ్లనిలుపుటఁ బేర్చుఫలము, కాశినొకపూఁట వసియింపఁగలుగునధిప.
క. గోపతిగమనునిపురి గం, గాపగలోఁ బ్రుంకువెట్టునతిపుణ్యులకున్
దాపత్రయం బుడిగి యొక, తాపము బాలమున నెపుడుఁ దరలకయుండున్. 83
సీ. అభ్రగంగాప్రవాహంబు లెన్నియొ గాని, (తలధరియింతు) రందఱును నదులు
పదినూఱుపడగలపాము లెన్నియొకాని, యందఱు సురగేంద్రహారయుతులు
టాలొందుచంద్రఖండంబు లెన్నియొకాని, యందఱు ధరియింతు రమృతకరుని
(విషరాశి) బుట్టినవిషము లెన్నియొకాని, యందఱు హాలాహలాంకగళులు
గీ, గంగనగజవైశ్య లెందఱో కాని యంద, ఱతులకరిచర్మపటధారులైనవారు
కర్మబంధంబు ... , ద్రెంపుకొనకుండ విదిరింపఁజాలుఘనులు. 87
సీ. ప్రతిదినంబును మదభ్రాంతుఁడై సింధువు, పానంబు సేయనీ వైసిహాలి
యొారంతపొద్దు నోరుమూసక కొండెంబు, పలుకనీ లేనివి గల్పి కూర్చి)

... రహింపఁదయే నిత్యకృత్యంబు, గానుండని క్రూరకర్మపరత
కాయికంబుగ సదాకాలంబు హోమంబు, లాగించని దొంగభాగుతోడ
గీ, కవయని యెఱింగియుఁ ... గానివారి, తోడుకని ... ...
గగనగంగాతరంగశీకరము సోఁకఁ, బావనుండగుఁ గాశిలోఁ బంచజనుఁడు. 88
క. ఇలఁగలతీర్థము లాడినఁ, గలుగను హరసూపలబ్ధి గాశికలోనన్
నెల గంగ నాడ నౌదల, నెల(పూఁపధరించు నరుఁడు నిక్కము) వింటే. 89
ఉ. పుట్టువు సర్వదుఃఖములపుట్టినయిల్లని పుట్టకుండ రా
గట్టివివేకియైన నది యెట్లనినన్ దమపూర్వకర్మముల్
తిట్టలు జన్మహేతువులు తీరదు వానిజయింపఁ గర్మపుం
... ... (దెంపఁగ వచ్చును గాశి కేఁగినన్. 90
ఉ. శోకముఁ నూటియై యొకనిఁ గొల్చి తదీరితవాక్యపద్ధతిన్
జేకొని యూడిగంపుఁబని సేయుచుఁ (బాయను సత్తుగా మఱిం
గై ... ... కునుమీకృతశీ ...
... ... ... ... ... 91
[ఇచ్చట మూఁడునాల్గుపద్యములు లోపించినవి ]
గీ. ... ... ... ...
... ... , దొంటిభవమునఁ బుణ్యంబుఁ దొడికినాఁడు. 95
సీ. ఆనందవనమున కరిగెద నని తలంచినఁ దీర్థములకెల్లఁ జనినయట్ల
వారాణసికిఁ బోయినచ్చెద నని పల్క, సకలాగమంబులు (చదివినట్ల)
(ఇదె కాశిపురికిఁ) జేరెదనంచు నొకపదం, బిడ భూమి వలగొనఁ దొడఁగి నట్ల
అవిముక్త మిదె యదె యని డాయఁ జనెనేని, చిరపాపములకడ చేరినట్ల
ఆ, ఆమహాస్మశానభూమి ... ... నేని తేటతెల్ల
గాఁగ ముక్తికాంతఁ గలయుంగఁ జూచుట, యనుచుఁ జాటిచెప్పు మునికులంబు.
ఉ. చాఁచఁడటే పదాంబుజము చక్కఁగఁ గాశికి నేఁగుతోవకున్
దోఁచఁడటే నిలింప ... ... పాపముల్
గ్రాఁచఁడటే వివేకశిఖి కాఁక... ...చె మానవుండు తం
పీఁచము లెత్తకుండుదుర పేర్చినకిన్కఁ గృతాంతకింకరుల్. 97
ఉ. ఆడుదు రొండుతీర్థముల నాడినఁ బాపము ... ...
... .ని. జను లృదము లాడినకాలమునందె బుద్ధిఁబో
నాడక కాశి కేఁగి యమరాపగలోపలఁ జల్లఁగా జలం

బాడుట పుట్టువుల్ విరుగవాడుట ముక్తిని బెండ్లియాడుటల్. 98

స్రగ్ధర. ... ... స్థిత)మణికళికోద్దీర్ణసంపూర్ణకీర్ణాం
శువిశేషశ్రీవిలాసస్ఫురితశశిసరోజాండు ఖండేందుజూటుం
డవధానం బొప్ప గంగాంబ్వపహృతకలుపపాపిణికిం గాశిలోనన్
జివి నోంకారాక్షరంబున్ గురుకరణిఁ దగం జేర్చుఁ బ్రాణాంతవేళన్. 99

సీ. తడవుకాలము వోలెఁ దల్లిగర్భంబున, నణఁగియుండిననిగ్రహంబు వాయ
జననంబుఁ గాంచి యజ్ఞానంబుచేసెన, స్తన్యపానాది ...
ఒదిగి గాసిసార్థమై యొకని సేవింపఁ-బారి, స్తంభసమనసాకటంబు వాయ
ఘనవయోమదమునఁ గన్నుగానక త్రిమ్మ,రఁగ సంభవిల్లినరట్లు వాయ

గీ. ఆమయంబులచేసెన యలఁత వాయ, కర్మపాశంబు చుట్టినకట్లు వాయ
చేరి కన్నుల కతిథిఁగాఁ జేయవలయు,ననవులోచనుతలపూవు నభ్రగంగ. 100

చ. జ్వరము పయోవగాహమున వఁలు మానఁగనేరదందు రి
ద్ధరపయి వైద్యులెల్ల వసుధాతలనాయక! కాశిలోన నం
బరతటినీజలస్పర్శనఁ బాపమహాజ్వరమాఱుఁ గోర్కె శ్రీ
కరహరదైవ్యపుంగవరికామునయోదయజృంభణంబునన్. 101

సీ. మెట్టనీ ధరచుట్టు మెట్టకుండినవాఁడ, మృడునిపట్టణవీథి మెట్టఁడేని
ఆడనీ తీర్థంబు లాడకుండినవాఁడ, యభ్రవాహినిఁ దీర్థమాడఁడేని
చూడనీ యఖిలంబుఁ జూడకుండినవాఁడ, గాశిస్థితులఁ జూడఁగలుగఁడేని
కొలువనీ వేల్పులఁ గొలువకుండినవాఁడ గోరాజవాహనుఁ గొలువఁడేని

గీ. చదువనీ వేదముల్ నాల్గు చదువకున్న,వాఁడ శివకథ చదువనివాఁడయేని
వేయు చెప్పంగనేల పృథ్వీతలేంద్ర! కాశికేఁగినఁగాని మోక్షంబు లేదు. 102

ఉ. తేలుచుఁ బొన్నయాసపయిఁ దేలియవోలినయాజవంజవ
శ్రీలఘుభోగసిద్ధిఁ బడి చిక్కినఁ జిక్కు మహాపదంబుధిం
గూలి నరుండు గాక యొనగూడినభక్తిని గాశి కేఁగినన్
గాలముఁ ద్రోచి కాలు(నికిఁగాదని)కాలను బొమ్మగట్టఁడే. 103

క. ధాత్రీశ! వినుము కాశీ,క్షేత్రంబునఁ జక్రమైన జీవం బటి త
న్మిత్రేందుచక్రరథము వి,చిత్రంబుగ నెక్కియుండుఁ జెన్నెసలారన్. 104

సీ. తక్కినయెడఁ దత్త్వ......నోజ్జ్వలం... ... మందబుద్ధిఁ బోలఁ
దొకచోట యోగియై యుండినవాఁ డిందు,భోగియై చరియించుపురుషుఁ బోలఁ
దన్యస్థలమున నధ్యయనతత్పరుఁడైన, వాఁ డిందుఁ జదువనివానిఁ బోలఁ

డెం ... ...ను)దారుఁ, డిందు లోభముఁ బూనుహీనుఁ బోలఁ

గీ. డఖిలతీర్థంబు లాడినయట్టి మేటి, బోలఁ డిందులయస్నానశీలు డైన
నసుచు సంశయమూరుడై యరసి చూచి, నడ... ... ...కి. 105

సీ. అమితపద్రదక్షిణాక్రమణంబు గమనంబు, మంత్రింబు లాడినమాట లరయ
నాహారితఁగులు నిత్యాన్నపానాదులు, యోగప్రకారంబు భోగమహిమ
అఖిలస్థఁ దనియీశు నర ... ...(సకలతీర్థా)సక్తి జలకమాట
వస్తుపరాత్మశశ్వను చాలియె ల్లమి, సచ్ఛాస్త్రములవినికి జాడ వినుట

గీ. జీవపరమాత్మసంపర్కసిద్ధి నైన,చొక్కు నిద్రావిహారంబు సోమధరుని
మూర్తిసంవీక్షణము బంధ)మోక్షణంబు, కాశిఁ గాఁపురమున్నశాశ్వతమునకైన.

మ. ధరణీవల్లభ! భక్తిశోడ నవిముక్తక్షేత్రముం జేరను
స్థిరపుణ్యాత్ములు ముక్తిఁ గైకొనుటయేచిత్రంబు ము న్నొక్కభూ
సురపుత్రుండు (మదాలసుండు...)శూన్యుండు దురాత్మకసం
చరణోదగ్రుఁడు గాంచె నందు మృతుఁడై శంభుస్వరూపోన్నతిన్. 107

మ. అరిసన్ నేత్రసరోజపత్రములలో నానందబాష్పంబులన్
దనుసీమన్ బులకాంకురచ్ఛటలు ... ...
ప్ప నరేంద్రుండు మునీంద్రుఁ బల్కె విను మోభవ్యాత్మ! నీవిట్లు చె
ప్పినయానందవనప్రశంసకతనన్ భేదించితిన్ బాపమున్. 108

గీ. పుత్త్రసంపత్తి పైఁ గాంక్ష పొరలు నాకుఁ, గలిగెఁ గా ...
గాఁజుఁబూస నిరీక్షింపఁ గడఁగువాని, కరయ నవపద్మరాగంబు దొరకు నాఁగ.

క. వినఁబడియెఁ గాశిమహిమయు, నవిముక్తగంగాపయోబ్ధివాధిక్యము శం
భునికీర్తనంబువిధ)ములుఁ, గనుఁగొంటిన్ బ్రముకఁగంటిఁ గౌండిన్యమునీ!

వ. మీర లిప్పుడు చెప్పినమదాలసుండనువాఁ డెవ్వం డెద్దేశంబువాఁ డేపురంబునం
గాఁపురంబుండుఁ దద్దుశ్చరిత్రుం బుత్త్రుండుఁగాఁ గాంచిన తండ్రియుఁ దల్లి
యును నెవ్వ రేమినెపంబున వాఁడు కులాచారదూరుం డయ్యెఁ గడపట నెట్లు
కాశిలోన మేను దొఱఁగి గంగాధరుకారుణ్యంబునఁ గృతార్థుండయ్యె నీయర్థం
బుఁ జేటతెల్లంబు సేసి నన్నుఁ జరితార్థుఁ జేయవే యనుడుఁ దపోధనాగ్రణి
యశోధనాగ్రణిం గూర్చి కూర్చినసెయ్యంబున ని ట్లనియె. 111

మ. ఇలకున్ గుంతలపుష్పదామ మన శ్రీ నింపారి సొంపొందుకుం
తలదేశంబున రత్నగర్భపురికిన్ నాథుండు గంభీరని
శ్చలతేజోనిధి చంద్రకేతుఁ డరివీరాధూమకేతుండు త

మ్మలచుట్టంబగువేల్పువంగిడనుసన్ బుట్టెన్ మహీవల్లభా! 112

ఉ. ఆదిమశైల్లు మందమలమల్లుఁ బయోరుహనాభభల్లుఁ గా
కోదరరాజకుండలసముజ్జ్వలగల్లు భజి మించునా
భూదయితావతంసమణిపౌత్రిల మహీసురుఁ డొక్కఁడొప్పు వి
ద్యాదివిషగ్గురుండు మహిమాఢ్యుఁడు శ్రీనిధినామధేయుఁడై. 113

సీ. చతురాగమంబులు సకలశాస్త్రంబులు, నామూలమాడ మానట్లు తెలిసి
భక్తిసంపదయు నాసక్తియుఁ గల్గిన,శిష్యుల కవియెల్లఁ జెప్ప నేర్చి
యరయ జ్యోతిష్టోమ మాదిగాఁగలసప్త,సంతువు లన్నియుఁ దగ నొనర్చి
వేదాంతవిద్యావివేకం ... ...తులసోమయాజులుగఁ జేసి

గీ, తగినవారికి దానంబు గా నొసర్చి, సత్ప్రతిగ్రహాశక్తిపై వెలపు గలిగి
బ్రాహ్మణాకృతిఁ జూపట్టుబ్రహ్మవోలె, నని శ్రీనిధి ధీనిధిగ్గొ తలిర్చె. 114

చ. (వ్రతములు చేసి) పెక్కు లుపవాసములన్ మటిపెక్కు లుప్పిఁడుల్
ధృతి నొనరించి కూర్మిఁ బరదేసులఁ దల్లియుఁబోలెఁ బ్రోచి మా
నితగతి మింటివయ్యముల నేలకుఁ దెచ్చి కుమారుఁ గాంచెఁ ద
త్సతి .. ... రగుఁ జామ పతివ్రత సంగసఁబునన్. 115

ఆ. అవనినాథ! భూసురాగ్రణి తనపుత్త్రికుని మదాలసాఖ్యుఁ గూర్చెఁ బ్రీతి
నలిమదాలసాత్ముఁ డగు నీతఁ డని మీఁదఁ, దలఁపు జనులకెల్లఁ దెలుపు (రీతి.)

క. ... ...చ్చుబాలకు, నొకవూఁటనె పెంచుచుండె నుర్వీసురధీ
తకురంగనేత్ర శోభకీ, ర్తిఁ దగుశుభకీర్తి మోహదీపిత యగుచున్. 117

వ. ఇట్లు దినదినప్రవర్ధమానుం డగు సూనునకు వి ... దజ్జనకుం డన్నప్రా
శనచౌలోపనయనాదికృత్యంబులు యథాశాస్త్రంబును యథాకాలంబును నగున
ట్లుగఁ బరికల్పితంబులు సేయించి వేదాదికంబులగు విద్యావిశేషంబులఁ బొండి
త్యంబు ... ధుఁడగు ధరామరకుమారి సుకుమారాంగిఁ జంద్రవద
నం జంద్రకళ యనుదానిం బెండ్లియాడ్చి సంతసిల్లుచుఁ దామరసంపదలగు సంప
ద్విలాసంబునం బెంపువహించి కలపయసంవత్స ... ... మ్మహీబృందారక
నందనుండు. 118

సీ. కన్నకన్నవి మాక్తికంబు లద్గాలించు, జెలుకుసింగిణి చేతఁ జెప్పుకున్నఁ
ద్రొక్కనిచోటులు త్రొక్కుచు మిన్నందు, డెక్కలుగలలేడి నెక్కుకున్న
... ... దిక్కు లప్పుప్పుఁగట్టించు, నలుఁగులు పొదిలోన నిలుపకున్న
మిసమిసమనుగండమీను టెక్కెముతోడఁ, జిగురెల్లినీడలఁ దగులకున్న

గీ, మానినీమానినీజనమానహరణ, ... సౌభాగ్యశంబరారి
యనఁగఁ జూపట్టె భూమిదేవాత్మజుఁడు, నాలుగంచుల నవయౌవనంబునందు.

చ. చతురామ్నాయవిహారముల్ మఱచె శాస్త్రక్రీడ చాలించె మా
నితపౌరాణికవాక్యసంశ్రవణముల్ నిర్ఘాతముం జేసె శ్రీ
సుతవాత్స్యాయనకూచిమారమతముల్ చూచెన్ ఖలాచారసం
గతికిన్ దూరము చేసె నెమ్మనము దుష్కర్ముండు పాఱుం డొగిన్. 120

సీ. నెఱనెంద్రుకలు దువ్వి నిలువుకొప్పు ఘటించి,కుసుమదామము మీఁదఁ గుస్తరించి
నుదుట గంధపుఁజుక్క నూల్కొల్పి నీలాల,పోగంట్లు చెవిదోయిఁ బొందుపఱిచి
తరలమై బంగారుతాయెత్తుగలముత్తె,ములపేరు పేరురంబున ధరించి
కటిఁ దాళిగోణాము కడచుంగుదరఁజీర, పట్టుదట్టీ దిండుగట్టి నడుమ

గీ, కేల డాఁపలిచిటికెనవ్రేలియందు, నలఁతిపగడాలయుంగరమునుపుకొలిపి
గారవంబీనికలికిసింగార మెదవ, నారజంబుగఁ జరియించు నతఁడు మఱియు.

ఉ. బోఁడికెమూఁపుపైఁ గరము పొందఁగఁజేసి కరంబుమోడ్పియూనం
బాడిగ లోలి మెట్టి కరపద్మము ద్రొవ్వి రిచెండు మాటికిన్
వేడుక బారమీటుచు నవీననఖాంకవిలాసలక్ష్మితోఁ
గూడినమేను వమ్మకొనఁ గ్రమ్మరుచుండు నతండు వీధులన్. 122

శా. క్రాలుంగన్నులనిక్క.క్రొమ్మెఱుఁగుబింకంబుల్ దువాళింప నీ
లాలోలాలకకాంతి తుమ్మెదలనాయం జాయనం బూర్ణిమా
పాలేయాంశునిఁ బోలుముద్దుమొ.........డారులం
గేలింబెట్టుమదేభగామినులతోఁ గ్రీడించువాఁ డిమ్ములన్. 123

గీ. జూద మన్నను మనెయందుఁ బాదుకొల్పుఁ, బరధనం బన్న నపహరింపంగఁ గోరు
నబ్జముఖి ... ందజేయు, బ్రహ్మవిద్యావిదూరుఁడై బ్రాహ్మణుండు. 124

గీ..గమియఁబూచినతంగేటికరణి సకల,భూషణాంచితగాత్రియై పొలుపుమిగులు
చందికళఁ గూడి సంసారచ......దతఁడు దుర్బుద్ధి యగుట. 125

సీ. మాసినముత్తెంబు లౌసరోజాక్షులఁ, గలికికటారికత్తెలుగఁ జేసి
కలలోనఁ బరపూరుషులపొం దెఱుంగని,సతులపాతివ్రత్యసరణిఁ జెఱచి
గరిపోనివయ్యనుస ... ... ...రుకంబు గట్టిపెట్టి
తల్లి కూఁతురు మఱఁదలు నాక చిట్టంటు,వలల నందఱి కొక్కవావి చూపి

గీ, ఆర్యులెఱిఁగిన గావంగు రసక విధిని,షేధములయందుఁ గలిగినబోధ మెడలి
లజ్జచ ... ... ..., పరమకాముకముఖ్యుండు ధరణిసురుఁడు.

సీ. కానక కన్నసంతానంబు గావున, నౌఁ గాదనఁగ నోడు నంబ తనయు
వలదని వారింపఁ జాల మెక్కు డనుశంకఁ, దా నెఱుంగనియట్ల తండ్రి యుండు
... ... యుఁగాన, నిల్లాలు పతిచేత కెదుర నెంచు
యొక్కఁడిపే ...మితని దిద్దుద మంచుఁ, గోరి మిత్రులు బుద్ధిఁ గూర్ప రతని
గీ, బంధువు లీవి నిర్బంధపఱుప మనకు, నేమికారణ మని చెప్ప రింత యొత్తి
అన్నిశావుల ...(సంతకం)తకుఁ బరచయ్యె నవనిసురుఁడు. 127

ఉ. అల్లది మేలదయ్యొ మఱి యల్లది కానుక యంపె నాకు నే
నొల్లను దానివిత్తము నొక్కటి మాపటినిన్న వీటిలో
మెల్లన పోవఁ గంటి న ... న్నఁ దాఁ
బ్రిల్లదుఁడై చరించుఁ జెనుపాటుఁడు మన్మథగోచరాత్ముఁడై. 128

సీ. పాటవరించినవీటివిటులయక్కలు దీర్చుఁ, బోరించుఁ దమలోన వారసగల
పలుమాఱుఁ గోడిపుంజాల(ను బోరాడించు), గామశాస్త్రప్రసంగములు చేయు
నడిగించు మగనాండ్రి నగ్నంబు వెదచల్లి, కలవారిగృహములు గన్నవెట్టు
సాముసేయును బోటుచందంబు గనుకొర్కి, కలికిబాగులు మీఱ నిలుపు ...
గీ, సంధ్యవార్చఁడు వేల్వఁడు చర్చసేయఁ, డాగమంబులఁ దీక్షంబులాడఁ డుచిత
తిథుల నుపవాస ముండఁడు తిప్పకాయచందములు దక్క భూసురనందనుండు.

క. ఈచందంబునఁ బరఁగై, నీచాతిం దిరుగునతని నిఖిలజనంబుల్
చి చీ! యనఁ దొడఁగిరి యహ,హా! చెడనీ యాశము కామియగు మూఢునకున్.

ఉ భవ్యుఁడు తద్గురుండు నగపాలగృహంబున మాన్యుఁడై సుధీ
సేవ్యగతిం దలిర్చుటఁ బ్రసిద్ధుఁడుకావున «బ్రాహ్మణో నహం
తవ్య» యటన్న నీతియు నశంబయి చెల్లుట నద్దురాత్ముఁ బా
పవ్యవసాయుఁ జంపుటకుఁ బౌరులు లోగుదు రెమిసేసినన్. 131

సీ. తగవు గాదని చెప్పెఁ దల్లి సద్బుద్ధులు, హేతుదృష్టాంతంబు లేర్పరించి
ధర్మశాస్త్రములయంతర్మర్మములు దెల్పి, వలదని వారించెఁ బెలుచఁ దండ్రి
కులమును వాసియుఁ గలవాఁడ వేలన్న, యని చేరి బోధించి రనుఁగుసఖులు
«సరివారు నవ్వఁ ద్రిమ్మరి వేటి కయ్యెను, చాలింపు» మనిరి సజ్జనులు పెద్ద
గీ, లిట్లు తగువారు సన్మార్గ మెద్దియైన
వివరముగఁ, దెలపఱిచిన వినఁ డతండు
హెచ్చి మూఁడవపురుషార్థమే యిహంబుఁ
బరము నీఁజాలునది గాఁగఁ బదిలపఱచి. 132

గీ. పిన్ననయసునఁ గడుఁ బెంచి పెరుఁగనిచ్చి, వంపలేరైరి నూఱు వాలువర్గమైన
తల్లిదండ్రులు మొలకైనతఱిని కొట్టు, వంపఁబడుఁగాక పొచ్చిన వంపనగునె.

ఉ. ఆరయఁ బాలవంటికుల మూఱడిఁ బోవఁగనిచ్చి వీటిలో
నారజమై చరించు వసునామరనందనుఁ డిట్టివారు నె
వ్వారును జీరికిం గొనక ... ... జాల్కఁగా
నీసప్రవృత్తిఁ జూచి రతిరించ్యుఁడు వీఁడని యేవగింపుచున్. 134

క. కొసుకుకొనఁ గలుగుమచ్చిక, విడిచిరి తలిదండ్రు లాత్మ వినుగుచు నేలా
విడుపక యట్లు దినంగా, దొ ... ... సఁగు నరేంద్రా! 135

వ. ఇవ్విధంబున మదాలసుం డగుమదాలసుండు దన్నుం గానునకైనం గొననివార
లగుటఁ జుట్టంబులఁ బుట్టినవారలఁ బరిత్యజించి దేశాంతరంబు వోవం జిం...136

ఉ. ఒక్కటఁ బిక్కటిల్లి యిరు లో యన నో యనునడ్కిరేయిఁ బెం
పెక్కినతెంపువం బురి మహేశ్వరధామముఁ జొచ్చి విస్ఫుర
ద్గుహ్యకమానీయరత్నములతోటి యనర్ఘవిభూషణావలుల్
వె ... ... ... పోలిబెట్టె నెట్టనన్. 137

క. కాఁగాదు దేవధన మని, లోఁగక లాగించి యడవిలో తెరువునఁ గా
రేఁగులుఁ దంగేష్లక నతఁ, డేఁగెం దనచొప్ప పొరు లెఱుఁగకయుండన్. 138

చ. మునుకొని జన్మభూమి ... ... ... మలోఁ
గనియెను బాహ్మణబ్రువుఁడు కాంచననిర్మితకేలిశైలమున్
దివకరచుంబికేతుమణిదీప్తవిశాలముఁ బూర్ణచంద్రిమో
వినిమయయోగ్యయాపతఁవీనసుఖాబ్జముఁ గన్యకుబ్జమున్.) 139

ఉ. ... ... వస్తువులఁ పుట్టినయి ల్లగునవ్మహాపురం
బాయ యానమార్గమున నల్లన చొచ్చి ధనాఢ్యు నొక్కచే
హాయ వశంబుసేసికొని యాతనిచేతికి సొమ్ము దాఁపఁగాఁ
జేరికయిచ్చి సాత్త్వికులచిహ్నముతో ... ... 140

ఉ. మానితలీల సజ్జనునిమాడ్కి మహీసురుఁ డప్పురంబులో
మానవపంక్తితోఁ గలసి మచ్చికయై తలలోనివాల్కయై
ధీనిధి యాతఁడే యనఁగఁ దేకువఁ దేజము గాంచియుండెఁ బెం
పూనఁగఁ గొన్నివాసరము ... ... తటన్. 141

క. పాఱఁబడినపిదప మరునకు, లోఁబడియుం డిందు వారలోలాత్ములకుం
దాఁ బసిఁడిఁ బంపు విప్రుఁడు, తోఁ బుట్టినపుట్టొగుఁబాము తోలఁగునె యధిపా!

వ అక్కాలంబున. 143

చ. (అనుపమమైనయ)పూర్వమునం దొకసానికి బిడ్డయై విమో
హనరుచిరాంగి రెండుబదియైనసమంబులముద్దులాడి క్రొ
న్ననవిలుకానిరాజ్యమఖిలవ్యసమృద్ధికిఁ బట్టుఁగొమ్మనై
కనకలతావిధా ... ... చెన్నువహించె భూవరా. 144

మ. చదివెం గామకళారహస్యములు శిక్షం గాంచె వీణాదులన్
బదిలంబయ్యె సమస్తనాట్యకలనాపాండిత్యహేలన్ మదిన్
గదియించెన్ గరువంబు జాణతనమున్ గాంభీర్యమున్ సిగ్గునన్
బొదలెన్ బాలిక కేలికాజితమరుత్పూర్ణేందుబింబాస్యయై.

ఉ. సానికులంబులోనఁ గలసానులకెల్ల నవావతంసమై 145
మానిని మాననీయగుణమండన కొండికప్రాయమొప్పఁగా
సానలఁ దేరివట్టినమరుశస్త్రియుఁబోలె విటాలి జాలికిం
దే నెతేఁగెన్ విలాసరసదేవతయై తగ నాఁడునాఁటికిన్. 146

శా. ఆకాంతామణి యిట్లు కాముకకటాక్షానందనిర్వాహక
శ్రీకిం గూర్చినవిం(దు)వాఁబరగి రాజీవాక్షులం దాను లిం
గాకారంబున నొప్పు తన్నగరరథ్యావాను నాగేశ్వరా
ఖ్యాకున్ శంభు భజింప నేఁగె నొకనాఁ డత్యంతలీలాగతిన్. 147

సీ. కుసుమగర్భంబైన కొప్పునెత్తావుల, సొబగు దిక్కులఁ బర్వ చోదుముట్టఁ
జపలకటాక్షవీక్షణవిభ్రమంబులు, కొమ్మెఱుంగులతళ్కుఁ గుస్తరింప
మొలకచన్నులమీఁద మొలకలెత్తినకాంతి, వలిపపయ్యెదఁ బైఁడి వలువ సేయ
అడుగుఁదమ్ముల తేటపెడఁగు మార్గమునకుఁ, గొత్తలత్తుకచాయ హత్తుకొలుప
గీ, కలికిపలుకులఁ దేనియ లొలుక నలస, గతులు రాయంచనడపులఁ గలితఘటింప
పాణిసంయుక్తదర్పకబాణ మనఁగ, నాతి వేంచేసె శితికంఠునగరి కపుడు.148

మ చరణాంభోరుహహంసకధ్వని నిరాశస్వాంతులం జొక్కఁజే
య రతిం బోలినమూర్తి విశ్వజనతాహ్లాదంబు హత్తింప న
త్తరుణీరత్నము ... ... డి యంతం దిక్కులం గెల్చి శం
బరవిద్వేషి సమంత్రశక్తిఁ గొనయొప్పున్ గ్రమ్మరం జేరెనాన్. 149

పృథ్వీ. కనత్కనకకుంభసంగతము చారుముక్తావళీ
పినద్ధమణితోరణా( ... ... )తం
బనిందిమత్యనుపమానవాద్యంబు నా
మనోజహరుధామ మమ్మహిళ చేరె హేలాగతిన్. 150

క. మెఱుఁగువ మెఱుఁగులు చూపులఁ, గలువలు పలుకులకు పంజ్రికలికలు
... ... ను నెలకొన, నలికుంతల యంతఁ గాంచె నళికతలాక్షున్. 151

శా. జ్యోతీరూపము దివ్యలింగము ద్రయీచూడామణిన్ లోకవి
ఖ్యాతున్ బాలిక నీలకుంతల సరోజాస్యల్ వయస్యల్ ...
ప్రీతిన్ గన్నులు మోడ్చుచున్ విలసచ్ఛ్రీ యొప్ప నాదేవుపై
గీతంబుల్ సొబగొందఁ బాడె గమము గ్రీల్గొల్పి తానంబులన్. 152

చ. కలమృదులస్వరంబుగల కంజదళాక్షులఁ గూడి పాడున
క్కలికి యొ ... ... ధియు మెచ్చె నాత్మలో
శిలలు గరంగఁ దర్వులను జేకుఱఁ బల్లవలక్ష్మి భక్తిమం
తులఁ గలబొమ్మలం గరము దూఁకొనె జీవిత మద్భుతంబుగన్. 153

ఉ. ఆసమయంబునం ... ...సుదాలనుండు లీ
లాసఖులైనవారు కడలన్ బరిహాసకథాప్రసంగవి
న్యాసము చూప వచ్చి జలజావనపాట మనంబు రంజిలన్
జేసినఁ బోక నిల్చె గుడిచేరువఁ గేలికురంగశాబమై. 154

చ. నిలిచి (యొకింతసేపు రమణీమణిఁ గాంచి) ముదంబు విస్మయం
బలమి మనంబుతోఁ బెనఁగ నంగమునం బులకాంకురచ్ఛటల్
నెలకొనఁ దోన ఘర్మమును నిండఁగ నవ్యములైనచేష్టితం
బుల సడలించి చిత్రకృతమూర్తియొ నాఁ గనుపట్టె నెట్టనన్. 155

శా (కామాంధుం డయి) విప్రసూనుఁడు మహోత్కంఠాతిరేకంబుతో
గామారత్నము పాటనెంబడిచె సంరంభంబుతోఁ జంద్రభృ
ద్ధామం బప్పుడు చొచ్చి కాంచె నచటన్ దారుణ్యలక్ష్మీలతా
రామంబున్ నళి)నాక్షి ప్రేక్షణసుధారాశిన్ రసావల్లభా! 156

ఉ. తారలలోని చంద్రికళ తమ్ములలోని మరాళి మల్లికా
వారములోని గంధఫలి ౘట్టువము తెప్పఁ బేరులోని వి
స్ఫారమణిశ్ర(లాక...)యాలలోపల మన్నకన్నియన్
గోరి నుతించె భూసురుఁడు గొబ్బునఁ జిత్తము తత్తఱింపఁగన్. 157

క. పానికుమారిక యగున,మ్మానినిఁ బ్రియమాని నిశితమన్మథశరముల్
మైనాటు నాటఁ జూచె మ,హానందరసాబ్ధి నోలలాడుచు నతఁడున్. 158

సీ. చీఁకటిగొనఁబోలు చికురవల్లరులలోఁ, గనుపట్టుచిమ్మచీఁకటులు వొదవ
జడనుగాఁబోలు నుజ్జ్వలచారువదనేందు,మండలామృతపూరమగ్న మగుచు

ఇఱుకునఁ బడఁబోలు మెఱుఁగారు పాలిండ్ల, దోయిసందు కరంబు దూఱఁబాఱి
అడుగుఁ జేరఁగఁబోలు నత్యంతగంభీర, నాభిసరస్సీమ నాడఁ జొచ్చి
గీ, ఉరునితంబంబు వలగొన నరుగఁబోలు
మొక్కి జారంగఁబోలు నూరువుల వెంటఁ
దిరుగఁగా నేరదయ్యె భూసురకుమారు
చూడ్కి యాలనాఁగ చెలువంబు చూచినపుడు. 159
మత్తకోకిలము. ఆంగనింతయు నింపుసొంపున నంతకాహితుఁ గొల్చి...
సంభ్రమంబునఁ గూడి తోడివిశాలనేత్రలు దాను ది
గ్దంతి యానము మించుయానము గల్గి యింటికి నేఁగ వి
భ్రాంతి నెంతయుఁ బట్టి ధీనిధిపట్టి యిట్లను భూవరా. 160
ఉ. ఎవ్వతెయొకొ యీజలరుహేక్షణ దీనికి నామ మెద్దియో
యెవ్వనిపుత్త్రి (వైభవ మో) యివ్వనితామణిఁ గూడఁగఁ గల్గటన్
బువ్విలుకానిబారిఁ బడి పోవఁడె నారిజగర్భుఁడైనఁ బై
నివ్విధుబింబవక్త్రి వాసితేందుముచుల్ గరువంబు చూపినన్. 161
చ. స్మరశరవిభ్రమంబు నవచంద్రికళావిభవంబుఁ బుప్పవ
ల్లరిఁ గల తేట బంగరుసలాకవిశేషము క్రొమ్మెఱుంగువి
స్ఫురణము నీమృగాక్షి యయి పొల్పెసలారెడుఁ గాక యున్న నీ
కరణి మదేభగామినులఁ గంటిమె యెచ్చట నైన వింటిమే. 162
క. అనుచున్ మోహాంశాంబుధి, మునుఁగుచు మరుఁ డేయుబాణములఁ దూలుచు నొ
చ్చినవిప్రుఁ జూచి తత్సఖుఁ, డనియెన్ బరభావవేది యనువాఁ డంతన్. 163
ఉ సానిదిగాన యీవికచసారసలోచన పొంద దుర్లభం
బైనదిగా దదెంతపని యన్నియుఁ జక్కనసేయువాఁడ లోఁ
బూనుము ధైర్య మిట్టియెడఁ బ్రొద్దిక నేఁటికిఁ బోయి యింటికిన్
బో నయమేది వట్టెనెకఁ బొందఁగ నేటికి విప్రనందనా! 164
చ. అని పరభావవేది వసుధామరనందను నొక్కరీతిచే
మనము మగిడ్చి చంద్రధరుమందిరమున్ వెడలించి యింటికిన్
జను మని యాఱడం బలికి చయ్యనఁ దాను యథేచ్ఛ నేఁగ నం
త నవనిదేవుఁడుఁ ... మ)దిం దలంపుచున్. 165
గీ. ఉచితకృత్యంబులన్నియు నుజ్జగించి, మృదులశీతలశయ్యపై మేను వైచి
ప్రబలమన్మథవిశిఖాగ్నిభర్జ్యమాన, మానసుండయి పలుకు నిమ్మాడ్కి నధిప! 166
ఉ. పాటలగంధి నీకులుకుపాట నదేటికి వింటి విన్న న
ప్పాట మదీయధైర్యగుణపాటన మేల ఘటించె నింక ని

ప్పాటఁ బ్రసూనబాణశిఖిఁ బ్రాణము నిల్పఁగ నెట్లు నేర్తు హృ
త్పాటవ మేది తూలుటయ పాటిలుఁ గాక యనేకభంగులన్. 167

గీ. జలజలోచన యీనాఁడు చంద్రనిశిత, బహుళశరాఘాతములచేత బ్రదుకు గలిగె
నేని యర్థంబు లీరాని విచ్చిగ్రోనఁ, బొందు గొనుకొందు నెట్లరవిందనయన. 168

సీ. పతివెళ్లకుండంగఁ బుడియించి కొనకొంగు, పట్టి క్రిమ్మఱి ముద్దు పెట్టనైతి
ఎరి నిలువరించి యిచ్చకం బొనరించి, యించుక మాట లాడించనైతి
చెలికత్తియలనైనఁ బిలిచి మీ యెలనాఁగ, తెఱఁ గెట్టిదో యని తెలియనైతి
మందయానముతోడ మఱలి యింటికిఁ బోవ, దిగ్గదిగ వెంబడిఁ దగులనైతి

గీ. అకట యప్పుడు వారిప్పి హస్తగతని, ధాన మూరక పోనాడి మానసమున
వగచుచుండినఁ గార్యంబు వచ్చునేల, యసమశరుతూపులకు సగమైతిఁ గాక!

చ. మతిఁ బరభావవేది కడుమచ్చికవాఁడని నమ్మి మోసపో
యితి నతఁ డాప్తుఁడేని నను నేటికి నేఁటికి నింటి కేఁగు మీ
వెతవెత నానటంచు నను వీడ్కొని తాఁ దనయంత నేఁగెఁ బె
ల్లితరులబుద్ధిలోనఁ జరియించువిమూఢున కేటిసౌఖ్యముల్. 170

క. తెచ్చినవిత్తము వృథగాఁ, బుచ్చక యామ్మచ్చికంటిపొం దికఁ గందున్
వెచ్చపడ వారవనితలు, వచ్చుటయే యరుదె యెట్టివానికి నైనన్. 171

ఉ. అంచితలీల నొయ్యఁ గళ లంటి మనం బలరించి నేర్పుతోఁ
బంచశరాహవంబునకుఁ బైకొనఁజేయుడుఁ జొక్కి కించిదా
కుంచితనేత్రకోణ యయి గుబ్బచనుంగవ నాయురంబుఁ బొం
దించి సుఖించునొక్కొ సుదతీతిలకం బొకనాఁడు వేడుకన్. 172

ఉ. ఏనొకవేళ గాఢరతి నేర్పున లోపల డస్సి దూలినన్
మానితమాలపల్లవసమానగుణాధరసంభవామృతం
బానఁగ నిచ్చుచుం గలయ నప్పుడియాన్ మది నూలుకొల్పన
మ్మానవతీలలామఁ దగుమచ్చిక నెన్నఁడు గారవించెడిన్. 173

సీ. కొప్పిత్త నీలపురంగు గొదవ చేసి చెలఁగు, కమనీయకుటిలాలకములతోడ
సంపూర్ణశశి లేటచాయఁ జా యనుమాట, మెలపించునిద్దంపుమోముతోడ
హేమకుంభవిభూతి యెమ్మె డించినరీతి, తోడికొనవచన్నుదోయితోడ
చిగురుటాకులమేలు చిన్నపుచ్చఁగఁజాలు, మోహనంబగు చిన్నిమోవితోడ

గీ. పులినతలవిభ్రమముపూన్కి గెలుచునుక్కు
డాలు దళుకొత్తుజఘనమండలముతోడ

వలనుమిగిలినభాగ్యదేవతయపోలె
మెలఁగుకలకంఠి నెన్నఁడు గలుగునొక్కొ! 174

సీ. వకుళపున్నాగచంపకపాటలావనీ,రుహవాటికలఁ గలవిహరణంబు
కలహంసకులపక్షచలితవీచీఘటా,కులసరోవరముల జలకమాట
అమృతనిష్యందమోహనచంద్రికాధౌత,మానితహర్మ్యంబులోనియునికి
కమలదాగోపలఘటితనూతనకేళి,శైలకూటములపై వ్రాలుకడఁక

గీ, విరులు సొమ్ములు ఘ్రాఁత లంబరము లమిత
భక్ష్యభోజ్యాదు లొనరినపనుల నెల్ల
నింపు సమకొల్పు తనవల్పునిందువదనఁ
గలసి వర్తింపలేకున్న నిలువు సున్న. 175

ఉ. అనుసమయంబునందుఁ గమలాప్తుఁడు లోచనగోచరాత్ముఁడై
వననిధినాథునిక్కునకు వ్రాలె సమస్తదిశాంతరంబులన్
గనకము పూసినట్టిక్రియఁ గానఁగవచ్చెఁ దదంశుగర్తమన్
వనరుహలక్ష్మి వైరవవనంబు(లకుం జనె)తోడుతోడుతన్. 176

సీ. ఈషదాకుంచితాశేషపత్రిసరోజ,జఠరనిష్యందపుష్పంధయంబు
నీడదుమోన్ముఖనిర్భరజవఖగ,స్పష్టకోలాహలాశ్లిష్టదిశము
భావితారాగంపత్తిమల్లమల్లికా, ... ... వాదికంబు
చక్రవాకస్వాంతసాంద్రశోకానల,సంవర్ధనక్రియాసామిధేని

గీ, కాంతివిస్మేరముఖసరఃకైరవంబు, నీలిమావృతసకలావనీతలంబు
ప్రకటసంధ్యాసమాధిముద్రాబ్రాహ్మణంబుఁ,జాలఁజూపట్టె పశ్చిమసంధ్యయపుడు.)

సీ. కాలకాముకుఁడు దిక్కాంతలపైఁ జల్లు,వలుదకప్పురపుఁబల్కులో యనంగఁ
జరమసంధ్యానాట్యచలదీశపటుజటా,గళితగంగాఫేనకణము లనఁగ
సాకాశమండలం బనుమధూకంబునఁ, బుట్టినసవకంపుఁబూవు లనఁగ
... ... మణి కెజిగింప,వచ్చుపెంచినవారుపంబు లనఁగ

గీ, భావివత్సరవల్లభప్రకటబహుళ,భరితసత్కీర్తిచంద్రికాంకురము లనఁగఁ
బరగి జగదేకకళ్యాణపదవిలాస,కరములై యొప్పెఁ దారకోత్కరము లపుడు. 178

సీ. ... లయందుఁ, జిగురుఁగైదువుజోదు (చే)రఁబడియె
పూఁకలుగట్టె యిమ్మల మృగంబులు లేతఁ,పచ్చికపట్టులఁ బవ్వళించె
వసుధమీఁదికి మిన్ను వ్రాలెనో యనఁ జెన్ను,దళుకొత్తఁజీఁకటి దట్టమయ్యె
నలదిశాంత ... ,నారిహేతిహరాతులయందు విడిసె

గీ. జారులకు మోదసంపత్తి చాలఁ గొనెనె, చోరసంచారములకెల్లఁ జోటు గలిగెఁ
జగము పాథోనిధాననిశ్చలతరంగ, సంగమంబున కినమూర్తి జాఱుటయును. 179

చ. కలువలసొంపు తామరలకాయు నిశాసతిజీవగఱ్ఱ తా
కలగమికాఁడు వెన్నెలకరాటము చీఁకటిపిచ్చుమొగ్గ చ
ల్వలగని చక్రవాకులకలంకు వియోగులపాలిజాలి వే
ల్పులకడవెల్లఁ దీర్పుటకుఁ ... చంద్రుఁడు దోఁచెఁ దూర్పునన్. 180

చ. ప్రియుదముతోడ నస్తమితభానునివేషముఁ దాల్చి రాగవి
భ్రమమునఁ గూడఁ జంద్రుఁడు కరంబుల నంటినఁ జల్వఁ దాఁకియో
కమలిని మోముఁ వంచె నది గన్గొని పక్కునఁ దాను నవ్వెనోఁ
కుముదిని దాన సిగ్గువడి గొబ్బున వెల్వెలనయ్యె నాతఁడున్. 181

గీ. ఉదయరాగవిభూతి పయోజసూతిఁ, బదప నొదవినవెన్నెల మదనదహను
మేనఁ దలుకొత్తు కప్పున దానవారిఁ, బోలి చూపట్టె నంత నంభోజవైరి. 182

చ. హరిహరిదంబుజాక్షి నిటలాంచితచందనబిందువో యనన్
గరమొ దలిర్చెఁ జందురుఁడు కప్పును జాడఁగనొప్పెఁ దస్సర
ద్భ్రమశిలాభలోభకరిపాకవశంబడచిత్తవృత్తియై
తిరముగ వార్ధి యున్నయెలదేఁటిచపోలె జగంబు మెచ్చఁగన్. 183

చ. వలపులరాచవారికిని వన్యుఁడు చల్లనిమేనివాఁడు క
ల్వలచెలికాఁడు నైనయమృతల్లభజారుఁడు ప్రేమ యామినీ
కులట మునుంగుగాఁగ నొనగూర్చిన నల్లనిచీర మేనికిన్
దొలఁగఁగఁ దీసెనాఁ బరగి తూలెఁ దమంబు దిగంతరంబులన్. 184

మ. ప్రమరధ్వాంతమదేభపాకలము చక్రిస్వాంతశోకాగ్నిధా
య్య చకోరీకులజీవనౌషధము తారానందకందంబు ప
ద్మశగక్రీభరపశ్యతోహరము కందర్ప ... ... ...
పచరపక్రిక్రియు పర్వ వెన్నెల నిశాచంద్రానవావాసమై. 185

సీ. సకలదిక్కాంత లొప్పిమ్మిక వసంతము చల్లుకొనఁ గ్రిమ్ము చందనత్తోద మనఁగ
నాకాశసిద్ధదేహంబునఁ బూసిన, నూతనస్నిగ్ధవిభూతి యనఁగ
రాజు నిశారాజ్యరతి మంగళాభిషేకంబునఁ దొరగు గంగాంబు వనఁగ
కాలధీవరుఁ డంగకారమీనంబుల, సంగ్రహింపఁగ నైచుజాల మనఁగ
గీ. కడఁక రేచాయ మైనిండఁ గప్పుకొన్న, జిలుఁగుబాళంపువలిపంపుఁ జేలయనఁగఁ
దగి చకోరంబులకునామెకలు ఘటించి, తెలఁది వెన్నెలగలయంగఁ దొలుకరించె.

వ. ఇట్లు సకలలోచనానందకరుండగు నిశాకరుండు మృగమదమకరపత్త్రాభిరామం బగు సుత్రామదిశాకుశేశయగంధికపోలఫలకంబునుం బోలె నీలరేఖాకలితాంతరాలుండై నభోమండలంబు నలంకరించి కలువలకుం జలువయుఁ గైరవంబులకు విహారంబును జకోరంబులకు ఓంకారంబును, నిందుకాంతంబులకు నిష్యందంబును, రిక్కలకుఁ జక్కఁదనంబును,... ... ...బంకజంబులకు శంకయుఁ, బాంథులకు వంధకారంబును, దమంబునకు భ్రమంబును, బాటచ్చరులకు వెచ్చయు, జక్రవాకంబులకు వికిరియుంటు నెలకొల్పి యనన్యదుర్లభంబగు విభావిభవంబున వెలసి)యుండె నప్పు డవ్విప్రుండు విప్రయోగవ్యధాధూయమానమానసుండై వేఁడివెన్నెలం బొక్కి యుక్కడలి యొక్కరమణీయస్థలంబునఁ గనకలతం దలంచి యంతర్గతంబునం జింతింపం దొడం(గె.) 187

ఉ. (ఓయొలనాఁగ!) నాకు నిలుపోపనితాపము నూలుకొల్పి నీ
వేయెడ నున్నదానవు? మదేకదవస్థ హరించి చక్కఁగాఁ
జేయుట నీదుపాలనె వసించుట యించు కెఱుంగనైతి వ
య్యో! యిగురాకుఁబోఁడులు దయోదయ మింతయు లేనివారలే? 188

ఉ. ఈపికరాజి యీశుకము లీశశికాంతులు నీసుధాప్రభు
శ్రీపరిపక్వచంద్రికలచెల్వము లీయలిపోతఝుంకృతుల్
కోపవదంగజాతశరఘోరనిపాతముఁ గూడి నాకు వ్యా
త్తాపముఁ జేయుచుండె నిఁకఁ దాళఁగఁజాలను గావు మీయెడన్. 189

చ. జలరుహగంధి! నీవదనసన్నిధి వెన్నిధి, నీమనోహరా
త్యలసకటాక్షవీక్షణవిహారము హారము, నీసుధామిళ
త్కలమృదువాక్యనైపుణులగర్వము పర్వము, నీకపోల ని
స్తులకళచెల్మి కల్మి, యయితోఁచెదు నాకిఁక వెన్నెలీసులన్. 190

సీ. మదిరాక్షి! నీముద్దుమాట లాలించిన, పారఁబట్టనె పికస్ఫారరమణి
యొలనాఁగ! నీముఖం బింత చూచినమాత్ర, వెలవెలచేయనే విధువిభూతి
హరిమధ్య! నీవదనానిలంబులు గ్రోలి, కలఁచి తూలించనే కమ్మగాడ్పు
కొమ్మ! నీకమ్మనికెమ్మోవిఁ జుంబించి, చిదిమివైవనె మావిచిగురుటాకు
గీ. మత్తగజయాన! నీమేను హత్తియుండి, పెలుచ నాకులపఱుపనే యలరుఁదీవ
నీయుపేక్షణ నాకింత నిబిడతాప, మానవలసె వివేకంబు మానవలసె. 191

గీ. అనుచు ననమాకుగాకుగాహతులఁజేసి, చిత్త మెరియంగ వెన్నెలచిచ్చు పెగలఁ
గ్రాఁగువిప్రునకజకల్పకల్ప మగుచుఁ, గడచెనాఁటిరేయి యంతటఁ బొడిచె నినుఁడు.

గీ. దినముఖోచితకృత్యముల్ దీర్చి యంత
వచ్చి పరభావవేది భావజశరాగ్ని
నవశుఁడై యున్నసఖుఁ జూచి యాత్మ నులికి
యతని మెల్లనఁ దెలిపి యూరార్చి పలికె. 193

క. వాలికలగు తెలిగన్నుల,బాలికకై యింత వంత బడలఁగ నేలా?
తూలి కడువైభవంబుల, కేలిక వీఁకఁ గమ్మ నిన్ను నింతిని గూర్తున్. 194

మ. పలుకంబారకుమీ సుధాంశురుచికిన్ భ్రాంతంబు గానీకుమీ
తలఁపు న్మందసమీరణాంబునకుఁ బంత న్మూలకుం బోకుమీ
యలరుందావికి నింక నోధరణీదేవాపత్య! నాసత్య మా
కలకంఠిన్ నినుఁ గూర్తు నేస్తు మరలం గాలింతుఁ గామోద్ధతిన్. 195

చ. అన విని బాష్పధారలు నిజాననచంద్రునియందు మంచురూ
పునఁ బొడగట్ట భూమిసురపుత్త్రికుఁ డుస్సురుమంచు వెచ్చనూ
ర్చి నిజసఖున్ మనోభిమతసిద్ధికరున్ ఘనసారశీతలున్
గని కడుదీనుఁడై పలికె గద్గదికావిలకంఠనాళుఁడై. 196

ఉ. కామునిబారిఁ ద్రోచి ననుఁ గామినిఁ గూర్చక పోయి తక్కటా!
యేమనువాఁడ నిన్ను సఖ! యే మనువాఁడనె? విప్రియోగదుః
ఖామితతీవ్రవేదనల నందుమదేతదవస్థ యొక్కరుం
డేమియెఱుంగు? విశ్వపతి యీశ్వరుఁ డాత్మవిదుండు దక్కఁగన్. 197

సీ. కర్ణసూచిక యయ్యెఁ గలకంఠవరకుహూ,కారమహోదారకలకలంబు
సంతాపకర మయ్యెఁ జంద్రదాననాకరా,బ్జాలోలతాలవృంతానిలంబు
గ్రీష్మోద్గమం బయ్యెఁ గృతగర్వయామినీ,రమణసుధాపూర్ణవిమలకాంతి
విభ్రాంతిపద మయ్యె వికసితప్రసవాస,వామోదవారివిహారకలన

గీ. ఏమిసేయుదు? నాకింక నిందువదన,వదనపద్మావలోకనవ్యాప్తి లేమి
వామలోచనఁ గూర్చి నావంకఁ జేర్చి,యిట్టివెత మాన్పి ప్రీతిఁ జేపట్టు సఖుడ!

చ. అనవుడు నట్లుగాక మన కన్నిటికిన్ శివుఁ డున్నవాఁడు నీ
పని ఫలియించు నింతవెతఁబట్టకు భూసుర యంచు మిత్రు వీ
డ్కొని పరభావవేది యనుకూలములౌ శుభసూచకంబులన్
గని మది నుబ్బుచుం జనియె గ్రక్కునఁ దత్పురివేశ్యవాటికిన్. 199

వ. ఇట్లు ముందట. 200

మ. శతమన్యుప్రదరానసోపమవిరాజత్తోరణం బంగనా
కృతగాంధర్వవిశేషగుంభితము లక్ష్మీపుండరీకాక్షప
(ద్మతజాశంకరవాజ్మ)రాశరధరూపవ్యాప్తచిత్రంబు పో
షితపారావతముఖ్యకేళిఖగసంఙ్ జేటీసమాకీర్ణముఞ్. 201

చ. కలసంవద్విటవిటము విస్ఫుటమంగళసంగతంబు ని
ర్మలశశికాంతకుడ్యము చ(మత్కృతిమత్కృతిధూర్తచేటికా)
తిలకము మైనవారసుదతీగృహ మొక్కఁడు గాంచె శాస్త్రలో
పలఁ గడు విస్మయంబు గనుపట్ట మదాలసుచుట్ట మయ్యెడఞ్. 202

క. ఆమందిరంబు కనకల,తామందిర మగుట నిలిచి తద్దయు...
......దున కభిముఖుఁ, డై మెల్లన నడవఁ దొడఁగె నతఁడిం పలరఞ్. 203

గీ. ఏమి సేయుచున్నవా రింటివారు, వచ్చితిమి మేము చుట్టాల మిచ్చటికిని
ననుచుఁ దరహసితాననుం డగుచుఁ జొచ్చె,నంత నాతండు తద్గృహాభ్యంతరంబు.

సీ. పగలు రాతిరి సేయుఁ బగగంగ రాతిరి, పగలుసేయుఁగ గామ్పుఁ దగిలి పట్టి
నిష్ఠుక లాడిఁగట్టె నెఱేసందుగలిగిన, సావడి కొట్టంబు చంకఁ బెట్టి
మున్నీరు దిగనీఁద మన్నా మిన్నును గూర్చ,(నుంచును గొలువ ఘామంబు) దవియఁ
గన్నుంచఁగా లోనిగనుపాప వెదకింప, బిట్టు శేషాహి వాకట్టు గట్టి

గీ, ఆతఁ డైలంబు పుట్టింపఁ జేతిలోన
సకలజగములు నొక్కట సవదరింపఁ
జాలి యేపార్గు విటులకు జాలి యొసఁగు
కనకలతమాత మాయాప్రకారభూత. 205

చ. పరగఁగ నెల్లవారు విటభల్లిక యాఁచుఁ దలంప వీటిలోఁ
జిరముగ నెన్నికం గనినచేడియ లంజియతల్లి యిల్లు మం
దిరమునుగూర్చి వచ్చినసుధీమణినందనమిత్రి గారనం
బరుదుగ నాసనాదుల ముదస్వితుఁగా నొనరించె వెండియుఞ్. 206

క. పాటలగంధులుఁ దగఁ బరి,పాటిం బాటీరచర్చ పై నెఱి నలఁదఞ్
జేటిక (శివచే నొసఁగిన,వీటిక) గొని యిచ్చి యతని వినుముని పల్కెఞ్. 207

ఉ. మన్నన నామ మంచలగు మంజులవాణికిఁ జుట్టమై నచి
ట్టన్నమభట్టునందనుఁడ వల్లుఁడ వారయ వావి నాకు నీ
వెన్నఁడు మాగృహంబునకు నేటికి రావిది నీకు వింతయే
పిన్నవు గాన కూరుముల పెంపుఁ దలంపవుగాక భూసురా! 208

క. వానకునో వఱపునకో, పూనిక నీరాక వింతపాడయె నా పై
నూనెనె యున్నాళకు నీ, మానసమునఁ గొంతకూర్మి మందిద యయ్యెన్. 209

చ. తరతర మెన్నిగాయెవ మగఁదండ్లకు సొమ్ములు పెట్టెనోడి లో
భరతినో యిందు రావు హాసుపంపున గ్రాసము గల్గియుండు నె
వ్వరిమది వేగిరింపను భవజ్జయితికి నేల భీతి లోఁ
బొగయఁగ బెద్దవారికిగ్రుఁ బొం దొనరింపుము నీవు మాపయిన్. 210

గీ. ఓడగట్టినదూలమై యుండవలయు, మీకు మాకును నెనరైనమిత్రభావ
మింటికిన్ వచ్చుచుం బోవు చుంట మేలు, నీకు మే మెంతవారము నీతి దెలుప.

క. చేయం జేయఁగఁ బొం దగు, పాయం బాయంగ నెడలు బాంధవ మెందున్
మీయన్నగారికైనడి, మాయందులఁ బొందు నిలుపుము విప్రవరా! 2:2

క. నా విని మానసమున మో, దావేశము నివ్వటిల్ల ధ... ...మితుగ్రిం
డావెలఁదితోడ నిట్లను, ప్రావీణ్యవిలాససఫణితులు చెలఁగన్. 213

క. ఇంటికి వచ్చినఁ గొట్టను, లింటికి రాకున్నఁ బరులె? యొనసినయెదలో
నంటినమచ్చిక గల్గినఁ, గంటం గనుఁగొంటకేమి? (కమలద)ళాక్షీ! 214

చ. అది యటులుండనిమ్ము కమలానన! నీప్రియపుత్త్రి జవ్వనం
బొడవి విలాససంపదల నుజ్జ్వలయై విలసిల్లురేఖ చూ
చెద నని వచ్చితిన్ బినపఁ జెప్పెద నొక్కరహస్య మన్నియున్
(గొదువ గొఱంత)లేక సమకూరెడు నీమదిఁ బర్వియుండినన్. 215

క. శాతోదరి నీకూఁతుం, జాతము రప్పింపు మనుఁడు సుదతియుఁ బుత్త్రిన్
దోతెచ్చి యంకపీఠికఁ, జేతోమోదమున నిల్పి చెన్న(లరారన్.) 21

సీ. (కలికి)బంగరుబొమ్మ కందర్పబాణంబు, మొలకమెఱుంగు వెన్నెలలనిగ్గు
పగడంపుఁదీగె సంపంగిక్రొన్నన చిన్ని, హరిణాంకరేఖ కప్పురముపేరు
జాతిరత్నశలాక సాకారమధులక్ష్మి, (రతనాలజిగితేట) అతనురాణి·
పెంచినచిల్క జీవాంచితాలేఖ్యంబు, కస్తూరినిగరంబు కళలకరువు

గీ, ననఁగఁ గమనీయమహితమోహనవిలాస, భాసమానాంగి యగుకూఁతుఁ బట్టిచూపి
పలుకు బలుతియ్య మింపులు గులుకనట్లు, (వేశ్యముదివేశ్య)పరభావవేదితోడ.

గీ. నీకు నాతోడుసుమ్మవనీసురేంద్ర!, మెచ్చు మిగ్రింగఁదలంచిన మృదునియాన
నిజము చెప్పుము మత్పుత్త్రి నీలవేణి, సవతు పూఁబోఁడి గలదె యిజ్జగమునందు.

ఉ. చక్కఁదనానఁ గా వయసుచాలినవానిని గా ప్రదాత గా
తక్కనివానిఁ గా విటులనగ్గ మెఱుఁగినవానిఁ గా సిరిం

జెక్కువవానిఁగా సొగసుఁ బేరును బెంపును గల్గువానిఁగా
నొక్కనిఁ జూడుమీ యరసి యుగ్మలికన్నె యికంబు విడ్వఁగన్. 219

ఆ. ఎదిగి పసితనంబు (బిదిలిన నా)మైన, తగవు గాదు నిల్పఁ దలిరుఁబోండ్ల
నట్లుగాన దీని కనుకూలుఁడగు నొక్క,విటశిఖామణిని వెదకు మీవు. 220

శా. నేపాళేంద్రుఁడు మాళవేశ్వరుఁ డవంతిస్వామియున్ మున్నుగా
భూపాలోత్తము (లెందఱేని ధన మింపుం బెం)పు దీపింపఁ దా
రీపద్మాననకిచ్చి పొందు గొనుకో నేమేమొ యంచున్నవా
రావృథ్వీపతు లిచ్చునీవిదెస నా కాకాంక్ష లే దింతయున్. 221

క. మనసును మోహంబు నెఱింగినవానికిఁ దగినవానికని బొందుగ నీ
వనజాననఁ జేసెద నే, నని నాయున్నతి తలంతు వవనీదేవా! 222

వ. అనవుడు నది యతని చెలికానిమనోరథంబునకు ఫలకాలం బని యమ్మహీదేవుం డావేశ్యమాతకు ని ట్లనియె. 223

గీ. మంచిపని సేసితివి నీవు మహీపసుతుల,తోడిజట్టుఁ జొరక యోతోయజాక్షి!
మనము సంసారులము గాన మనకుఁ దగిన,వారితోడను బొందు భావ్యంబు చేయ.

మ. ఒకఁ డున్నాఁడు మదీయబాంధవుఁడు గణ్యుం డెల్లచోఁ బల్లవుల్
సకలానంగకళారహస్యవిదుఁ డీజాణండ యంచున్ దనున్
బ్రకటింపన్ భవదాత్మజాతకుఁ దగున్ భామా యతం డీను బు
చ్చుకొ సామ్ము,శ్రీము గల్గుఁ బేరు సమకూర్చున్ నీకు నైశ్వర్యముల్. 225

చ. అనవుడు నింతి యిట్లనియె నట్టిదయేని ధరానిలింప! నీ
వనినరసజ్ఞుతో సరసిజాననఁ గూర్పుము మాకు వచ్చు న
గ్గవములనెల్ల నిచ్చి యుచితజ్ఞత నాపుడు నియ్యకోలుమైఁ
జనియె నతండు నెమ్మనము సంతసమొంద వయస్యపాలికిన్. 226

క. చని తనపోయినయంతయు, వినిపింపఁ బ్రమోదవార్ధివీచులలోనన్
మునిఁగి మదాలసుఁ డాలింగనమున సఖు గారవించి కడు నగ్గించెన్. 227

సీ. పొసఁగ నీగతి మదాలసుచేతఁ గూర్మి సం,భాషితుం డయి పరభావవేది
తదనుమతంబునఁ దపనీయరత్నవ,స్త్రము లాదిగాఁ బదార్థము లసంఖ్య
ములు సానిజననికిఁ దలఁపు కోరికకంటె, నినుమడిగా నిచ్చి కనకరత్న
సంబంధమునుబోలె సరసులు గొనియాడ, ఘటియించెఁ జెలికానిఁ గనకలతను

గీ. గుసుమవల్లరి నలచేఁటిఁ గూర్చుమలయు,పవనుకైవడి నంత నాబ్రాహ్మణుండు
మన్మథాద్వైతసుఖవార్ధిమజ్జనమునఁ, దోఁగి పరితాపమంతయుఁ దొలఁగఁ జేసె.

చ. ఉడుగని కామతంత్రముల నూని మనోజ్ఞము పల్లవింపఁగాఁ
గడఁగి వశావశేభపతి కైవడి మత్తమరాళికాసతిం
బుడికెడు రాజహంసపతిపోల్కి మదాలసుఁ డన్మృగాక్షితో
నోడఁబడియుండె సంతతము నొండుతెఱంగుల నుజ్జగింపుచున్. 229

గీ. మాడ లన్నను మాడలు మణివిభూషణంబు లన్నను మణిభూషణంబు లెలమి
వలయువస్త్రంబు లెల్లఁ గైవసము సేయు, సానితల్లికి నప్పగించునతఁ డిట్లు. 230

క. భజనచెడి దానిపొత్తున, భుజియించెను మనుష్యుఁ డారివేఁ బోల యంటె వెసన్
ద్యజియించెఁ దగినవడవడి, కుజనుండై ధరణిసురుఁడు కుత్సితబుద్ధిన్. 231

ఉ. పాటలభంగశోభితమధుపానవశుం డయి చొక్కి మిక్కిలిం
బాటవ మేది భూసురుఁడు పాటలగంధికిఁ జిక్కి శాటికల్
హాటకముల్ మణుల్ గలపదార్థము లన్నియు నప్పగించె వే
(యేటికి మోహవార్ధి నశమే) తరియింపఁగ నెట్టివారికిన్? 232

సీ. పతితునిఁ బొందు పాపము చుట్టు నని రోసి, ప్రాణబంధువు లెల్లఁ బాసిచనిరి
యొట్టివిద్యలయందుఁ బట్టి మాటఁగ లేమి, యనుగునే దొరయును బుడుకఁ డగ
మింతి (బందుగులెల్ల నితఁ డపాత్రుం డంచుఁ), గైకొనరై రొక్కగవ్వకైన
సత్యంబుచాలనిచపలుండు వీఁడంచు, వెచ్చంబు వెట్టంగ వెఱచె బచ్చ
గీ. వలపు గలిగినయ జనయిత్రి వలన వెఱచి, కనకలత దక్కి మాఱుమొగంబు వెట్టె
నీ తెఱంగునఁ జెడెఁ గాని (యింతపుణ్య, కర్మసం)స్కార మతనికిఁ గలుగదయ్యె.

సీ. మును ప్రముచ్చిలించి తెచ్చినయర్థ మంతయు, నపరిమితము వెచ్చమైనకతన
మనము నిల్పక పోయి మగువపొత్తునఁ దిన్నఁ, గని తన్ను జనులు గైకొననికతన
(తనకష్టసుఖములఁ గను)చుట్ట మెవ్వఁడు, మానుగ నెచ్చోట లేనికతన
నున్నతభోగంబు లన్నాళ్ళఁ గన్గి బిట్టొకసారె నవియెల్ల నుడుగుకతన
గీ. ప్రాణపదమైన యెలనాఁగఁ బాయుకతన
తొంటితేజంబు నుఱవేసి (దుఃఖి యగుచుఁ)
బురములోపల వసియింప వెరవుమాలి
యరిగె నెందైన నాబ్రాహ్మణాధముండు. 234

క. ఈచందంబునఁ జని యా, నీచాత్మకుఁ డొక్కచోట నిలిచి మనములోఁ
జూచును విత్తార్జన మెట్లైచేయుట యేమిభంగి నగునో యనుచున్. 235

చ. వసమరి విత్తహీనుఁడగువాఁడును బ్రాణములేనివాఁడు ధా
త్రి సములుగాఁగ నెన్నుదురు ధీనిధు లట్లగు గాన నాకు వె

కృపసముగ విత్తమేకరణిఁ గల్గెడిఁ బ్రాణమువోలె దాన నా
వసముగఁ జేయఁజాలెఁ బ్రియభామిని రూపమనోజకామినిన్. 236

గీ. కనక మార్జింతు నెన్నిమార్గముల నైన,గనక మార్జించుకొని కొందుఁ గనకలతను
గనకలతఁ గూడ నీమాఱు గలిగెనేని, వేయు నేటికి త్రిజగతీవిభుఁడఁ గానె.

శా. ఆవింధ్యాచలపార్శ్వపట్టణము లత్యంతంబు నానాఘన
శ్రీవాసంబుల వాఁగ విందుము జనశ్రేణుల్ ప్రశంసింప నే
నే వేగం జని తద్ధరాస్థలము పృథ్వీపాలకాగారముల్
ప్రావీణ్యంబునఁ గన్నుపెట్టి సకలార్థవ్రాతముల్ దెచ్చెదన్. 238

క. కడియును గత్తియు నాచే,వడి యుండినయేని పద్మభవునిల్లైనన్
వడిఁ జొచ్చి కన్నమున వెస, నెడలింపనె మినుకకుఁడ వేదండంబున్. 239

క. అని కృతనిశ్చయుఁ డగుచున్, జనియెన్ గహనంబు ద్రోవ సాహసవృత్తిన్
మనమునఁ గొంకక దక్షిణ,మునకై ధనకాంక్ష దన్ను మునుకొని తివియన్. 240

చ. వెనరగునింతితోఁ బెరసి నీడమెఱుంగున నున్నవాఁడు గా
వున నడవంగ రాక తనువుం గలచెమ్మట్లు దూలఁ జిక్కి విం
ధ్యనగసమీపకాననమునందుఁ బథశ్రమ మోర్వ డింపఁ ద
త్కనకలతావిటుండు వెడగాడ్పు రవిప్రభఁ గూడి వీవఁగన్. 241

క. వడదాఁకి దప్పిగొని యా,చెడుపాటుఁడు పెదవు లెండఁ జెదరి పదంబుల్
వడవడ వడఁకఁగ వింధ్యపు,నడుతెరువునఁ బడియె నొక్కనగపతినీడన్. 242

శా. ఆవేళం ధరణీసురుం డొకఁడు విద్యాపాఱుఁ డన్వాఁడు వి
ద్యావాణీవిభుఁ డొక్కభూమిపతిచేతన్ నిష్కముల్ రత్నముల్
దేవగ్రాహ్యములైన వస్త్రములు తృప్తిన్ దానరూపంబుగా
శేవం గైకొని వచ్చెఁ బాలుఁ దనపట్టం గూడి యాత్రోవనన్. 243

గీ. దైవయత్నంబుచే ధరాదేవుఁ డతఁడుఁ
దానుఁ దనయుండు వడదాఁకి తాపమొంది
యావృద్ధాలనువసియించునట్టిచెట్టు
నీడ కేతెంచె నొక్కింత నిలుచుకొఱకు. 244

క. ఆచెట్టునీడ నప్పుడు, చూచె మహీదేవవరుఁడు క్షోణీశయనున్
వాచావిహీనముఖు గళ,గోచరజీవున్ విబోధకుంఠితు నతనిన్. 245

వ. చూచి వీఁ డెవ్వఁడొక్కొ? అగమంబగు నీమార్గంబున కేమిపనంబున వచ్చిన
వాఁడో వీని కేమియైనదొక్కొ? తెలియందుముగాక యని చేరంజని యరసి

యతని వడ(దాఁకినవాని)(గావివేకంబున నిశ్చయించి కృపాళుండై విద్యా
పాలుండు. 246

చ. తనకరదీప్తిలోనిహిమధామసుధావిమలంబులైన తి
య్యనిసలిలంబు లొయ్యనఁ బ్రియంబునఁ బాణిసరోరుహంబునన్
... ... ...ల గోముఖమండలి ముస్నుగాఁగ నా
తనికి నతండు గొంత పరితాపభరం బెడలించె నందునన్. 247

ఆ. ఇట్లు నేదదేటి హీనస్వరంబున, నతని కనియె నమ్మదాలసాఖ్యఁ
డనఘ! కొంత మానె నారాటము..., ... ...దగులు వాపు. 248

చ. అన విని సంభ్రమంబున దయాకరమూర్తి మహీసురుండునుం
దనమది హెచ్చరింప మును దత్తనువుం దడవంగఁ గొన్నిని
ల్చినసలిలంబులన్ రసనఁ జిల్కుచుఁ గుత్తుక డెక్కు (నంతనం
తన సరిచేసికొంచును యథాస్థితి నూనఁగఁ జేసెఁ బ్రాణముల్. 249

ఆ. అట్లు నేదదేటి యల్లన చే గాలు, గదలనిచ్చి వదనకమల మెత్తి
కనులు విచ్చి చూచి గ్రక్కున లేచి కూ, ర్చుండి మాటలాడుచుండ నంత. 250

సీ. తెలిసి యం(తట ధరిత్రీదేవకులనాప,కుండు)విద్యాపాలుదండవినతి
చేతఁ బ్రీతునిఁ జేసి చేనోయి తెంగుడించి, వినయావనమ్రుఁడై యనియె నతని
ననఘాత్మ! నీకతంబున నిప్పటికిఁ (బ్రాణ,మున నుండ గంటి నీమూర్తి చూచి
సకలాంగకంబులు చల్లనయ్యెను నాకు, (నిజవృత్త మెఱిఁగింతు) నీవు వినుము
గీ, జాతివిప్రుండ వాదంబుచేత నోడి, సిగ్గుపడి శాస్త్రపాఠంబు సేయఁ గోరి
పోవుచున్నాఁడ నెటకైనఁ బోయి పోయి, అగ్గిదాఁకితి నిచ్చోట నైతి నిట్లు.

ఉ. నామదిఁ దోఁచుచున్నయది నాయన! నీవు దలంప సర్వవి
ద్యామయమూర్తి వంచు ధృతి దప్పక నీపదపద్మయుగ్మమున్
బ్రేమ భజించి శాస్త్రములు పెక్కనతోఁ బఠియించి పోఁడనై
భూమిజనైకవంద్యగతిఁ బొల్చెద నిల్చెదఁ గీర్తిసంపదన్. 252

గీ. కాఁపురము నాకుఁ గడుఁబెద్ద కంచియందు
యిల్లు (శీధాన్యకటకమై హెచ్చు మిత్రి
అరయఁ దలవెందు)కలయాద అచ్చికంబు
లేదు గ్రాసంబునందు నోవేదమూర్తి. 253

వ. అనిన విని యట్లుకాక నీవు మాకుం గుమారునిమాఱు నీ కవ్విధంబున నుండవ
లయు నవ్విధంబున మాతోడం గలసి వర్తింపు మని (హర్షలోలుండై విద్యా

పాలుండు వాలీకబాంధవుం డస్తశైలశిఖరం బరుగుటయుఁ దదయుక సంధ్యాదికృత్యంబు లవంధ్యప్రకారంబున నొనరించి యథోచితంబుగఁ దృణాస్తరణంబగు ధరణిశయనంబునం బవ్వళించి నిద్రించుసమయంబున. 254

గీ. ఆకృతఘ్నుండు బ్రాహ్మణునందుఁ జాల,ధనము గలుగుట వీక్షించి తత్తఱించి
అది సమస్తంబు మ్రుచ్చిల నాత్మఁ దలఁచి,ప్రబలసంతమసార్ధరాత్రంబునందు.

మ. తనుఁ జాకుండఁగఁ బ్రోచినాఁ డనక వృద్ధబ్రాహ్మణుం బిన్నవాఁ
డని కొంకింతయు లేక తత్తనయునిన్ బ్రాణంబులం బిట్టు పా
పి నయం బింతయు లేక చేరి వెరజెం బేలైనతద్విత్తముల్
ధనకాంక్షాపరుఁడైన వానికి నిషేధంబేల చూపట్టెడిన్. 256

గీ. వెకకఁబోయినతీఁగ వేవేగఁ గాలఁ, జుట్టికొనినట్లు కోరినయట్టి సొగ్గ
మిట్లు దొరకిన సంతుష్టహృదయుఁ డగుచుఁ,గనకలత కిత్తు నని నిరాఘాటగతిని.

క. ఆవేళఁ గదలిచనఁగా, దైవగతిం దెరువు దప్పెఁ దనపురితోవన్
బోవిడిచి కాశినగరికి, నై వచ్చె నతండు గొన్నియహములు వోవన్. 258

సీ. ఏవీడు విలసిల్లు శ్రీవిశ్వనాథజూ,టపినద్ధముగ్ధేందువిపులకాంతిఁ
జెన్నొందు నేపురం బన్నపూర్ణాఘన,స్తనభారకాశ్మీరసౌరభముల
వెలయు నేనగరంబు విబుధకల్లోలినీ,కల్లోలవాల్లీసకములకలిమి
నేపట్టణం బొప్పు హేలామయుండు డుంఠి,విఘ్నేశదానాంబువిభవలబ్ధిఁ

గీ, బెరిమఁ జూపట్టు నేపుటభేదనంబు, హృద్యకైవల్యలక్ష్మికి నిక్క యగుచు
నట్టియవిముక్తమునకు దినావసాన,సమయమునఁ జేరె వాఁ డదృష్టంబుకతన.259

ఉ. ఆదరితాత్ముఁ డిట్లు మదనాంతకుపట్టణ మట్లఁ జొచ్చి వె
ల్లిదయు వానయుం దమము నేడ్తెఱఁ గూడి జనావరోధముం
బ్రోదిగఁ జేయఁగాఁ గడచి పోవ వసంబటి ప్రాలుమాలి స
ర్వోదరమైనయొక్క ... ... ... చొచ్చి శ్రీమహాకులాత్ముఁడై. 260

క. నిద్దురకుఁ గన్ను మోడ్చుచు, నుద్దవిడిం దెక్కి యున్న యుగ్రోరగము
ద్యద్గరళజ్వాలావళి, నద్దినకోలలకు నతని నాప్తునిఁ జేసెన్. 261

మ. వవశాహారవిషాగ్నిదగ్ధుఁ డయి తాపం బందుచున్నట్టిభూ
దివిజుం జేరి హరుండు విశ్వవిభుఁ డాదిస్వామి కన్యాధవుం
డవధానంబున దక్షిణశ్రవణ మొయ్యన్ దారకబ్రహ్మవి
ద్యావిశేషప్రతిభోపదిష్టముగఁ జేయం బూనుకాలంబునన్. 262

మ. అరుణాక్షుల్ గురుకుక్షులున్ వికటదంష్ట్రాభీలవక్త్రాంతరుల్
శతదాభుల్ కరవాలహస్తులు ఖరచ్ఛాయోర్ధ్వకేశచ్ఛటుల్
భరితాహంకృతు లంతకానుచరు లాపాపాత్ముఁ బాఱి గ్రహో
ద్ధురవేగంబునఁ బట్టి తేరఁ జని రంతో వంతము ల్పల్కుచున్. 263

గీ. ఒకనిఁ బట్టఁగఁ బరుగు రిట్లొత్తిపోయి, యమ్మృదాలను కడ నున్నయంతకారి
దేరకొనిచూచి వచ్చిన తెరువు పట్టి, రంతకునికింకరులు భయభ్రాంతు లగుచు.

చ. తమపని కాకపోవుటకుఁ దంబున నప్పుడు విక్లబాస్యులై
యముఁ గని తద్భటుల్ వడిఁ బ్రయత్నవిఘాతముఁ దెల్పి చెప్పుచున్
శమనుఁడు కాలుఁడుం గినిసి సైరిభరాజము నెక్కి బ్రాహ్మణా
ధముఁ గొని తేరఁగా నరిగె దట్టపుఁగింకరసేన గొల్వఁగన్. 265

మ. అరిసాక్షుండు మహానుభావుఁడు త్రిలోకారాధ్యుఁ డీశ్లేల తా
వలదు స్త్రాత్ము ననుగ్రహించు నిది దా నాశ్చర్య మూహింప విం
తలు పుట్టెన్ మఱి తత్ప్రవర్తనకుఁ దాఁ గూర్చునే యుగ్యుఁ ద
ట్టుల దీనం జెను నెల్లధర్మములు చోటుం దప్పి త్యక్తంబులై. 266

క. అని సందేహింపుచుఁ దాఁ, జని కాశికలోనఁ గాంచె శమనుం డసమా
క్షునిసరిగద్దెపుఁ గూర్చుం,డినభూసురపుత్త్రి నతులనిర్మలగాత్రిన్. 267

గీ. చూచి ప్రమానుగ వీనులఁ జాచుతోడవు
వేల్పునకు మ్రొక్కి యొకవంక వినయనమ్ర
దేహుఁడై నిల్చె నమ్మహాదేవునాజ్ఞ
శిరముపైఁ జేర్చి తలవంచి తరణిసుతుఁడు. 268

గీ. ఒదిగి యత్యంతదీనుఁడై యడఁగి మడఁగి, సిగ్గుపడియున్నజను నిరీక్షించి మున్నె
యతని రాకకుఁ గారణం బాత్మఁ గాంచి, యమ్మహాదేవుఁ డీక్రియ ననియె నగుచు.

ఉ. వచ్చితి వేల? దండధర! వచ్చియు మాసినముత్తెమట్లు మో
మిచ్చి యొకింతయుం బలుక వేమి? మనంబున శంకఁ దక్కి వా
క్రుచ్చుము నావుడున్ హరునకున్ వెస నంజలి యాచరించుచున్
వెచ్చన యూర్చి యిట్లనియె వెల్లవఱంబున వాకృతాంతుఁడున్. 270

ఉ. ఏమని విన్నవింతుఁ బరమేశ్వర! విశ్వజనాలి రాత్మవై
ధార్మికవృత్తి జంతువులఁ బట్టి వినోదముపోలెఁ ద్రిప్పుచున్
భూమగుణప్రభావమునఁ బొల్చినమేటివి నీవు మన్మన
స్తామరసంబు సందురవిధంబును గాన వి దేమిచిత్రమో. 271

మ. విధురేఖావిలసత్కపర్ద! విను మీవిప్రుండు దుష్టాత్ముఁడై
విధికిం బాసి నిషేధమునం దవిలి వేవే లుగ్రపాపంబులన్
బుధులెల్లన్ హసియింపఁ జేసి పిదపన్ బొందెన్ భవద్రూప మీ
యధికారం బిఁక నాకు నేమిటికి ధర్మాధర్మముల్ లేనిచోన్. 272

సీ. మొదల బ్రాహ్మణకర్మములపట్టు వదలించి, జారుఁడై కులటలఁ జంకఁ బెట్టి
తల్లిదండ్రులమాట తలమీఱి వర్తించి, కైదువ ధరియించి జూదమాడి
చోరుఁడై శంకరుసొమ్ములు దొంగిలి, హత్తి వారాంగనపొత్తు దొడఁగి
గంజాయి భక్షించి కలు ద్రావి నంజాఁడు, నమలి కృతఘ్నుఁడై నట్టడవిని

గీ, శాంతు వేదాంతవిద్యావిచారనిపుణు, నిరపరాధు మహీసురవరుని నతని
పుత్త్రికుఁ జంపి తుది నిన్నుఁ బోలినాఁడు, వీఁడు నేనేమియనువాఁడ విశ్వనాథ!

ఉ. కూరలు గూళ్లుఁగాఁ గుడిచి కోరిక లేరిక లెత్తనీక కాం
తారములోఁ దపంబు లతిదారుణభంగి నొనర్చువారికిన్
జేర వశంబుగానినినుఁ జేరి శుభాకృతిఁ దాల్చియున్నవాఁ
డేరికి నంటరానిఖలుఁ డీతఁడు చోద్యముప్రోవు శంకరా!. 274

క. ఇఁక నేల ధర్మసంగతి, యిఁక నేల? పరోపకారహేలావిభవం
బిఁక నేల విధినిషేధము, లిఁక నేల వివేక మాత్మ నెఱుఁగుతలంపుల్. 275

క. వలసినలాగులు గ్రిమ్మరి, బలహీనుల వెఱవులేక పరిమార్చి తుదిన్
జలనంబు లేనినిన్నున్, గలయుట పనిగాదె తలఁపఁగా దేహులకున్. 276

ఉ, తొల్లియు శ్వేతుఁ గాచితివి తుచ్ఛుఁడు వీఁడని చూడ కాత్మ శో
భిల్లుదయారసంబు గలప్రేమ దగం గని బ్రహ్మఘాతుకున్
గల్లరి ...నిన్నుఁ బొల్చుకొని కల్మషదూరుఁగఁ జేసి తద్రిజా
వల్లభ! యొల్ల నీవిషమవర్తనమైన నిజాధికారమున్. 277

ఉ. నావిని మోముపైఁ జిఱుతనవ్వుదలిర్పఁ గృతాంతుఁ బల్కె న
ద్దేవుఁ డభంగురామృతవిధేయములౌ పలుకుల్ చెలంగఁగా
నీ విఁక భానుపుత్త్ర! మది నిల్పకు మీతమకంబు నీమహీ
దేవుఁడు నేన తా నగుట తెల్లముగా వివరించి చెప్పెదన్. 278

శా. లోకు ల్గాడనుచుండఁగా నవనిలో లోలాత్ములన్ విప్రులన్
బాకానాథగవాదులన్ గడపనీ పట్టందు ... ...
... ... పుత్త్ర! మానవుఁడు మల్లీలానివాసార్హమా
నీకాశీనగరంబునం దెగినచో హెచ్చున్ ననుం బోలుచున్. 279

సీ. పౌరుషంబు కొలంతపడుట మేనసెకాని, కలుగదు వానివంగడమునందు
నెద్దుచందంబెల్ల నెక్కి రింతనెకాని, తగులదు వానివర్తనమునందు
రెండునాలుకలౌట పెండారమునఁగాని, హత్తదు వానివాక్యములయందు
... ... ... దుష్టడొంకనెకాని, పరగదు వానిపాత్రభవమునందు
గీ, భంగపోవుట తలపూవుపైనె కాని, దాటుకొన దింత వానిమానసమునందు
నెవ్వఁడేఁ గాశికాపురి కేఁగుదెంచి,బొంది దిగఁద్రోచు భాగ్యంబుఁ బొందఁడేని.

గీ. ... శిష్టితుఁడు పుణ్యం డటన్న,పాపకర్ముండు సుకృతంబుపాలఁ బోవు
కాశి కేఁగినఁ బాపంబు గడవ దన్న,పుణ్యమూర్తియు దురితంబుపొంతఁ బోవు.
గీ. తేఁటిమూ కృంటఁ బువ్వ తదీయరూప, మొందుగతి సిద్ధరసమున నూని యినుము
కాంచనం బైనకైవడిఁ గాశి నీల్గి, పాపకర్ముండు దనుఁ బోలు భానుతనయ. 282
క. ఈపుణ్యక్షేత్రంబున, నేపుణ్యుఁడు జడత వాయనిడి మల్లింగ
స్థాపనము చేయు నాతఁడు, ప్రాపించును బొందివారఁబట్టక ముక్తిన్. 283
మ. కడు వ్యగ్రాహ్యములైన యొండుమతముల్ ఖండించి యీకాశి నే
ర్పడరన్ నన్నుఁ బ్రతిష్ఠసేయుభువుఁడున్ బ్రాణంబులం బాయకే
జడలంగట్టు శశాంకపోతము శిరస్సర్వాహినీపోతమున్
మెడలం జుట్టు భుజంగహారముఁ బ్రభానిర్ధూతనీహారమున్. 284
గీ. ఇనజ! కైవల్యలక్ష్మికి మనికి యగుచు, వెలయు నిందుల మన్మూర్తి నిలిపి నుహ్మ
వృత్రవధసంభవంబైన విషమకలుష,భరముఁ దిగఁద్రోచె దేవతాభర్త మున్న.
క. వరపుణ్యజలజదివసే,శ్వరమగు నిట నన్ను నిలిపి చంద్రుఁడు మును త
ద్గురుకాంతాసంగమభవ,దురితం బెడలించి కీర్తిఁ దొడికెఁ గృతాంతా!. 286
గీ. ఒనర లింగప్రతిష్ఠ చేనొండె మేను, విడిచిపెట్టుట చేనొండెఁ దొడుకవచ్చు
నిమ్మహాక్షేత్రమున ముక్తి యెట్టిపాప,కర్మనకునైన నిక్కంబు కడమ లేదు. 287
ఉ. కావున సర్వకల్మషవికారనిబర్హణ మైనయుష్పరిన్
జీవము నుజ్జగించిన విశిష్టుఁడు గావున దుష్టుఁడయ్యు భూ
దేవుఁ డితండు నేన యయి తేజముఁ గాంచెన కాక తక్కినన్
దావకదండఘాతములు దప్పునె వీనికి భానునందనా?. 288
ఉ. నీవు మదాజ్ఞ మౌళిఁబయి నిల్పి యథాస్థితి నుండు మంచు న
ద్దైవతసార్వభౌముఁడు ముదంబునఁ గాలుని వీడుకొల్పి భూ

శ్రీదేవుని గాచి విశ్వేము నుతింప నిరంతరభక్తరక్షణ
శ్రీ వెలయంగ నుండె సురసిద్ధవరాసురపూజితాంఘ్రియై. 289

సీ. కావున శ్రీకాశికామహత్వముఁ గొని,యూడ నెంతటివాని కలవియగునె?
నీవు నాకాశవాణీమార్గమున విశ్వపతి నవిముక్తేశు భక్తవరదు
సేవింపు నీకోర్కి సిద్ధించుఁ దడయక, యంచు దీవించి పొమ్మనిన నృపతి
కౌండిన్యమునిపాదకమలంబులకు (నెల),నాఁగయుఁ దాను వినమ్రుఁ డగుచుఁ

గీ. గాంచనస్యందనం బెక్కి కతిపయాను
చరులు దనుఁ గొల్వ వేడ్క నక్షణమ గదలి
సరవిఁ బొడకట్టు ననుకూలశకునములకుఁ
గరము హర్షించి విశ్వేశుపురికి నరిగె. 290

సీ. ... సరడంబుఁ జేర్ప నొక్కపురంబు,నందు నుండఁగఁజేసి యాక్షణంబ
వరభాగ్యవతి ప్రభావతి ప్రేమఁ దనమేని, నీడకైవడి వెంటఁ గూడి నడువఁ
గైవల్యలక్ష్మికిఁగంఠహారంబైన,విశ్వేశునగరంబు వెసఁ బ్రవేశ
మగు సన్మహార్థంబునందుఁ బ్రవేశించి, జహ్నుకన్నియలోన జలకమాడి

గీ. యగ్నికృత్యంబు లొనరించి యతులహేమ,దానముల భూనిలింపులఁ దనిపి పూత
చిత్తుఁడై ధరణీకాంతుఁ డుత్తముండు, గుడి కమనించె నతిభక్తి గొనలుసాఁగ.

శా. (స్వర్గంగాలహరీపరీత)హారమహాశ్చంచద్యశశ్చంద్రికా
వర్గాలంకృతదిగ్వధూవదన దీవ్యత్కొండవీటీమహా
దుర్గాధీశ్వరగోపభూవరకృపాధూర్ణద్ధసామ్రాజ్య స
న్మార్గాధీనమనస్క భూభరణహ ... ... గరిణీ. 292

క. ఆశ్చర్యధుర్యధైర్య! విపశ్చిజ్జనకమలతరుణభాస్కరమూర్తీ!
నిశ్చలమానస! సత్యహరిశ్చంద్రవరేంద్ర! మతిసరీసృపవర్గా! 293

పంచచామరము. కలాకలాప! కృష్ణమాంబికాకుమార! ధీరతా
చలాచలాధినాథతుల్య! సత్ప్రతాపనిర్జితా
నలా! బలాహక(ప్రధానసవ్యరూపచాతురీ
వలా! హాలాయుధేందుసన్నిభాశ్రధిగ్యశోనిధీ!. 294

గద్యము.

ఇది శ్రీమదేలేశ్వరగురువరేణ్యచరణారవిందషట్చరణసకలకళాధరణ
రామనార్యసుపుత్త్ర సుకవిజనమిత్ర కుమారభారవి(తి?)
బిరుదాభిరామ రామలింగయనామధేయ ప్రణీతంబైన
శ్రీమదుద్భటారాధ్యచరిత్రం బనుమహా
ప్రబంధంబునందు ద్వితీయా
శ్వాసము.

శ్రీ

# ఉద్భటారాధ్యచరిత్రము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీస్తనపాళీశరధిప, దాస్తోకప్రదరదళితహరిహయరిపుళం
భస్తుతిపరతధురీణను, ధీస్తుత్యా! యన్నమంత్రిదేచామాత్యా! 1

వ. విన్నవింపుము. 2

గీ. ఇట్లు కృతకృత్యుఁడై యమ్మహీశ్వరుండు, వృషభకేతనరుద్ధదృగ్వీథి యగుచుఁ
బ్రబలువిశ్వేశ్వరునిమందిరంబు డాసి, యతులపులకాభిరాముఁడై యతివతోడ. 3

శా. స్నిగ్ధాష్టాపదకుంభదీప్తి రవి నాశ్లేషింప కుభ్రాంబుద
సన్నిగ్ధావళ్యముఁ గేలిఁబెట్టుశిఖరప్రాంశుచ్ఛటాశోభలన్
దుగ్ధాంభోనిధి దీటుకొల్పఁగ సుధాంధోనాథకోదండప
న్యగ్గామాశ్రియతోరణద్యుతులు నేత్రానందముం జూపఁగన్. 4

సీ. ఉత్తాలతరపతాకోజ్జృంభణంబుల, జలజాప్తహరులమే నులుకఁజేయ
రత్నగవాక్షనిర్యత్ననిర్యన్నవా, గరుధూపము(లును) నుత్కరముఁ బెనుప
నిర్దయాస్ఫాలితోన్నిద్రభేరీభూరి, భాంకారము మిన్ను బధిరితముగ
సేవాసమాగతసిద్ధసీమంతినీ, తనుగోచి మెఱుఁగులు తళుకులొదవ

గీ. సకలశాస్త్రక్రమంబులు చర్చసేయు, నాగమజ్ఞులకలకలం బనువు మిగుల
యోగవిద్యావిలాసప్రయోగపరతఁ, దగుపరివ్రాట్టు లుచితవర్తనలు సూప. 5

శా. ఆకుంబచ్చల ముచ్చిలిఁచుమణికుడ్యస్ఫూర్తి దూర్వాదళ
శ్రీకిం జాలి కురంగశాబకమనఃప్రీతిం బ్రసాదింపఁగాఁ
బ్రాకట్యోచితసంచరత్కరిముఖప్రత్యగ్రదానాంబుధా
రాకల్లోలితగంధముల్ దశదిశావ్రాతంబు వాసింపఁగాన్. 6

మ. అతఁ డబ్జాత్ముఁ డతండు దా మఱి సురాధ్యక్షుం డతం డంతకుం
డతఁ డంభోనిధిభర్త యాతఁ డతఁ డాయక్షేశ్వరుం డంబికా
శ్రితవామాంగ! మహేశ! విశ్వపతి! వీరిం జూడు మీ విప్రుడిం
దతిచిత్రేశ ప్రసాద టంచు పనివెంటన్ నంది భాషింపఁగాన్. 7

ఉ. ఎక్కడఁ జూచినం బ్రమథు లెక్కడఁ జూచిన యోగిమండలం
బెక్కడఁ జూచినన్ ఖచరు లెక్కడఁ జూచిన సిద్ధయూవతం
బెక్కడఁ జూచినన్ సుకృతు లెక్కడఁ జూచిన మూర్తితోడఁ బెం
పెక్కినవేదము ల్గలిగి యొల్లసమృద్ధులఁ దేజరిల్లుచున్. 8

క. దీపించు విశ్వపతిగుడి, భూపాలుఁడు చేరి చొచ్చి పొలఁతియుఁ దానుం
జూపులు విలసిల్లఁగఁ దద్గోపతిగమునకు మ్రొక్కి గురుతరభక్తిన్. 9

వ. లేచి పులకితతనుఫలకుండై యళికతలంబున నంజలిపుటంబు ఘటియించి యిట్లనియె. 10

గీ. జయ మహాకాళ! విశ్వేశ! జయ మఘారి!
జయ మురాంతకసాయక! జయ మహేశ!
జయ విరూపాక్ష! ధూర్జటీ! జయ గణేశ!
జయ చతుర్వ్యూహ! జయ చంద్రశకలజూట!. 11

క. అలికాక్షుఁ బార్వతీధవుఁ, గలికాలవికారదూరు గణవరు మల్లీ
కలికావర్ణు ధనేశ్వరు,చెలికానిని నిన్నుఁగొల్తు శివ! ఫణివలయా! 12

గీ, నీకు మ్రొక్కు లొనర్చెద నీలకంఠ! కంఠభాగకరీశ్వరదుంఠిజనక!
జనకముఖయోగిజనగేయ! సరళభావ! భావజాంతక! హర! యీశ! పంచవదన!

సీ. కామాహితుఁడ వయ్యుఁ గరుణతో నెట్లు భక్తులపాలిటికిఁ గామధుండ వైతి
ఉగ్రలక్షణరేఖ నొందఁజాలియు సర్వమంగళాన్వితమూర్తి మనితి వెట్లు
భవరోగవైద్యవిభ్రమముఁ దాల్చియు నెట్లు,మాననితలయేఱుఁ బూనినాఁడ
వరసిచూడఁగ దిగంబరుఁడ వయ్యును నిరంతరవిభూతిస్ఫూర్తిఁ దనరి తెట్లు

గీ, తొడరి యింతంత యనరానిపాడవు నయ్యుఁ
గుదురుకొంటివి యేరీతిఁ గొమ్మచంట
నిట్టి నీసొంపు వర్ణింప నెవ్వఁ డోపు?
హరిణలాంఛనజూట! పళ్యల్లలాట! 14

చ. అని శివుఁ బ్రస్తుతించి వసుధాధిపచంద్రుఁడు సద్గురూపది
ష్టనియమపద్ధతిం దవిలి చామయుఁ దా నుచితస్థలంబు గై
కొని బుధపూజనాదుల నకల్పితభక్తి నొనర్చి చేసె నం
దనఫలసిద్ధికై తపము తత్పరతన్ జగదద్భుతస్థితిన్. 15

మ. బహిరుద్భాసితశంభుమూర్తిని మనఃపద్మస్థితుం జేసి భూ
మహిళాభర్త జితేంద్రియత్వమును సౌమ్యస్ఫూర్తియుం బూని లో
నహితవ్రాతము దర్పముల్ సడలఁ జేయన్ జాగి చేయుం దపం
బు హరిత్పాలురు మానులుం జనులు నుద్భూతాద్భుతుల్గా మదిన్. 16

గీ. కొన్నినాళ్లు హవిష్యంబు గుడుచుఁ గొన్ని
నాళ్లు ఫలములు దినఁ గొన్నినాళ్లు తాత్రివ
నారములు గాన్పు లొకకొన్నినాళ్లు గోరిలు
నొల్లఁ డెవ్వియు మఱి యంతనుండి నృపుఁడు. 17

క. పతి యేక్రియ వర్తించును, సతియును వర్తించు నట్ల సన్మార్గమునన్
బతియట్ల మెలఁగవలదా, పతిదేవత లైనపుణ్యభామల కెల్లన్. 18

సీ. నిర్మల మగు నింట నిర్గమించిననీరు, ధరణిపరాగంబుఁ బరిహరించుఁ
బరిమళంబును మందభావంబు గలిగిన, గంధవాహము శైత్యగతుల వీచుఁ
బుష్పాపచయవేళఁ బొడవులయ్యును గరాం, బురుహంబునకు వంగుఁ దరులు వేగ
నన్యోన్యవైరంబు లడఁచి సత్త్వంబులు, వాత్సల్య మమరఁ బాగ్యములఁ దిరుగు
గీ. నార్తనం బగు గుణమెల్ల నపనయించి, మేని కింపైనగతిఁ బర్వ భానురశ్మి
యతిమునీశ్వరుఁడగు నృపాలాగ్రగణ్యుఁ, డతులనిష్ఠఁ దపోలక్ష్మి నందుకొనుడు.

ఉ. వాడదు మేను నిట్టు లుపవాసములుండిన దైర్ఘ్య మింతయున్
వీడదు సారెకున్ బొడముఁ విఘ్నములం గని యింద్రియంబులన్
గూడదు నెమ్మనంబు సమకూరినవిష్ఠఁ గురంగపాణిపై
నూడనిభక్తి గల్గి తప మొప్పఁగఁ జేయునృపాలమౌళికిన్. 20

క. పరిమితదినములలోపలఁ, జిరకాలతపఃఫలంబు క్షితిపతి గాంచెన్
హరకరుణాసంపన్నులఁ, గరుదారఁగ నందరానియట్టిది గలదే? 21

సీ. మండువేసవివాఁడు మార్తాండుఁ గనుఁగొంచు, నుండునగ్నులచుట్టు మెండుకొనఁగ
జలువానకాలంబు చలన మింతయు లేక, పద్మాసనస్థుఁడై బయట నిలుచు
దుస్తరంబైన శీతుగందవకు గంఠ, దఘ్ననీరంబులఁ దవిలి యకలు(?)
హారుఁడు శిఖరిమునఁ బ్రీత్యతంబు గామిని, శంకింపఁ డాత్మ నిస్తంద్రుఁ డగుట
గీ. పూర్వభోగంబుఁ దలపోసి పొరయఁ డింత, చాపలము మాని వరదృష్టసరణియంద
వదుచుఁ దక్కిన తుచ్ఛంపువడక యుండఁ, డీశ్వరాసక్తుఁడగు ప్రమథేశ్వరుండు.

క. శివరక్షకలిమి ధరణీ, ధవుఁ డుగ్రతపంబు సేయఁ దత్తేజముచే
రవిదీప్తి గుంటువడియెన్, బవనంబులవీఁక సడలెఁ బ్రభ చెడె నగ్నుల్. 28

ఉ. చెంగవిభక్తిచేఁ గొడుకనీఁ దుక ఘోరతపంబు సల్పురా
జుం గరుణింపఁగాఁ దలఁచె సోముఁడు విశ్వవిభుండు కాశికా
రంగమహానటుండు గుణరాజికిఁ బట్టిదకాద చూడఁగా
జంగమకల్పభూజము భుజంగమహారుఁడు గొల్చువారికిన్. 24

సీ. చిఱుతవెన్నెలగాయు చిన్నిచుక్కలరాజు, తలవాఁకకును నావసొలుపు నిలువ
మెడకప్పుమించు గ్రిమ్మిన చేతిపై జింక, మార్వ్యాదళీభ్రాంతిఁ దొంగలింపఁ
బొడవైన తెలిమేనిపూఁతదావలఁ దావు, దరలి ఫాలాక్షుంబు దమకపడఁగఁ
గటిసీమ దిండుగా గట్టినచేలకుఁ, గాక యెక్కినగిబ్బ కడఁకఁ ద్రొక్కఁ
గీ. బాఁపసొమ్ములు నలుమోము పాలుకాడ
మూఁడుమోముల పెనుపోటుముట్టుఁ దాల్చి
పూనికయుఁ గన్గి కనుపట్టె భూతభర్త
పరమకారుణ్యఘన మహీపాలుమ్రోల. 25

క. సురగరుడయక్షవిద్యా,ధరకిన్నరవరులు బలసి తహతహతోడన్
హరుఁ గొలిచివచ్చి రంభో,ధరరవములఁ దెగడుమతివిధాధ్వను లమరన్. 26

ఉ. లోపలఁ దోఁచుచున్నయతిలోకుఁడు విశ్వవిభుండు ముందటన్
రూపముఁ దాల్చి నిల్చిన సరోరుహవైరికులాబ్ధిచంద్రుఁ డ
బ్బూపతి దండమూపమున భోరున ద్రొక్కి సముద్ధితాంగుఁడై
యాపురుషత్రయాత్మ మదనాంతకుఁ బ్రస్తుతిసేయు నీక్రియన్. 27

దండకము. శ్రీమన్మహాదేవ! దేవస్రవంతీపయోజాతసుస్నిగ్ధదుగ్ధాభిచంచజ్జటా
బృంద! బృందారకేంద్రాదిసాంద్రోరుకోటీరకోటీతటీరత్ననిర్యత్ననిర్యన్మరీచిచ్ఛ
టాటోపకిమ్మీరితాంఘ్రిద్వయా! అద్వయుండైన నీయొప్పు హృత్పద్మవీథిన్ విత
ర్కించి దుస్తర్కబంధంబులం ద్రుంచి ప్రజ్ఞాసముల్లాసము ల్గ్రాల విజ్ఞానసిద్ధిం
బ్రసిద్ధాత్ములై యుండఁగా లేక యేకాలమున్ జీకులై త్రివ్వచున్ దుర్వ్యవే
కులై ఖిలాచారసంచారులై చేగలేరెన్నఁడున్ నిన్ను నున్నద్రిఁ బ్రాపరూ
పాతిగా! నాగకేయూర! మాయూరపింఛచ్ఛవిస్ఫూర్తిపాటచ్చరోచ్ఛాయనానా
దిగంతౌఘదంభోలిరంధ్రీధూమంబులన్ గీలికీలాకరాళోజ్జ్వలల్లోలపారాల
ఘుజ్వాలలం బేర్చి కోలాహలోదగ్రమై క్రాలుహాలాహలంబున్ జగద్భీతితోఁ
గూడఁ గొంకూని వేక్రీడయుం బోలెఁ గేలన్వడిం బట్టి బిట్టార్తి చిత్తంబు మ
త్తిల్ల నుత్తుంగవాగ్గంబునన్ గ్రమ్మి భక్షించి లోకంబు రక్షించి యక్షీణతేజం
బునం బొల్చు సద్రక్షకున్ నిన్ను నెన్నన్ దరంబా ధరంబాపరేణాంత యక్ష్యం

తద్ధీశాలికిన్ శూలపాణీ! గణాధ్యక్షు! దక్షుండు మాత్సర్యదీక్షాత్ముఁడై క్రొవ్వి
వీక్షావళీపాత్రైకమాత్రవధూకాంతకు న్నిన్నుఁ గన్నాని దప్పింప కుప్పాంగి
దర్పించి క్రించుందనం బొందుచున్ మందభాగ్యోదయత్వంబునన్ బన్ని జన్నం
బు సేయంగ నంగీకృతోద్యోగియై యున్న మిన్నంది కందర్ప దుర్వారదోర్గర్వ
సర్వస్వసంహారవిద్యాసముద్యుక్త నేత్రంబుతోఁ జిత్రచిత్రోన్నతిం బొల్చి పె
ల్చున్ జగత్కంపవిశ్రేణియై తూలునుద్యజ్జటాశ్రేణితో నేణభృత్ఖండమల్లీప్ర
సూనోల్లలద్దండభాగంబుతో భోగిపట్టాంచలోదంచదుద్దండమాణిక్యరేఖామ
యూఖావళీకీర్ణనిర్నిద్రచక్షుఃశ్రవోహారపుంజంబుతోఁ గంజగర్భాండగర్భప్రభేద
క్రియాభీమభూమాదశక్షామజోద్గామశుండాభచండోజ్జ్వలన్మండలాగ్రాదిదీప్తా
యుధస్తోమసమ్మోహితారాతిదృగ్వ్యూహబాహాసహస్రంబుతో దుస్సహంబై
మహోత్సాహమై సాహసాధిష్ఠితంబైన శ్రీవీరభద్రాకృతిం దాల్చి సన్మానముం
గన్నని న్నింతవాఁడైన నింతంతనంజాలు నే కాలకంఠా! మృకండీరవోద్రేకవిద్రా
వణామర్త్యవిద్విట్ఛిరఃపద్మపూజావిరాజత్పదాంభోజ! యంభోజసంభూతమూ
ర్ధంబు భిక్షాటనప్రక్రియాపాత్రగా గోత్రభృత్పుత్రకంకాళముం దాళమై
యొప్ప చేయుట్టుగా దిట్ట యాశీవిషాధీశుఁ డంఘ్రిస్థలిన్ గండపెండేరరాజంబు
గాఁ దేజముల్ గ్రమ్మ శార్దూలపుందోలు పైఁ జాలఁగాఁ గ్రాల ఫాలాగ్నివారం
బుతోఁ గంప గేవన్ మహాముఖ్యంబుగా విశ్వచక్షుర్భయాపాదియౌ నాశ్మ
శానంబు ధామంబుగాఁ జేసి యెవ్వారికిం దేరిచూడంగరానట్టిదట్టంపురూపంబుఁ
బ్రాపించియున్ ముక్తసంగుండై భక్తియుక్తాంగుఁడై క్రొల్చుధీశాలికిన్
సౌమ్యవిస్ఫూర్తివర్తింతు వార్త్రార్తహారీ! పురారీ! విరూపాక్ష! వక్షోజచక్రంబు
లన్ జారునేత్రాసితాబ్జంబులన్ వక్త్రపద్మంబునం గుంతలోత్తాలశైవాలజా
లంబునన్ బాహువల్లీమృణాళంబులన్ బంధురోష్ఠచ్ఛబంధూకపుష్పచ్ఛ
టన్ మందహాసామృతస్యందడిండీరసారంబునన్ నిమ్ననాభీశుభావర్తగర్తంబు
నన్ గోమలోచ్చైర్వళిచ్ఛేదవీచీసముల్లాససౌభాగ్యయోగంబునన్ నిత్యలక్ష్మీని
వాసోన్నతం బన్ఫురత్సైకతాభ్యున్నతిం బాదకూర్మస్థితిన్ బేర్మి మత్తిల్లు నీ
హార శైలాత్మజాకాసరోజాకరంబున్ మహాకేళిహంసంబవై లో రితం
సాగతుల్ గ్రాలఁ గ్రీడించుపోఁడిం బ్రసూనేషుకోట్యర్బుదామందసౌంద
ర్యధుర్యత్వన్నిసుం గొల్చుపుణ్యుల్ విపశ్చిద్వరేణ్యుల్ గదా చూడఁ జాడాం
శలస్యూతనీహారధామా! సుధాధామ! రామాకుచాభ్యంతరంబెట్లు నీ కున్కిపట్టై
యొప్పానె నీకుఁగట్ట న్మదేభేంద్రచర్మంబె? శర్మప్రదా! నిర్మలాత్మా! భవా

నీమహాత్త్వంబు నిర్ణీతముం జేయ గీర్వాణధురుడుం జాలునే? నేత్రనిర్జితతల్పాను
గా! భక్తకల్పా! సుధావిస్ఫూర్జజ్జల్పా! ఆద్యం బచింత్యం బనింద్యం బభేద్యం
బసాధ్యం బబాధ్యం బనూనం బహీనం బనంతంబునై యొప్పు మత్పుణ్యపాకం
బునం జేసి యాలోకసాధ్యంబుగాఁ దోఁచె వాచంయమిధ్యేయమూర్తీ!
కృపాధారకీర్తీ! నమస్తే నమస్తే నమస్తే. 28

చ. అని తనుఁ బ్రస్తుతించుమనుజాధిపు మెచ్చి యుమాకళత్రుఁ డి
ట్లనియె ధరాధినాథ వినుమా యనుమానము మాని నీవు కో
రినవర మెద్దియైన వివరించి రయంబున నిత్తు సత్తుగా
నను నలరించుభక్తులు గనం దగరే తమచింతితార్థముల్. 29

మ. అనినం బ్రాంజలియై నృపాలుఁడు దయాయత్తున్ మహాదేవుఁ బ
ల్కె నుమానాథ! గిరీశ! చంద్రధర! నాకున్ సద్వరం బిచ్చితే
ని విరాఘాటశరప్రతాపుని హిమానీశుభ్రకీర్తిప్రియుం
జనతారక్షణదక్షు నిమ్ము తనయున్ సత్యాకరున్ శ్రీకరున్. 30

క. అనియనుడు శివుఁడు నీమనమునఁ గలకోరిక ఫలించు భూవర! కో నీ
వనితకు నిమ్మని కల్పక,జనితంబగుఫల మొకండు జనపతి కొసఁగెన్. 31

చ. ఒసఁగినఁ దత్ఫలంబు మనుజోత్తముఁ డాదరమొప్ప నంది వె
క్కసముగభక్తి మ్రొక్కెఁ గడకం దనకున్ సతితోడ నంత న
య్యసమవిలోచనుండును సురాసురయక్షసమన్వితంబుగా
విసవిస నక్షిపద్ధతికి విందగుచందము మాసె నయ్యెడన్. 32

మ హరదత్తంబగు కల్పవృక్షఫల మార్యస్తుత్య! విశ్వంభరే
శ్వరుకాంతామణి ప్రాణవల్లభునిజాజ్ఞాసంగతిన్ నేమ మొ
ప్ప రుచిన్ లోఁగొనియెన్ సదాశివు మనఃపద్మంబునం జేర్చి శ్రీ
కరమై యొప్పుదినంబునన్ దనయకాంక్షాయుక్తి మత్తిల్లుచున్. 33

వ. ఇట్లు సఫలమనోరథుండై యమ్మహారథుఁడు నిజనగరోన్ముఖుండై
యొక్కనాఁడు. 34

సీ. భక్తవత్సల! విశ్వభర్త! శంకర! నాదు,కోర్కి యీడేర్పుమీ కొంకులేక
అన్నపూర్ణాదేవి! యంబ! సైకతనితంబిని! నన్ను రక్షించుమీ ప్రియమున
డుంఠివిఘ్నేశ! యుత్కటసుముఖవృత్తి, నొందుమీ ననుఁ బ్రోచునోరిమ గలిగి
యఖిలలోకనమస్య! యాకాశగంగ! నిర్మలమూర్తి! యొసఁగుమీ మహిమ నాకు

గీ, రమ్యమతులార! యోపరివార్తితులార!, యొరిమసంకల్పసిద్ధి చేయుండు మిమ్ముఁ
గొలిచి యున్నాఁ డీ చల్లఁగా నిలిచినాఁడ, నరుగుచున్నాఁడ మీయాజ్ఞ నాత్మపురికి.
గీ. అనుచు నాబాలగోపాల మవనిభర్త, యరుగుకాశికలో నున్న యుందటికిని
బెద్దపిన్నతగంబునఁ జేరుగుర్తిచ్చి, చెప్పి గమనించెఁ దా నేలుసీమఁగుతిచి. 36
సీ. నలినాక్షితోఁ గాంచనస్యందనం బెక్కి, పెంపెక్కి భూజంభభేదనుండు
వారణరథహయవరభటాత్మక మైన,బలము పార్శ్వంబుల బలసి కొలువఁ
గౌండిన్యమునిలోకమండలాధిపునకుఁ, దనదువృత్తాంతంబుఁ దగినయట్లు
తేటతెల్లఁగఁ జెప్పి దీవించి యమ్మహా,మహుఁడు పొమ్మన సంభ్రమమునఁ గదలి
గీ, చని మనోహరరత్నకాంచనవినిర్మి,బహుపతాకాభిరామంబుఁ బటువినోద
పూరితము నైన తనపురంబునకు వచ్చి, మరల వహియించె గహ్వారి గురుభుజమున.
ఉ సాగరసప్తకీవృతరసాసరసీరుహలోచనం గృపా
సాగరుఁ డానుధాంశుకులచంద్రుఁడు క్రిమ్మఱ నేలుచుండె నా
శాగజదంతకాంతముల సారెసు నాత్మవిశుద్ధకీర్తి నా
నాగతులన్ విలాసవశనాట్యము చూపుచునుండ సంతటన్. 38
క. గిరిజావల్లభకరుణా,పరిణామసమగ్ర యగుచుఁ బతిదేవత భూ
వరురాణి గర్భవైభవ,పరిశీలిత యయ్యె సకలబంధులు నలరన్. 39
మ. పలుకంబారెఁ గపోలపాళికలు పైపైఁ దోఁచె జాడ్యంబు చ
న్నులఁ జొంకంబు ఘటిల్లె సోగలగుకన్నుల్ వెల్ల గాఁ జొచ్చె ను
గ్గులు విచ్చెన్ వళిభంగముల్ సరులపైఁ గోర్కుల్ తమింబాసె వ
గ్గలమై చిట్టము లుట్టఁగాఁ దొడఁగె రాకాచంద్రబింబాస్యకున్. 40
మ. కలగాంచుం దమనత్రిశూలధరుఁడై కన్పట్టుబాలుండు పొ
త్తుల నున్నాఁడని యూలకించు బయలం దోతెంచు గంధర్వగీ
తులు కైలాసపసుంధరాస్థలమునందున్ గొల్వ గూర్చుండఁగాఁ
దలఁచుం బాలిక చంద్రశేఖరకళాదర్పస్ఫురద్గర్భయై. 41
మ. సరి సంభోనిధివేష్టితాఖిలధరాచక్రాభిరక్షావిధా
చరణుం బుత్త్రికుఁ గానఁగాఁగలసరోజాతాస్యకుం దోఁచు ని
ర్భరతన్ జిత్తమునందు శత్రువనితాఫాలస్థలీకుంకుమో
త్కరముద్రాహరణప్రవీణఖరఖడ్గప్రాప్తిపైఁ గోరికల్. 42
చ. కులుచనిసొమ్ములున్ వెలుకఁబారుముఖాబ్జముఁ గ్రమ్మనూర్పులున్
దొలఁకుల నిండుకుక్షియును దుప్పెనబోదలతో డితమ్మిమొ

గ్గల నగునీలమాచుకయుగంబునఁ బోల్చుపయోధరంబు ల
త్యలసకటాక్షము ల్గలిగి యంగన చూ పలరించు భర్తకున్. 43

సీ. అమృతాంశుకలవనాయతవసంతాగమం, బరిపీరజయుగర్వహారణముదరి
నిఖిలబంధుసరోజనీరజాప్తమరీచి, శాంభవతేజఃప్రచారవీధి
అహిరాజభారనిగ్రహముక్తికారణం, బాశాధిపతినిజాశాప్రతంబు
ప్రియానఖీవీక్షణోచ్చ్రయసంపల్లక్ష్మి, కల్పకేప్సితలతాపల్లవంబు

గీ. వనఁగఁ బాపట్టి పొదలె నొయ్యన దినంబు
దినమునకు వృద్ధిఁ బొందుచు గొనబు మిగిలి
సాధుసంస్కారసంక్షిప్తసంస్కృతంబు
వనితగర్భంబు సౌభాగ్యవర్ధకంబు. 44

ఉ. ఐదు శుభగ్రహంబు లరుశాంశుని గూడుక యుచ్చగంబులై
పొ్రిది వహింప సొంపుగలపుణ్యదినంబున రాజురాణి శా
తోదరి గాంచెఁ బుత్త్రి నతులోగ్రనదీధితిమిత్రు విశ్వర
తూదితిహారిమూర్తి ప్రభిశక్తిసమాశ్రితభానుకైవడిన్. 45

వ. అంత. 46

సీ. వినుతపావనజలంబున మజ్జనము చేసి, కమనీయశుద్ధవస్త్రములు గట్టి
మౌహూర్తికులచేత మార్తాండముఖశుభగ్రహములయనవద్యగతులు దెలిసి
తరతమభావంబుఁ బరికించి పుడమివేల్పులకు సువర్ణంబు ధార వెట్టి
పంజరంబుల నున్నపక్షుల బందీలహస్తుల విడిపించి యర్థార్థులకు

గీ. వినుతదానంబు లొనరించి యమలగుణజెలుల, యట్ల నట్టింటఁ బగవారి నాదరించి
నగరదైవతముల నర్చనాసమృద్ధిఁ, దనిపె సుతజన్మదినమున ధరణివిభుఁడు. 47

ఉ. సంచితపుణ్యశాలి నృపచంద్రకళాధిరణుండు దా విశే
షించియు శేషహారునకుఁ జిత్రమణీకృతతోరణంబులున్
గాంచనదీపపాళికలు గ్రామములున్ బహువస్త్రపేటికల్
చంచలనేత్రలున్ దనయుజన్మదినంబున నిచ్చె వేడుకన్ 48

సీ. ఘుమఘుమురుమ నంకురితమహామాతశమణి వహించువిదూరమహివిశముసఁ
జెలుతపారియము తోడి శీతాంశుపునిసొంపుదలుకొత్తునపరది క్కటి తెఱఁగునఁ
గొదమరాయంచ నమ్మదమున విహరింప, చెలువంబుఁ దలమోచుకొలనికరణి
కనకమై తళుకొత్తునవతుట్నలంబుచే, వఱలుమోహనకల్పవల్లివగిది

గీ. భానుఁ డోంకారమును గూడి ప్రజ్వరిల్లు, విపులపంచాక్షరీమంత్రవిద్యరీతి
భర్గకళ పూని దీపించుబాలుఁ బొడిపి, కూర్మిఁ దనరారె నృపురాణి కువలయాక్షి.

చ. జగతి పరిష్టుల్ దలఁగఁ జాలి భుజాభుజగాధినాథుపై
నెగుడుపఁ గల్గుపుణ్యగుణనిర్మలమూర్తి వరిష్ఠ మింతయున్
దగులునె పాయుఁగా కనువినంబున వీడె వస్తసంగముం
బగణితభాగ్యలక్ష్మివిహారికి భూపతిముద్దుపట్టికిన్. 50

మ. పురుడుం బుణ్యముఁ దీర్చి శంకరపదాంభోజాతభృంగంబు భూ
వరచూడామణి వల్లకీపతి నభోవాణీవశస్వాంతుఁడై
సురధాత్రీసురులం భజించి పిదపన్ సూనున్ బ్రభాభాను వే
దరవం బొప్పఁగ ముంజభోజుఁ డని యంతం బెట్టెఁ బే రున్నతిన్. 51

శా. గీర్వాణాహతమర్దలధ్వనులు గల్గెన్ సర్వదిగ్వీధి గం
ధర్వీగానము తానమానములతోఁ దాఁ స్థితిం దోఁచె స
ప్తార్వాస్యోత్రము నిర్మలంబగుచుఁ గాయం జొచ్చెఁ బాథోధియం
తర్వైశ్వానరతాపమున్ వదలెఁ దన్నామోక్తికాలంబునన్. 52

సీ. ఆపాదమస్తకం బంగసంధులవెంట, దుసికిల నూనియు దోఁగ నంటి
ప్రత్యగ్రబింబికాపత్రిచుంబితముగాఁ, బలుచగా నెమ్మెన నలుగువెట్టి
గాజుఁగొప్పెరలలోఁ గమ్మనీరున నూరు, తలములపైఁ జేర్చి జలకమార్చి
శివరక్ష యంచు మచ్చిక జలంబులు గొన్ని, చుసకమాత్ర మొగంబుమట్టుఁ ద్రిప్పి

గీ. యొయ్యనొయ్యనఁ దడియొత్తి యుగ్గుచూపి
తిరుగఁ దలయంటి చనుబాలఁ దావిఁగొలిపి
నేత్రముల నంజనము నించి నిద్రవోవఁ,
బాడుఁ జొతుల సవరించి బాలు ధాత్రి. 53

శా. నీలస్తంభవిజృంభితోజ్జ్వలహిమానీశుభ్రసౌధంబులో
నాళోలంబగుతొట్టిమంచమున నొయ్యం జేర్చి జోకొట్టి యు
య్యాలో జొంపల యంచు నూఁపుదురు శుద్ధాంతాబ్జపత్రాక్షు లా
బాలుం బాలశశాంకశేఖరకృపాసారైణు గారామునన్. 54

చ. తగఁ విభుండు గల్గె నని ధారుణి హర్షముఁ బొందెఁ గల్పపూ
మొగడలవిందువంగడము మంచరికిన్ మొనసాఁగె పేనికిన్
బెగడుపిశాచఘాతమునఁ జేర్చుట మానెఁ గృపావిలాసవ
ల్లిగమహాస్త్రశాపగుణనిశ్చితుఁడై నృపసూతి యొప్పఁటన్. 55

ఉ. ఉగ్గననిట్లువల్కు విమలోష్ఠపుటంబులు విచ్చి పారెకుం
బుగ్గనవ్వు రెప్పకప పొందఁగఁజేయక చూచు దిక్కులన్
దగ్గతి జోలపాడెడుపడంతులపాటలు నాలకించు స
మ్యగ్గుణశాలి యైనమనుజాగ్రణిపుత్త్రుఁడు బాల్యసంపదన్. 56

మ. జడలై తూలెడుపుట్టువెండ్రుకలు రక్షామాలికాబంధముల్
మెడ శార్దూలనఖంబు ముద్రికలచే మేకొన్నహస్తాంగుళుల్
కడుఁ జూపట్టినమద్దికాయలును గల్గల్లుమఁ బాదంబులన్
నడుమం బల్కెడుగజ్జెలుం గలిగి కన్పట్టున్ గుమారుం డిలన్. 57

సీ. అలికపట్టికమీఁద నతులముక్తాఫల,శ్రీకరంబగు రావిరేక మెఱయఁ
బాలబుగ్గలకాంతి మేలంబులాడుచు, మద్దికాయలతళ్కు ముద్దుగురియ
మణిబంధములయందు మట్టసంబగుచేతఁ,గనుపట్టుహస్తకంకణము లమర
సిగ్గెఱుఁగని కటిసీమ నద్దిగలు గ్రుచ్చినగట్టి యగు కాంచి జిగిదొలంక

గీ. తొక్కుఁబల్కుల నమృతంబు పిక్కటిల్ల,మురిపమంతయు లావణ్యగరిమ గాఁగ
నద్దులకు మస్తగోత్రంగ నల్లనడుమఁ, బడుచునవకంబు మీటినపాయమునను.

సీ. ఇంతవైభవ మెట్టి హిమశైలనందనా,ప్రమథనాథులు గన్నకొమరుసామి
కిమ్మహాసౌభాగ్య మెద్ది పులోమజా,హరిహయు లన్నజయంతమూర్తి
కీపాటిసిరి యెద్ది యిందిరామధుకైట,భారులు గన్నపుష్పాయుధునకు
నీలాగుగారవం బెద్ది కౌసల్యాదశరథేశ్వరులు గన్నఖరవిరోధి

గీ. కిట్టిగోమున నుక్కుపట్టెట్లు దేవ
కియును వసుదేవుఁడును గన్న కేళిమనుజ
విగ్రహుండగు త్రైలోక్యవిభున కవఁగఁ
బెరుఁగుఁ బుత్త్రిండు జనమనఃప్రియ మెలర్ప. 59

గీ. అరఁటిపండన నదుగెత్తు ననఘమూర్తి, చెఱకుఁగోలకుఁ జేసాఁచుఁ జిన్నితండ్రి
యనుచు శుద్ధాంతకామినీజనులు చెలఁగి,నడపు దిద్దంగ నడుచు భూనాథసుతుఁడు.

గీ. నడుమధర్మంబు పుడమిపై నడుపవేని,తొలుకుఁబలుకువిరోధులబలము లొలుకఁ
బ్రోది సేసికకొమ్మత్తన బాదిబొమ్ము,నశవివర్ధిల్లెఁ బ్రమథేశ్వరునిసుతుండు. 61

గీ. జలధరమునకు సురధనుర్విలసనంబు, కుంభిరాజంబునకు మనోజ్ఞృంభణంబు
చంద్రునకు శారదారంభసౌష్ఠవంబుఁ, బోలె జవ్వన మారాజపుత్త్రిఁ బొదివె.

సీ. మాంసలాంసద్వయీమహిమ మక్కుటిసం,దెనమూఁపురమునకు ననుఁ గనంగ

దిగిభశుండాదండదీర్ఘహస్తంబులు, భూమిజాయాస్తంభములొ యనంగ
శాస్త్రదృష్టికృతార్థచారులోచనములు, సిరికిఁ బద్మంపుఁటొవరులో యనఁగ
సాలమానమున నుత్తాలోష్ఠ్యలంబైన, రూపు పౌరుషగుణులప్రోవనంగ

గీ. క్షత్రధర్మంబు దాన సాక్షాత్కరించి, యుజ్జ్వలాకారసంపద నొందె ననఁగ
సర్వజనతావిలోచనపర్వ మయ్యె, రాకుమారుండు యౌవనారంభవేళ. 63

సీ. లబ్ధవర్ణశ్రీవిలంకారరేఖగాఁ, భాసిల్లు నాడినభాషణంబు
హరిణలాంఛనజూటచరణాంబుజములకు, రోలంబపాకమై వ్రాలు మనసు
హరిదంతకరిదంతపరిఘాతరములకు, బలువెండితోడవులైన పెలయుఁగీర్తి
దర్పితాహితరాజదావానలమునకు, ఘనవర్షధారయౌ ఖడ్గధార

గీ. వరిమురయాచకలోచనోత్పలములకును, విమలచంద్రాతపంబగు వితరణంబు
గంధుమీఱుచు నారాజగంధకరటి, భాగ్యసౌభాగ్యవైభవోద్భాసి యగుట. 64

చ. చదువక వేదశాస్త్రములు సమ్మద మొప్పఁగఁ జేసె సాధువం
గదియఁగ హెచ్చి వచ్చె నసికార్ముకచర్మముఖాస్త్రకౌశలం
బాదవె నొకప్పుడుఁ దడవకుండినఁ గానకళావిలాసము
గొదువ యొకింత లేక ఫణికుండలుపంపున రాజసూతికిన్. 65

సీ. వట్టిపల్కులనైన నీతశేఁకరకథా, సౌరభం బాండిన సమ్మతించు
నేచందమునైనఁ గాచి చక్కనడేయుఁ, శితికంఠుధర్మంబు కలిలపడినఁ
బనుబిడ్డనికినైనఁబట్టి తత్త్వముఁ దెల్పి, హరుఁడె దైవంబని తెరవు ద్రొక్క
శివభక్తుఁడు కోరి యీరాని నగిసిఁ, ద్రోయ కిచ్చును దృణప్రాయముగను

గీ. వారిధిఁ దోఁచు బుద్బుదప్రాయమట్లు, త్రిజగములు భర్గతేజోబ్ధిఁ దేల నెఱుఁగు?
గర్భశైవుండు కలిదోషగర్వహరణ, భూరిసత్కీర్తి శ్రీమంజభోజమూర్తి. 66

శా. మత్తారాతినృపాలకంధరలు దుంత్రింపం బుట్టి క్రొన్నెత్తురున్
హత్తన్ జిప్పిలుచెమ్మ గ్రమ్మ నసిధారాధ్వంబులే మెట్టి యా
ద్యత్తిన్ వచ్చుచు జిక్కువారక సమిద్వీథిం జయశ్రీతడా
యత్తత్వంబు వహించి చిత్రఘటనావ్యాపారపారీణ యై. 67

సీ. తడవిండ్లవగ మాని తడవిండ్లవగ పూని, మందోదయుండయ్యె మగధభర్త
కదమంచు నడవంగఁ బదమంచు లవియంగ, గునుకభ్యసించె మన్నాకరువిభుండు
అలము తెత్తుటతించి యలములొప్పఁగఁ బొంచి, వనవాటికటు నేఁగె వత్సరాజు
కలను సేయుచుఁ బంబు కలనులేక బలంబు, తొఱఁదప్పి దిటదప్పె నిషధనాథుఁ

గీ. దహనా! ఫాలాక్షకీలధారాగ్రకాంత, ముఖమహాఖడ్గవల్లరీసఖభుజాహి
సార్వభౌముండు ధైర్యసుపర్వకాద్రి, రాజకంఠీరవుఁడు ముంజభోజు కలిమి 68

శా. మెట్టం డెన్నఁడు నుగ్రధాటి రణకుంభిస్వగ్రభాగంబులన్
బట్టం డెన్నఁడుఁ గేలఁ జాపలతటిత్ప్రక్రూరబాణంబుతో
ముట్టం డెన్నఁడు మండలాగ్రము జయాంభోరాశి భూభర్త దా
వెట్టం గొట్టము చేయుచుండుదుట నిర్వీర్యాత్ములై శాత్రవుల్. 69

గీ. స్ఫటికశిలయందుఁ గలయంగఁ బ్రతిఫలించు
దాసనప్పుఁబూవుకెంజాయతళుకువోలెఁ
దండ్రిగుణసాగవిస్ఫూర్తి తనయునందు
నాఁడునాఁటికిఁ బర్వికొనంగ వచ్చు. 70

చ. భసితముఁ బాముపేరుములుఁ బచ్చికరీశ్వరవృత్తి వేఁడిబ
ల్విసముఁ గళోటిపాత్రికయు వృద్ధశరంబగు నుక్షరాజమున్
నొసలివిలోచనంబు విడనూకి శుభోజ్జ్వలలక్షణంబులన్
బస నటియించుశంకరునిభాతి మనోహరమూర్తి పొల్పగున్. 71

సీ. పరమపావనమనఃపంకేరుహమునకు, హాగాధ పరిమళవ్యాప్తి గాఁగఁ
గమనీయసత్కీర్తికల్పవల్లికి సన్న, విభుఁడు పెన్నూఁకటి పేరుగాఁగ
మానితనిజభుజామందారశాఖకు, దానోదకము పూవుఁజేనె గాఁగఁ
బ్రబలితనానామూల్యగుణరత్నముల కీశ, భక్తసంగములునిక్కపట్లుగాఁగ
గీ. మండలాగ్రనలమునకు మత్తవైరి, గేహినీబాష్పధారలాజ్యాహుతులుగ
వసుమతీశ్వరకోటీరవజ్రకళిక, రాజనందనుఁ డొప్పు హేరాళముగను. 72

శా. ఆరాజన్యకులావతంసము భుజాయత్తాసికాలాహిచేఁ
గ్రూరారాతులప్రాణవాయుభరముల్ గ్రోలించుచో నెక్కుత
న్నారీలోచనపద్మపత్త్రములలోనం బల్విషం బిట్టిచి
తారంభం బతడందెకాశ మతి రయంబైనం గనం బోలునే. 73

గీ. జలజవదనలు మీనలోచనలు చక్ర, వాకవక్షోరుహలు నైనవసుమతీశ
కన్యకాసింధురలు పేరిమి గడలుకొనఁగఁ, జెట్టవట్టిరి లక్షణశ్రేష్ఠు నతని 74

చ. వినయమునన్ వివేకమున విక్రమసంపద సాధులక్షణం
బునఁ గొదయింతలేక ఫణిభూషణు సత్కృప గల్గి విశ్వభూ

జనస్తుతిపాత్రుఁ డింపలర సాగరకాంచికి నాథుఁ జేసెఁ ద
జ్జనకుఁడు శైలదంతికిటిసర్పవిభుల్ ప్రమదంబు నొందఁగాన్. 75

క. పాలింపుమనఁ గొంచెపుయినన్, న్యాయము భుజశక్తి నరవరార్యుఁడు మిగులన్
గాయు దవానలకీలా, పాలితపరిబలప్రతాపబహుళాతపముల్. 76

గీ. ముదియుఁ వటభూజమందున మూలబలము
పదిలముగ నూడ లాగ్యవ గది యురీతి
జరఠనృపుఁ బాసి తత్పుత్త్రుఁ డరుణుఁ బొడవ
మూకపాలిపయి యుండంగ మెట్టి కొలువ. 77

క. తల్లిగల బిడ్డకైవడి, బల్లిదుఁడగు నతనిబాహుబలమున ధరలో
నెల్లజనులు మోదించిరి, చల్లనగు రామరాజ్యసౌఖ్యముఁ గనుచున్. 78

క. నరవరుఁ డేల "శతాయుః, పురుష" యనెడు వేదవాక్యమునఁ బ్రజ బ్రదుకున్
ధరఁ గొఁద్రవేయఁ బండున్, దొరఁగున్ వర్షంబు సావితో నెయ్యేడలన్. 79

క. హృత్పృథమేచక యామ్యాను, దత్పగ్ధపుణ్యయాస్తి ధవళయశ్రీ
నుత్పాదించున్ బరిధిశిరి,పూర్ణలగంధిస్మితంబు నగిరి నమ్రకియన్. 80

క. హరుఁడు జగంబుల నుండఁగ, హరునందు జగంబు లుండ నాత్మ నెఱిఁగి భా
నురవిజ్ఞానాంబుధి భూ,పురందరుఁడొ కానఁగ ముంజభోజుఁడు వెలయున్. 81

క. మతినూగుణశాలి యగుతన, సుతునంబు ధరిత్రి నిలిసి సొబగొందుట హృ
ద్గతిఁ గనుఁగొని పరిమఖేశ్వరుఁ, డతివయుఁ దాఁ గాశికకును నరిగెదు నెడలన్.

క. భవసంభవసౌఖ్యంబుల, చవు లొల్లక కుబుస మూడ్చు సర్పము పోలెన్
దవు లూడిచి పరిమఖేశుఁడు, సవినయనుతుఁ బల్కె స్వచ్ఛందముతోడన్. 83

చ. చదివితి నాల్గువేదములు శాస్త్రము లాఱుఁ దదన్యవిద్యలున్
సదభిమతోక్తదక్షిణల జన్నములన్నియు నాచరించితిన్
దుది నిను గూర్చి బంధుజనతో యజమాన్యవిఁ గంటిఁ బుత్త్రుఁగాఁ
గొదువ యొకింత లేక కనుఁగొంటి నిహంబునఁ గల్గుసౌఖ్యముల్. 84

గీ. చాలఁ దనిసితి నిందుల సౌఖ్యలబ్ధి
గరిమతోఁ గాలు కే లాడు కాలమునను
విశ్వపతి నీకుఁ గాశికాపురి భజించి
యుల్లమున నున్న యందు కాతి యుండవలయు. 85

గీ. శైశవంబునఁ జదువుల జవ్వనమున
భోగసక్తియు వార్ధకమున మునీంద్ర

వృత్తి నిలుపుటయును మీఁద విపులయోగ
కలన నైన దొరఁగుటయును మనకులమునడక. 86

ఉ. కావున నేను గాశిఁ గలకంఠు భజించి సమస్తపావని
ద్రావణజాహ్నవీసలిలధారలఁ గ్రోఁగెదఁ బుట్టువుం దిగం
ద్రావుటకై మదుద్యమము దప్పదు నిక్కము మామకాజ్ఞ నీ
భూవలయంబు తొంటినృపపుంగవులట్టులఁ బ్రోవు నందనా!. 87

క. దొరకు నిరంతరపుణ్యము, పరోపకారమునఁ గరము పాపము వచ్చున్
బరపీడనంబుచే నని, పరువడి నయశాస్త్రవిదులు పలికిరి వత్సా!. 88

క. కావున పరోపకారమె, యవిధములఁ జేయుబుద్ధి విడువకు పాపై
కావాసము పరపీడన, మా పీడను తప్పి సక్తి యార్యస్తుత్యా!. 89

మ. నయకావ్యున్ మతిగీష్పతిన్ బరిబలసేనాపోపసేనాని న
వ్యయగాంభీర్యపయోనిధాను శుచితావ్యాసక్తగాంగేయు స
త్యయమవోద్భవు ధైర్యహేమగిరి సంధానామదగ్ధ్యశ్రయం దయో
దయరామున్ సచివాగ్రణిన్ బెనుపు తత్తత్కార్యసంసిద్ధికిన్. 90

గీ. గోపకుం డావు నల్లనఁ గుస్తరించి, యొత్త నొయ్యన దుగ్ధంబు లొడుచుకరణిఁ
బ్రజలచిత్తంబు గందనిపగిది నడచి, ధర్మవర్తనమునఁ గాంచు ధనము లనఘ! 91

గీ. ఎంతయపరాధ మంతయు నెగ్గుసేయు, విధిగిధం బెట్టులట్లనె వేల్పు లగ్ని
ఫలము చేకొను నందాఁకఁ బట్టినట్టి,పని విసర్జింపఁ గార్యసంభావ్యబుద్ధి 92

వ. అని ప్రమథేశ్వరుం డనేకప్రకారంబులఁ దనకుమారునికి నీతివిద్యాప్రకారం బెఱింగించి తనయుద్యోగంబునకుఁ బరితపించునతని నుచితవచనంబుల నూఱడం బలికి ధర్మపత్నితో నవిముక్తంబునకు నవిముక్తప్రయత్నంబునం జనియె నంత.

ఉ. తండ్రి విరక్తుఁడై మునిమతంబునఁ గాశికిఁ జన్నపిమ్మటన్
దండ్రియుఁ దల్లియుం గురుఁడు దాతయు దైవము నై మహీప్రజన్
దీండ్రవహింపఁ బ్రోచు నరదేవశిఖామణి వైరిమండలం
బాండ్రను బిడ్డలన్ విడిచి యద్రిమహాగృహముల్ భజింపఁగాన్ 94

ఉ. ఆదిమశైవలక్షణసదాచరణాత్ముఁడు ముంజభోజభూ
మీదయితుండు వారిధులు మేరగ మర్త్యమలోక మేలుచున్
వాదులఁ బేదలన్ విభవసాంద్రులఁ జేయుచు నుండె నొక్కనాఁ
డాదివిపన్నదీమకుటు నాత్మఁ దలంచుచుఁ బల్కె నీక్రియన్. 95

క. ఈకాంతలు నీతనయులు, నీకాంచనరాసు లెల్ల నెన్నఁడు ధ్రువముల్
గాకుండు టెఱిఁగి బుధులకుఁ, గాకోదరరాజహారుఁ గని మనవలదే?. 96

క. చదివియు వివేక మెఱుఁగక, మదముగ పాతకములు చదువ మఱచినమూఢుల్
గుడియింపవె యమకింకర,పదభిదుగకఠోరఘోరపాతకములు తుదిన్. 97

క. శ్రీకంధరపదజలజా,లోకనవిముఖాత్ము లైనలోకులమొగ మా
లోకించినపాప్రజ్ఞుల కా,లోకింపఁగవలదె లోకలోచనమూర్తిన్. 98

క. అని తోఁపుచున్నయది నా,మనమున నెల్లెడ మమత మానదు సుతదా
రనికాయంబులమీఁదట, మునుకొని ము న్నెట్టికర్మములు సేసితినో. 99

క. ఈవిషయానుభవంబులు, పోవిడు మని తెలిపి చెప్పి పుణ్యపూరుఁ గొలువన్
ద్రోవ కనుపించుపుణ్యాని, దేవుంగాఁ జూతునొక్కొ ధీమార్గమునన్ 100

క. సద్గురునాథకటాక్ష స,ముద్గతకారుణ్యలాభమునఁ గాక తగన్
హృద్గోచర మెట్లగు దివి,షద్గంగాధరుపదాంబుజద్వయి నాకున్. 101

క. అహికంకణుపాదాంభో,రుహములు గనువాఁడ సద్గురునికృపకతనన్
ఇహియింపఁగ నోపనిదు,స్సహసంసృతి యిదియు నొక్కసౌఖ్యముకొఱకే! 102

గీ. అరసి యెంతటి వారికి నంపరాని,నీలలోహితపదనుహోదిధిఁ గనంగఁ
దత్త్వవిదుఁడైన దేశికోత్తంసుసదయ,మగు కటాక్షాంచలంబు దివ్యాంజనంబు.

గీ. చేవ సంసారభవసుఖశీతిజమునకు,నావ కలుషాంబునిధితారణంబునకును
ద్రోవ దుర్లభతరముక్తిదుర్గమునకు, శ్రీమదారాధ్యపాదరాజీవసేవ. 104

ఉ. కాయము శారదాంబుదవికాసమువోలెఁ దలంపు సత్రపుం
బాయువు భిన్నకుంభగతమైనజలంబుగతిన్ నసించు నీ
ప్రాయము సత్తనాఁ దగదు పంచమ(?)వాసరభోగ్య మింక నా
కాయజవైరిఁ జేరుటయె కర్జము నాకు గురూక్తిపద్ధతిన్. 105

క. ముక్కంటిమూర్తి యిదియని, నిక్కంబుగఁ దెలిపి చూపునేర్పుగురుఁడు నా
కక్కడఁ గలిగడె దైవము!, అక్కట నాప్రార్థనంబు నాలింపఁగదే! 106

గీ. అనువిచారంబుతోడ నన్యములు నెవ్వి,యును సమీక్షింప నొల్లక మనసులోనఁ
దగినదేశికు నరయునప్పరణినాథుఁ, డొక్కరే యిట్లు కలగాంచె నక్కజముగ.

గీ. అక్షమాలావిభూషితుం డరుణజటుఁడు
సాంద్రభసితాంగరాగుండు శైవుఁ డొకఁడు
తెరువుఁ జూపంగ నరిగి భూవరుఁడు గడిచె
ఖండపరశునినగరంబు వెండికొండ. 108

వ. ఇట్లఖిలజగన్మండనంబగు నక్కొండలరేని నధిరోహణంబుచేసి తదీయంబులగు
బహువిశేషంబులకుఁ బ్రతోషంబుఁ బొదలించుచుఁ దోఁచి చని యథోచితపరి
కారంబున నందికేశ్వరామ్రగహ్వరంబు వడసి జ్యోతిర్మయంబగు చేతోజదమను
దివ్యభవనంబున సొచ్చి సప్తకక్ష్యాంతరంబులు గడచి యగ్రభాగంబున. 109

క. ఖరకరహిమకరవైశ్వా,నరదీప్తుల ధిక్కరించి నానాదిశలన్
బొరిఁబొరిఁ బొదివెడియొకభా,స్కరతేజము గాంచి ధరణికాంతుం డంతన్. 110

గీ. అధికతరసంభ్రమంబున నంగకములఁ, బులకజాలంబు చెమటయు నెలకొనంగఁ
బొగడ డగ్గఱిలోఁగి యబ్భూమివరుఁడు, చిత్రరూపంబువోలె నిశ్చేష్టుఁ డయ్యెఁ

గీ. ఇట్లు నివ్వెఱఁగందియు నెట్టకేల,కు నరనాథుఁ డచలభక్తినమ్రుఁడు గాఁగ
నమ్మహోదారతేజంబు నక్షిమార్గ,మునకుఁ గోచరముగఁ జేసి యనుపదంబ.

సీ. చందనోజ్జ్వలశివాస్తనమండలముఁ బోలు, వెలిగుబ్బమూపురం బలరువాని
కొండిగుబ్బలచక్కి నుండి గుం నఖిలంబుఁ, దానయై యున్నచందంబువానిఁ
బెనుబాముర్ద్దిగంబున మించు లేయాచలావృతక్షితివోలె నమరువాని
భసితచర్చాసముల్లసితుఁడై చం కాంత్యంగహిమాచలమూర్తి హెచ్చువాని

గీ. జడలఁ దుఱిమిన రేఁజేని యొడల డిగ్గ
నమృతసేకంబుచేతఁ గాఁగములు వడఁక
విధుశిరోమాలికలు చేయు వేపాత
మునకు మోడించువేల్పుఁ గన్గొనియె నృపుఁడు. 113

ఉ. ఆమునిమానసాంబుజవిహారమరాళు నగేంద్రకన్యకా
స్వామిఁ ద్రియామమూర్త్యుఁ బురుపత్రియమూర్తి జగన్నివాసు నా
నాముని సంచరద్బహుళసాంద్రశరీరమహస్సమూహు ఫా
లామృతధామమాళిఁ గొనియాడె మహీరమణుండు మ్రొక్కుచున్. 114

క. తనుఁ బ్రస్తుతించుభూవిభుఁ, గని కరుణారసము దొలుక గౌరీవిభుఁ డ
ల్లనఁ జేరఁ బిలిచి యిట్లనె, యనిబిడదశనాంశువులు ముఖేందునిఁ బొదువన్.

క. ఇటు రమ్మర్భక! నీమది, ఘుటియిల్లినచింత విడువు కలిగెడు నీకున్
గుటిలభవబంధపాశ,త్రుటనసమర్థుండు సద్గురుఁడు వెలవసుమీ! 116

క. నాచేతఁ బనుపువడసి శై,వాచార్యవతంసుఁ డుద్భటాహ్వయుఁ డిపుడీ
భూచక్రంబున నున్నాఁ, డాచతురాత్మకుఁడు నీకు నగు గురుఁ డధిపా. 117

క. అనువృత్తాంతంబుం గలి,గినకలఁ గని మేలుకాంచి క్షితిపతి చిత్తం
బున నానందాద్భుతములు, కనుపట్టఁగ నుండె నంతఁ గడచెను నిశయున్.

శా. ప్రాతర్వేళ సమస్తకృత్యములు నిర్వర్తించి ధాత్రీవిభుం
డాతారాధిపమౌళి రాత్రి కలయం దాయాయుతుండంబులం
బ్రీతిం బల్కినపల్కు లార్యులకుఁ జేపన్ జెప్పినన్ వారలున్
జేతోవీథుల విస్మయిల్లి నృపునాశీర్వాదముల్ మున్నుఁగాన్. 119

చ. పలుకుచు రిట్లు వింటివె నృపాలశిఖామణి! నిశ్చలంబుగాఁ
దెలిసినవాఁడ వీవు భవదీయమనోరథముల్ ఫలించుటల్
తలఁప విచిత్రమే గిరిసుతాహృదయేశుఁడు భక్తులైనవా
రల కరచేతిలోనిమురరత్నము గొంగుపసిండి యారయన్. 120

క. కలలోనఁ గంటిఁ జంద్రశ,కలభూషణు ననుట యొక్కకడిఁదియె నీకుం
గలశంభుభక్తి యేరికిఁ, గల దిప్పటికాలమున జగన్నుతచరితా! 121

వ. ఈవు కృతపుణ్యుండ వీవుతలంచినసంకల్పంబు నిర్వికల్పంబుగా ఫలియించు సం
శయంబు వలవదని ధరాబృందారకులు భూపురందరుచేత సంభావితులై యథే
చ్ఛంబుగా జని రంత ముంజభోజుండు దాఁగన్నసుస్వప్నంబునకు నచ్చెరువందు
చు నిది నిక్కంబగునో కో యనుచు శంకరుండు నాపాలం గృపాలుం డగునో
కో యనుచు ననేకప్రకారంబుల మనోరథపరంపరాపరతంత్రుండై యుండె
నక్కాలంబున నొక్కనాఁడు ముక్కంటియానతిఁ దలమోచి. 122

సీ. పుట్టె నేగురుభర్త భువనాద్భుతము గాఁగ, నాగేంద్రహారుమానసమువలన
నుండె నేయాచార్యమండలేశ్వరుఁడు భూ,మండనంబగు ముదిగొండయందుఁ
గట్టె నేదేశికాగ్రణి చేతఁ గంకణం, బలఖేచరులదైన్య మపనయింపఁ
గాంచె నేయారాధ్యపంచాననుం డన్య,మతవిభేదక్రియాచతురబుద్ధి

గీ. గరిమ నెలకొల్పె నేయయ్యగారి తేఁడు
తరలకుంఠంగ ధర శైవధర్మవృత్తి
యట్టి శ్రీమదుద్భటస్వామి యరుగుదెంచె
రాజకుంజరుఁడగు ముంజభోజుఁ గుఱిఁచి. 123

మ. భసితోద్ధూళితదేహకాంతులు శరత్ప్రాలేయభానుప్రభం
బసచేయన్ బహుశైవలక్షణములన్ భాసిల్లుట న్మూర్తిశాం
తిసముల్లాసము నాఁ దలిర్చ యట ధాత్రీనాథునాస్థానరం
గసమీపంబున నిల్చె నుద్భటుఁడు శ్రీకంఠాపరాకారుఁడై. 124

క. చట్టలుఁ డా నరక భువిం, బుట్టినక్రియఁ దేజరిల్లుపుణ్యుని గురురా
ట్పట్టాభిషిక్తుఁ గన్నుల,పుట్టువునకు ఫలము గాఁగ భూపతి గాంచెన్. 125

గీ. పాయకుండినవాఁడొ ప్రాగ్భవమునందు
వలపురారాతి తెరఁగిటఁ దెలిపినాఁడొ
అట్లు వచ్చిన గురుమూర్తి యతఁడ యుద్భ
టాఖ్యుఁ డని గాఁకఁ దలఁచె నయ్యవనివిభుఁడు. 126

మ. మన మానందరసామృతైకకలనన్ మత్తిల్లఁ గంఠీరవా
సనముం బూర్వనగంబు డిగ్గు రవిరాజం డిగ్గి సాష్టాంగమ
ర్దనముల్ దద్గురుపార్శ్వభూమిపదద్వంద్వంబుఁ గోటీరర
త్నవికాయోల్లలదంశుమంజరులచేతన్ గప్పె రాజిమ్ములన్. 127

గీ. పరితోషుఁడై యిట్లు మఱి పాహి పాహి పాహి
యనుచుఁ బులకాంచితాంగుఁడై పలుకునృపతి
సేవ నియమించి యాగురులింగమూర్తి
పెట్టె శివరక్ష యంచు సంప్రీతి భూతి. 128

క. అహితాంతకుఁడగు ధరణీ,మహిళాకమణుఁడు శంభుమానసపుత్రున్
విహితసపర్యారచనా,ప్రహృష్టుఁ గావించె వినయభానురుఁ డగుచున్. 129

సీ. శరదిందుచంద్రికాచారుపరిఖ్యాలబ్ధి, యఖిలదిక్కులు నిండి యామరువాని
నిత్యపరిసాదమానితదేహసంపత్తి, మించి చూపఱుల బొంకించువాని
అతిశాంతనిజకటాక్షాంచలసామగ్రి, తలఁపులోపలిశుద్ధిఁ దెలుపువాని
అమృతధారార్ద్రవాక్యశ్రేణిఁ బశువుల, నైనఁ దజ్ఞులఁ జేయఁ బూనువాని
గీ. పాపపుంజంబు శిథిలింప నోపువానిఁ, బుణ్యములపుట్టినిల్లనఁ బొల్చువాని
సకలశైవాగమార్థలక్షణధురీణు, నలఘువిజ్ఞాను నుద్భటుఁ బలికె నృపుఁడు. 130

క. వింటి నటనున్న యాము,క్కంటికృప నిన్ను నేఁడు కౌతుక మొదవన్
గంటి భవాంబుధి గుల్ఫము,బంటి సుమీ నాకు నింకఁ బరతత్త్వనిధీ! 131

శా. ఆదిబ్రహ్మకపాలభూషణుఁ ద్రిమూర్త్యాత్మున్ శివున్ వహ్నిచం
ద్రాదిత్యానిలభూమరుత్పథపయోయజ్వస్వరూపున్ జిదా
మోదున్ శంభు భజించి యోగిజనతాముఖ్యుండవై యున్ననీ
పాదాబ్జంబులు గంటిఁ బాశములచేఁ బట్టూడి శైవాగ్రణీ! 132

క. అజతుల్యావారమహత్త్వము, నిజముగఁ దెలియంగ నోపు నేర్పును గనమిన్
గుజగుజయగు నాచిత్తం,బు జనస్తుత! బుద్ధి చెప్పి ప్రోవవె నన్నున్. 133

క. అఖిలాత్మకేది యింద్రియ,సుఖదూరుఁడ వాదిశైవచూడామణి వు
న్ముఖమంత్రిఫలుఁడ వాగమ,సఖబుద్ధివి దేవ! నీవు సామాన్యుఁడవే? 134

ఉ. ఏమితపంబు చేసి పరమేశ్వరు నేక్రియఁ గొల్చినాఁడవో
యే మునుపంటిపుట్టువున నిట్టిగురూత్తము నిన్నుఁ గంటి మ
త్కామిత మబ్బెఁ బాపములు గ్రాఁచితి ముక్తికురంగలోచనా
కోమలదృగ్విలాసములు గొల్లలు వట్టుదు నింకమీఁదటన్. 135

క. శివలింగము ధరియింపని, యవివేకికి నిహముఁ బరము నంద దనుచు వే
దవిదులు చెప్పఁగ విని విని, తపులుదుఁ జింతాభరంబు తత్త్వార్థనిధీ! 136

వ. కావున లింగధారణప్రకారంబును గురుశిష్యవర్తనంబును శివార్చనావిధానంబును సవిశేషంబుగాఁ జెప్పి నన్నుఁ గృతార్థుఁ జేయవే యనుచుఁ బునఃపునః ప్రణామంబులు గావించునృపసార్వభౌమునకు గురుసార్వభౌముం డిట్లనియె.

క. క్షితివర! నీయత్నము మెచ్చితి మల్ల తలంపు వలయు శ్రీకంధరుపైఁ
గృతపుణ్యుఁడ వీవు మహామతిగణ్యుఁడ వీశుభక్తి మరగినకతనన్. 138

క. ఈతుంగన లీయాత్మజు, లీయర్థము లీదళంబు లిన్నియును దృణ
ప్రాయములు సేసి మదిలో, నాయిందూత్తంసు నిలిపి తద్భుత మధిపా! 139

ఉ. భూరిసువర్ణపుష్పములఁ బూజ యొనర్చినవాఁడ వీవు కా
మారి మురారిబాణుఁ ద్రిపురారి మఖారి గజారిఁ బాపసం
హారి ననేకజన్మముల నట్టివిధం బొనగూడకుండినన్
వారిజసూతికైనఁ గనవచ్చునె శంకరుభక్తి భూవరా!. 140

సీ. హరున కర్పింపనియన్నంబుఁ గుడుచుట, కుచ్చితోచ్ఛిష్టంబుఁ గుడిచినట్లు
భవుని కర్పింపనిపానీయము మానుట, మానక యాసవం బానినట్లు
శివున కర్పింపనిపువ్వుదావి గ్రోలుట, కుణపధూపం బోలిఁ గ్రోలినట్లు
శంభుభక్తుఁడు గానిజడబుద్ధి నంటుట, గెంటక చండాలు నంటినట్లు
గీ. పశుపతికిఁ గానిపుణ్యంబు పట్టుటయును, బాపములు సేయుయత్నంబు పట్టినట్టు
లనుచుఁ బ్రాజ్ఞులు విజ్ఞాన మతిశయిల్ల, నన్ని తెఱఁగులఁ బూజింతు రష్టమూర్తి.

క. ఉత్తమకులజుండై గుణ,వత్తముఁడై వేదశాస్త్రవరశబ్దార్థా
యత్తమతి నిజముగల లో,కోత్తముఁ గురుఁ జేరవలయు నుర్వీనాథా! 142

క. శ్రద్ధాభక్తిసమృద్ధిఁ బ్ర,సిద్ధుండై చెప్పినట్ల చేయుచు నెందున్
గుర్విద్ధుండుగాక శాంతియు, సిద్ధాంతము సేయువాఁడు శిష్యతకుఁ దగున్. 143

క. శివదీక్ష లేక మోక్షముఁ, దవులఁడు జనుఁ డెంతవాఁడుఁ దనయంతన యీ
ట్లవుఁగాన భక్తిగలిగిన, భవదూరుఁడు లింగదీక్ష ధరియింపఁ దగున్. 144

సీ. ధరణీశ! విను లింగధారణంబునకును, వివరింతుఁ గాలంబు విశదఫణితిఁ
గడుయోగ్యములు శరత్కాలవైశాఖముల్, జ్యేష్ఠఫాల్గునమార్గశీర్షసంజ్ఞి
తంబులు నెలలు మధ్యమములు మాఘంబు, నాషాఢమాసంబు నగుఁ గనిష్ఠ
ములు చైత్రమును బుష్యమును భాద్రపదమును, శ్రావణంబును నవరంబు లయ్యె
గీ. నుత్తమంబగు సూర్యచంద్రోపరాగ
కాలముల నిందిరంబగు కాలమైన
ధవళపక్షంబు బహుళపక్షవశమైనఁ
బంచమియును గ్రాహ్యములు సుమ్ము భవునిఁ బూన. 145

గీ. చవితి నవమిని షష్ఠి సప్తమిని బున్నమను జతుర్దశి దీక్షకు ననువు గాదు
కడమతిథు లుత్తమములు శంకరు భజింప, నింక నక్షత్రయోగ్యత నేర్పరింతు.

సీ. మంచిది రోహిణి మఖ లెన్నయది యుత్తమము పునర్వసువు పుష్య మగుహితంబు
మృగశీర్షమును గాత్రివ్యా మగు హస్త పరిస్తుత, ప్రథితంబును మ్మనూరాధ యుత్త
రోత్తరాఫల్గును లుత్తరాషాఢయు, శాస్త్రోక్తములు సాధుసమ్మతములు
రేవతి ముఖ్యంబు భావింప మూలయు, స్వాతంబు హరదీక్ష కవనినాథ
గీ. తానులందునఁ జరమైనరాశి విడిచి, మానితంబగు నచరతంబైనయుదియ
గురుబుధోదయకాలంబు లురగహార,ధారణమునకుఁ దగఁ బాపదూరగతుల. 147

చ. ధరణిప! ఇట్లు దోషరహితంబగుకాలమునందు నంబికే
శ్వరు ధరియించుపుణ్యుఁడు రసాస్థలిఁ జేటడుబంటి డొల్చి పెం
పరయఁగఁ బూర్వశాంసువున నానుపి రాస్యముఁ బూడ్చి యందుపై
నిరవుగ నొక్కవేది రచియింపఁదగున్ నలుమూల లేర్పడన్. 148

క. ఆయురఁగుమీఁద వాఁకి,ళ్లాయతముగ నాలు గమర నతిరమ్యముగాఁ
జేయందగు శృంగారా,ధేయంబగు మంటపంబు ధీరవిచారా! 149

క. విలసితగోమయజలము, నలికినతన్మంటపమున నైదగువర్ణం
బుల బియ్యముచే స్థండిల, మలవడఁగవలయు సుజ్యలాలంక్రియతోన్. 150
గీ. మహితపుష్పోపచారసామగ్రిచేత, నిగ్గుదేరెడి ముత్యాలముగ్గుచేత
ధూపదీపాక్షతాదిబహూపచార,రచనచే నొప్పునందు సంరంభ మెసఁగ. 151

ఆ. కనకకృతములొండెఁ గాక వెండివియొండెఁ, గాక రాగివొండెఁ గాక మృణ్మ
యంబులొండెఁ గల్గినవి పంచకలశంబు, లమరమూర్తి నిలుపనగు నరేంద్ర! 152

ఉ. అలఘునవాంశుకాక్తృతములై తగుతక్కలశంబు లన్నిటిం
గొలఁకునఁ జెర్వునం గలయుకుత్సితతోయములందు వేళకుం
గలయవి మంత్రపూర్వకముగాఁ గొని నిండఁగఁ బోసి వానిలో
పల మణు లెవ్వియైన నిడి పై నవతంతుగవాక్షముద్రికల్. 153

క. సవరించి చూతపల్లవ,నవదూర్వాంకురకనత్కనకవారదళా
దివిశేషభద్రవస్తువు, లవిరళముగ నిడఁపవలయు నందులలోనన్. 154

వ. ఇట్లు తీర్థాంబుపూరితంబుగాఁ దక్షమంచితకలశపంచకంబున «ఓం మావస్సర్వ» యనువేదమంత్రం బావహించి సకలమంత్రసారంబును మునిజనమనఃకమలకర్ణికా పుష్పంధయంబు నగుపంచాక్షరం బున్ముఖంబుగావించి యీశానతత్పురుషాఘోర వామదేవసద్యోజాతంబు లనంబరఁగువామదేవువదనంబులకు నలంకరణంబులై యొనుకు నాలుగు నెనిమిదియుఁ బదుమూఁడు నెనిమిదియు ననఁగలుగుసంఖ్యాం ప్రఖ్యాతంబులై విశిష్టంబులగునయ్యష్టాత్రింశత్కళాసంస్మరణంబు సేయుచుఁ బూర్వోక్తంబగుతండులస్థండిలంబున్న నుత్తరాభిముఖుండై గురూత్తముండు కృతహోముండును, స్వస్తికపీఠస్థుండును, విభూతిపట్టభాసురుండును నగుశిష్యునకు నంగన్యాసకరన్యాసంబు లాచరించి త్రివారంబు తక్కలశవారి నతనియుత్తమాంగంబు ప్రోక్షించి యుతన్నంబ. 155

సీ. ఆపంచకలశంబులందు నొక్కటి శివకుంభంబుగాఁ బూని కోరి తీర్థ
సలిలధారలు చల్లి తోలఁచి గంధాక్షతంబులచేతఁ బూజించి నలుచెఱఁగుల
నాల్గుకుండలు నించి నడిమికుంభంబున, క్షీరంబు పోసి ప్రాచీస్థితంబు
దక్షిణస్థితము నుత్తరసంస్థితంబును, బశ్చిమస్థితము నై పరగువాని
గీ. తోన పెరుఁగును నెయ్యిని దేనియయును,బంచదారయుఁ గ్రమమునఁ జాదుకొల్పి
హెచ్చు యష్టాంగధూపంబు లిచ్చి శంఖ,కాహళాదికములు మ్రోఁతగడలుకొనఁగ.

వ. స్వస్తికవిస్తృతంబగు కూర్మాసనంబు నిర్మించి ప్రాణప్రతిష్ఠాగరిష్ఠంబులగు మంత్రంబులు తంత్రపూర్వకముగా నుపన్యసించుచు శంఖముద్రాముద్రితకరాంబుజుండై తచ్ఛిష్యు నుద్దేశించి «అపరో స్సిద్ధిర» స్త్వనుచుఁ దన్మస్తంబు హస్తంబునం గు స్తరింపుచు «నమస్తే హస్తో భగవా» ననువేదమంత్రంబుతోడ నీరంధ్రతేజోవిరాజితంబును అశేషపాశతమఃపటాకర్తృణిమూర్తియును, విజ్ఞానపరిజ్ఞాపరిదర్శనదీపాంకురంబును, గంధపుష్పాద్యుపచారపూజితంబును హృద్య

నైవేద్యప్రసమృష్టంబునగు జ్యోతిర్లింగంబును «నకదాచిద్విరోజరో" తనుపుఁ
బుష్పాంజలిపూర్వకంబుగా వినర్పైకధురీణుండగు నతనికి సద్గురుండు ప్రాణలిం
గంబు చేయువలయు నిది లింగధారణప్రకారంబు. 157

క. అన విని హర్షాశ్రులు కనుఁగొనలం దళుకొత్త రాజు గురురాజునకున్
బునరభివాదనములు ధృతి, నొనరిచి యిట్లనియె వినయ యుతమానసుఁడై. 158

చ. తెలిసితి లింగధారణవిధిన్ గురువల్లభ! గుర్వనుజ్ఞకున్
దొలఁగక శిష్యుఁ డెల్లపుడు ధూర్జటిలింగము కట్టి తావులన్
నెలకొనఁ జేయఁగావలయు నీమది న స్గరుణించి యాదరం
బొలయఁగఁ జెప్పవే యనుడు నుద్భటుఁడున్ నృపుఁ బల్కె నీ క్రియన్. 159

గీ. పాక్కలందునైన భుజమధ్యమునసైనఁ, గేలుదమ్మినైన వాలినైనఁ
గంఠసీమనైనఁ గుకంఠు ధరియింపఁదగు నృపాల! వాభిదిగువఁ దక్క. 160

క. నావుడుఁ దద్గురుమణితో, భూవిభుఁ డిట్లనియె భోగిభూషణ యమృత
ప్లావిత యగునీవచనస్రీ పీయులఁబొరసెఁ గంటిఁ జిరసౌఖ్యంబుల్. 161

గీ. భక్తులకువారిరొుడఁ గల్పపాదపంబు, పాడపుగనియాన్నని నొప్పియుడుంగ వెలుఁగ
భసితరుద్రాక్షధారణపాప్తమైన, పుణ్య మెక్కువి వివరించి ప్రొవు మనుడు.

క. సర్వాంగస్థలయందును, సర్వేశుని లింగమూర్తి సౌభాగ్యకళా
నిర్వాహకు ధరియించిన, సర్వజ్ఞాల కిందు నందు సౌఖ్యము దొరసున్. 163

సీ. హరకంఠముఖులు సంయములును మనువులు, నెలకొల్పి రీశాను గళమునందు
బ్రహ్మవిష్ణునురేశపావకాదులు దాల్చి, రుత్తమాంగంబుల నూర్ధ్వరేతు
నక్షపాదశిలాదహరదత్తముఖ్యులు, వహియించిరి నుదుట్ల వామదేవు
శక్తులు నందికేశపరిభృత్యాత్మవేదులు పూని రురముల నలికనయను

ఆ. కొమరుసామి భృంగి కుంజరాస్యుఁడు మొదలైనభక్తవరులు హరు ధరించి
రధికభక్తియుక్తి వార్తియుకరకుడ్మ, పుటములందు భూమి భువననాథ! 164

ఉ. అన్నృపుతోడ ని ట్లనియె నాగమతత్త్వవిదుండు దేశికుం
డెన్నఁడు చేర్చినాఁడవు మహీవర! శైవరహస్యముల్ గనన్
మొన్నఁటివాఁడ వింతియ విమూఢుల కీసమయంబు దుర్లభం
బెన్న మహావివేకనిధి వీవు కృతార్థుఁడ వెన్నిరీతులన్. 165

గీ. కపిలయును గృష్ణవర్ణయుఁ గంబునిభయు
ధూమ్రయును జాతపల్లవతామ్రరుచియు

నైనగోవులు గడిపెట్టి నందితెచ్చి
భూతి చేయంగవలయుఁ బ్రభూతవహ్ని. 166

సీ. సంపదైశ్వర్యముల్ సమకూర్చుటకుఁ దానె, హేతువై యునికి విభూతి యనఁగఁ
గవిసి పాతకములఁ గడిసి మెసఁగఁ జాలి, ప్రఖ్యాతి గలుగుట భస్మ మనఁగ
శరదిందుచంద్రికాసారకాంతులు మీఱి, భాసనంబొందుట భసిత మనఁగ
శాకినీడాకినీసర్పాదిభయము చేరఁగనీక రక్షింప రక్ష యనఁగ

గీ. నాపదల నెల్ల క్షరణంబు నందఁజేయుఁ, జాలుమహిమఁ బ్రకాశించి క్షార మనఁగ
బూది యాహ్వాయపంచకంబునఁ దలిర్చు, ఫాలలోచనఫాలనేపథ్యకలన. 167

వ. వెండియుఁ గపిలకృష్ణధవళరక్తధూమ్రవర్ణంబులఁ దగుపూర్వోక్తధేనువులు నం
దయు సుభద్రియు సురభియు సుమనయు సుశీలయు ననఁ బరగు వీనిగర్భంబు
ల నావిర్భవించి ప్రఖ్యాతయగుట విభూతి భూతనాథుండు సద్యోజాతంబున
వహియింపుట విభూతి యనియును, వామదేవంబున ధరియింపుట భసితం బని
యును, నఘోరంబున భరియింపుట భస్మంబనియును, దత్పురుషంబున నవధరిం
పుట క్షారంబనియును నీశానంబున నెలకొలుపుట రక్ష యనియును బ్రసిద్ధినీయమై
వర్తిల్లుచు పెరాక్షలక్ష్మీదరహసితసుధానిష్యందంబు నానందం బగు వినుము 168

సీ. కైశోనఁదగు సర్వకాలంబుల విభూతి, నైమిత్తికములఁ బూనఁగవలయు
భసితంబు రక్ష దాల్పఁగ యోగ్య మాయాయి, యగ్నికృత్యంబులయందు భస్మ
మమవగుఁ బూయఁ బ్రాయశ్చిత్తముల మోక్షవిధుల సంభావ్యమై యెయ్యెడ క్షార
మిది భూతినిర్ణయం బిఁక విను రుద్రాక్షమహిమ వర్ణింతు నిర్మలగుణాఢ్య!

గీ. అలికనయనుండు మున్ను సురారిపురము
లోకదృష్టికిరాఁ జూచుచుండ నతని
నయనముల రాలుబాష్పసంతతులు ధరణి
వ్రాలి రుద్రాక్షములుగాఁగఁ బ్రబలె నధిప!. 169

సీ. శిఖ నొక్కటియు మూఁడు శిరమున ముప్పది, యాఱు మస్తముచుట్టునందుఁ గంఠ
పీఠి ముప్పదిరెండుఁ బృథులవక్షోవీథి, నేఁబది పదునొండు నేను బాహు
శాఖల షడ్ద్వయసంఖ్యలఁ జేతుల, నొండొండు వాఱాఱు నొండుచెవుల
నవతియుం బదియును నాల్గు రెండును నుప, నీతసూత్రంబున విధిసముక్త

గీ. మార్గమున రుద్రమణులు ధీమంతులైన, వారలకుఁ దాల్పవలయు భావలయసాధ
యెన్ని దాల్చినఁ దత్ఫలం బెన్నఁ దరమె?, ... ... 170

ఉ. తలఁచినఁ గన్న విన్నఁ గరతామరసంబుల నంటినం దమా
ఫలకమునందుఁ దాల్చిన నభంగురముక్తిఁ దురంగలోచనా
చలదలసభ్రమసాదితలసద్విలమానకటాక్షవీక్షణం
బులఁ బరితుష్టిఁ జేయుఁ దుది బూరుషు రుద్రమణుల్ నృపాగ్రణీ! 171

క. అని విని చరితార్థుండై, జననాథుఁడు గురుకులాబ్ధిశశి నుద్భటు న
ర్చనలఁ దనియించి దీక్షకు, ననుకూలుం డగుచునుండె నక్కాలమునన్. 172

చ. కుసుమితకాశ మంబుధరగోపనదూరనభస్ప్రకాశ ము
ల్లసితమరాళి సస్యఫలలాభవిజృంభితపామరాళి శ్రీ
శస్యమరసారసంబు హృతవిభ్రమసింధురసారసంబు నై
యసదృశలీలఁ బొల్చె శరదాగమ మాగమనాగ్రమార్గమై. 173

గీ. కలవపుష్పాఁగోల యలదేఁటికలికినారి, నెనయుపుండ్రేక్షుధనువుతో నెక్కుద్రోచి
దర్పకుం డేచి విరహిచిత్తములు గలఁచి, గారవెట్టుచునుండుఁ దత్కాలమునను.

గీ తొల్లి కలఁగినకోలఁకులనెల్లఁ దేర్చి, తనరుకుంభజునున్నతి ధార్తరాష్ట్రి
వినుతమై యొప్పెఁ గుంభజవిలసనంబు, ధార్తరాష్ట్రిలచేఁ బ్రమత్తంబుగాదె.

చ. కలువఁకవమ్రదావి నోడికంబుగఁ గైకొని పద్మకాననం
బులకడ గుంపుగట్టి కనుమోడ్చినయంచల పెక్కుమొత్తముల్
జలితములయ్యెఁ గావునఁ బ్రచారముఁ జూపి పరిభ్రమించి రా
త్రిల శరదాగమంబున మరుచ్ఛిశువుల్ విసరశ్రిఁ దోఁగుచున్. 176

క. కురిసెన్ గరిమద మంచులు, మెరసెన్ రాజనముదొండముక్కుపడియె వే
విరిసెం జలదంబులు దివి, నెరసెన్ యామినులఁ జంద్రనిర్మలరోచుల్. 177

గీ. హెచ్చి వగరలమీఁద దండెత్తునృపుల
సైన్యహయములఖురరజశ్చయము దమకుఁ
బ్రాణవిభుఁడైన వారాశి నలుగఁ జేయఁ
గాంచి చిక్కనగతి నదుల్ కార్శ్యమొందె. 178

వ. మెఱుఁగులు దీటుకొల్పుతనుమిట్టలఁ గమ్మజవాదితావులన్
బిఱఁదికిఁ ద్రోచువాసనల బేడిసమీలహసించుకన్నులన్
వలులుకృషీవలాత్మజలవారణఁ బాడుచు రిందువంశజాత్
చెలికును రాజనంబుఁ గలచేలకడన్ శరదాగమంబునన్. 179

గీ. సకలజనులకు లోచనోత్సవము సేయఁ, జాలుతత్కాలమున రాజచంద్రమూర్తి
ముంజభోజుండు శివలింగమును ధరింప, యత్నమొనరించె నుద్భటునను మతమున.

శా. పాటింపందగు నానువిన్నపము హృత్పద్మంబులం జాహ్నవీ
జూటుం దాల్చెద శుద్ధపంచమి మహీశు ల్వేగ మీ ర్వచ్చి నా
కోటన్ సత్కృప సేయఁగావలయు నంచున్ విశ్వవిశ్వంభరన్
జాటంబంచె నతండు గాలరులచే శైవోత్తమశ్రేణికిన్. 181

ఉ. అన్నృపువిన్నపంబు హృదయంబుల మిక్కిలిఁ బూని ప్రాప్తపం
చాననసన్నిభుల్ శమదమాఢ్యులు దేశికపుంగవుల్ దృఢ
జ్ఞానులు నేలయీనినవిచారములన్ జనుదెంచి రాత్మతే
జోనిహతంబులై నొరిగి సూర్యమరీచులు విన్నవోవఁగాన్. 182

ఉ. మిక్కిలికన్ను చేత నొకమేటి త్రిశూలము పాఁపసొమ్ములున్
జక్కనివింటిజోదుమయిసానమురాచినచందనంబు నే
విక్కవగాఁగ నుండునొకయింతియుఁ గల్గినవేల్పు దామయై
యక్కమనీయమూర్తులు ప్రియంబున పల్లకి కేఁగి రయ్యెడన్. 183

క. ఈయందమ్ముల వచ్చిన, యాయయ్యలపదసరోరుహములు గడిగి భూ
నాయకుఁడు పూజచేసె ము,దాయత్తస్వాంతుఁ డగుచు సంచితభక్తిన్. 184

గీ. ఇట్టు భయభక్తు లమర విధీరితార్చ,నములఁ దను సంతసిలఁ జేయుచునలివనైరి
కులశిఖామణిమహేశునికొడుకు సకల, దేశికులు దీవనలఁ బ్రస్తుతింతు రిట్లు. 185

సీ. సింధుబల్లహురీతి శ్రీపతిపండితు, మరియాద ధూపదమాచిదేవు
నట్లు మహాకాళునకువలె సల్లక, ల్కదబ్రహ్మశేవఁ గక్కయవిధమున
శూలదబ్రహ్మయ్య చొప్పున బిబ్బబా, చనలీల వీరనాచాఁకుపోల్క
కదిరెరెమ్మయగారికైవడిఁ దెలుఁగేశు, మహాణయ్యచందాన మాచిరాజు

గీ. కరణి మాళిగమారయ్యగతిఁ దెలుంగు
జొమ్మనార్యునివడువున సురియచౌడు
పగిది బసవేశ్వరునిమాడ్కి భక్తియుక్తి
శంభుఁ బూజించి బ్రదుకు రాజన్యచంద్ర! 186

గీ. అనుచు దీవించి భూపాలు నాదరించి
మహిమ నిల కేఁగి రగ్గురుమండలేశు
లమ్మహీభర్త తమ కిచ్చునమితవస్తు
సముదయమునకు మదిఁ బ్రహృష్టంబు నిండ. 187

క. అంతట సాగరకాంచీ,కాంతుఁడు శ్రీకంఠుఁ బూనఁ గల్యాణవిధా
క్రాంతమగుదినము చనుదే, నెంతయు హర్షించి పురి సమిద్ధవిభూతిన్. 188

వ. అలంకరించుటకు ఫణిహారులచేతం జాటంబంచిన. 189

క. కట్టిరి మణితోరణములు, పెట్టిరి ముత్యాలముగ్గు పృథులధ్వజముల్
చుట్టిరి సౌధంబులఁ ద,త్పట్టణమునఁ బౌరులెల్లఁ దమతమయిండ్లన్. 190

క. ఆవేశబహుళశృంగా,రావాసములై చెలంగె నద్భుతభూతిం
దేవాలయములు సద్గురు,దేవాలయములును భక్తిదేవాలయముల్. 191

సీ. అపూర్వదివసంబునందుఁ బ్రభావతీ,సంభవుం డవితథారంభుఁ డగుచుఁ
గమనీయతీర్థోదకములఁ దానంబాడి, వెన్నెలనునుఁగుల విన్నఁబుచ్చు
రమణీయశుభ్రవస్త్రములు మెచ్చుగఁ గట్టి, భసితాక్షమాలికోద్భాసి యగుచు
నసమాక్షుప్రతివచ్చు నతులమూర్తుల శైవ,లాంఛనధరుల నల్లన భజించి

గీ. శంభులింగంబులకుఁ బ్రపూజలు ఘటించి
తనగురూత్తమునచేఁ బ్రసాదంబు వడసి
యరిగె బహుతూర్యరవము లంబరము పొదువ
భద్రపీఠకుఁ దగుమంటపంబు గుఱిచి. 192

వ. అట్లు చనిచని యాఖండలకోదండదండంబునం దొరఁగుప్రభామండలంబు గండడంచునగణితతోరణంబులవలనను శాతమన్యవశిలాశకలకీలితంబులై యకాలతమోజాలంబు విశాలంబుగాఁ గలిగించు నలఘుపలభులవలనను, మధ్యందినమార్తాండమండలంబుం గోడగించి విజృంభించు శాతకుంభకుంభంబులవలనను, నాశావకాశంబులు వాసించు కాలాగరుధూపమాలికలవలనను, గలుమిగిలి విశుద్ధకామధ్వజాంచలగండూషితసుధాంధస్సింధుపయోభరంబును, జతుర్ద్వారభాసురంబును, జతురశ్రవిస్తృతవేదికంబును, సమస్తప్రశస్తతీర్థోదకపరిపూరితకలశపంచకంబును, గాంతాకరార్పితకర్పూరనీరాజనాదివిరాజితంబును, గమ్రామ్రపల్లవప్రముఖనిఖిలభద్రపదార్థసార్థప్రేక్షణీయంబును నగుదీక్షామంటపంబుఁ బ్రవేశించి యథాకాలంబును యథాశాస్త్రంబును నగునట్లు విభూతిపట్టహోమాదికృత్యంబులు గుర్వనుజ్ఞ నఖర్వభక్తి నొనరించి వినిద్రాస్యుండై ధరణీకాంతుండు మహితమంత్రధారాపారంబుఁ గన్గప్రతీక్షుటుంబిగా నాకాంక్షించుచునవసరంబున. 193

క. సాక్షాదలికాక్షుం డగు,నక్షయపుణ్యాత్ముఁడైన యాగ్గురునాథుం
డక్షుద్రమంత్రవిద్యా,దీక్షితుఁ జేయం దలంచి రాజోత్తమునిన్. 194

సీ. వామాంకవిన్యస్తవామేతరకరాంబుజయు నవరక్తోత్పలయుతవామ
హస్తయు... నగుతన ప్రియకాంత, మెఱుఁగారుపాలిండ్లమీఁదిచాయ
డాకేలు తా మెడ(?) పైకొల్పి చొక్కుచుఁ, బరశువు మృగమును వరము నితర
శయముల ధరియించి సాంద్రరసర్వాకల్ప, భాసమానాంగుఁడై పరిఢవిల్లి
గీ, లలితమాత్కారణాంశులు తొలుకరించు, మేనఁ బుష్పాస్త్రవిలసనోన్మేష మమర
హరివపర్మాసనాసీనుఁడైన, పార్వతీశుఁ బ్రసాదపంచాక్షరీశుఁ బొగడి. 195

చ. పరశువు ఖడ్గముఁ నిశితబాణము శూలము దక్షిణస్ఫుర
త్కరములపైఁ దనర్ప హితఖండనఖేటధనుష్కపాలముల్
బరువడి వామహస్తములపైఁ జెలఁగన్ నలువారుమేను ధీ
కరపదనంబుఁ ద్ర్యక్షములు గాంచనవర్ణజటల్ తలిర్పఁగాన్. 196

చ. కరయుగళంబునన్ భుజయుగంబునఁ గర్ణయుగంబునం బదాం
బురుహయుగంబునం గటిని బొల్పుగళంబునఁ బార్శ్వసీమలన్
శిరమునఁ గుక్షి వాల్గువది జిహ్వఁ గరాబ్జములన్ వహించుశ్రీ
భరితు నఘోరమూర్తి మనుభర్త నఘాంతకుఁ బ్రస్తుతింపుచున్. 197

వ. వెండియుఁ దక్కినశివమంత్రంబులం గలసారంబుఁ బరిగ్రహించి గురుండు
శిష్యునకు నుపదేశించిన. 198

చ. ఒనర నిశావసానసముదోదితభాస్కరునందు నుండి చ
య్యన దిగి దీప్తి పుల్లజలజాంతరముం దగఁ జొచ్చునట్లు పు
ణ్యవిధి యనంగ నొప్పు గురునాథుమొగంబున నుండి మంత్రవి
ద్య నృపుమొగంబుఁ జొచ్చె విమలాకృతి నగ్నికణావదాతమై. 199

క. గురుమంత్రవిద్యచే నృపు, కరస్థలాధీనకాలకంధరలింగో
దరముఁ బ్రవేశించె మనో, హరమగునొకదివ్యతేజ మద్భుతభంగిన్. 200

వ. ఇట్లు కృతలింగధారణుండై ధరణీరమణుం డజగవశాసనపూజావశా
యణుండై. 201

క. త్రిణయన! భక్తసులభ! స, ర్వనిలింపాత్మక! దయావివర్ధన! నాపై
ననురాగం బొదవఁగఁ జయ్యన నీలింగంబునందు హత్తుము నేడ్కన్. 202

క. అలధరణీధరశరవర, నిలయ! మహైశ్వర్యధుర్య! నిటలాక్ష! విని
ర్మలదేహ! పార్వతీప్రియ!, నెలకొను మీయాననమున నెయ్యముతోడన్. 203

క. గానప్రియా! విషకంఠ, త్రా! నిరుపమ! నిత్య! రాజరాజసఖ! హరా!
నానాభుగహార! గైకొను, భానుశశాంకాగ్నినేత్ర! పాద్యము దీనిన్. 204

క. మధుమథనదృగర్పితపద, విధిశిరసరోజభేదనవిధిచణహస్తా!
విధుకాంతవర్ణ! శివ! జగ,దధినాథ! పరిగ్రహింపు మర్ఘ్యము దీనిన్. 205

క. అణిమాదిగుణాన్విత! భవ!, ఫణివల్లభహార! దివిజభక్తవ్రనమస్యా!
గణనాథ! నీలలోహిత!, ప్రణుతాచమనీయకంబుఁ జాటింపు దయన్. 206

క. తుహినగిరిసుహితృపాణి,గ్రహణప్రీతాత్మ! భూతగణవృతరాజ
వహితశతకోటితేజో,మహిత మదిం బొడము విహితమజ్జనలక్ష్మిన్. 207

క. అజ్ఞానతిమిరభాస్కర!, విజ్ఞానవిలాసజనక! విశ్వేశ్వర! స
ర్వజ్ఞ! నిజభక్తవత్సల!, వరిజ్ఞాధిక! కొమ్ము వస్త్రరాజము దీనిన్. 208

క. విపరీతవిశృతఫణివర!, ఉపనిషదర్థస్వరూప! యోగిజనధ్యే
యపద! సువర్ణకృతం బగు,నుపవీతముఁ దాల్చు మిదె సముజ్జ్వలమూర్తీ!. 209

క. జన్మజరామృత్యురహిత!,చిన్మయ! లోకేశ! యీశ! శీతాంశుకళా
భృన్మకుట! గంధ మిదె పే,ర్మి నమ్రము మన్నించి కొనుము మఖవిధ్వంసీ!. 210

క. పవనశిఖితరణిశశిజల,పవనకృదాకాశభూమిసంభృతమూర్తీ
భవభూధరభిదుర! సదా,శివ! యీయక్షతలమీఁదఁ జిత్తం బిడవే. 211

క. పంచానన! రుచిదిక్కృత,పంచానన! విజిత! దేవపతిసంస్తుత్యా!
పంచాననావతర! హర!, పంచప్రేతేశ!పువ్వు లుంచెదఁ గొనుమీ!. 212

క. శ్రీకంఠ! దివ్యనై భవ!, పాకిట... మనూత్తరనివేశరతా!
లోకాధీశ్వర! సురసిం,ధ్వాకల్ప!ఖరిధూప మిది ప్రియంబునఁ గొనవే!. 213

క. పాపహర! దేవదేవ! వి,రూపాక్ష! కృపాకటాక్ష! రుద్ర! మహేశా!
తాపత్రయ సంహారక!, దీపము లర్పింతు దయ మదిం గనుఁగొనుమీ!. 214

క. దండధరమథన! కుండలి,కుండల! దివిషన్మహీధ్రకోదండ! సుధీ
మండలనీరజవనమా,ర్తాండా! నైవేద్య మిది ముదంబునఁ గొనవే. 215

క. లంబోదరజనక! బుధా,లంబ! విరూపాక్ష! మోక్షలక్ష్మీప్రద! చ
ర్మాంబర! యంబరకుంతల!, తాంబూలము మీకు నర్పితంబగు జూచేన్. 216

క. అక్షీణపుణ్య! పవనా,ధ్యక్ష!మహోక్షేంద్రవాహ! ధరణీరథ! ప
ద్మాక్షాశుగ! నేఁ జేయు ప్ర,దక్షిణములు చిత్తగింపు దయ నిగమహయా!. 217

క. శ్రీకంధర!మునివల్లభ!, మాకాంతవనీవసంత! మలహర! రమణీ
యాకార! నమోవాక్యము, చేకొను నే నీకొనర్తుఁ జిరతరభక్తిన్. 218

క. అని షోడశోపచారము,ల నిటలనేత్రుని భజించి లాలితపుణ్యాం
బునిధి యగుముంజభోజుఁడు, గనఁగొనియెన్ దత్ఫలంబు కల్యాణంబుల్.

క. జితపాశదేశికోత్తమ,కృతదీక్షుం డగుట నిట్లు కృతకృత్యుండై
క్షితివల్లభుండు రేఁడవ,శితికంఠుఁడు వోలె నఖిలసేవితుఁ డయ్యెన్. 220

గీ. ఉక్తదక్షిణ నారాధ్యు భక్తిఁ దలఁచి, సకలజంగమగురురాజశైవసముద
యముల నర్ఘ్యసపర్యల నలరఁజేసి, నిత్యసౌభాగ్యమయమూర్తి నెగడె నృపుఁడు.

ఉ. మానితమూర్తి భూపతి యుమాపతి నీగతిఁ బ్రాణలింగముం
గా నొనరించి పుణ్యములకందువఁ గాంచి దయార్ద్రచిత్తుఁడై
మానవలోకముం బెనుచు మంజులకీర్తులు మిన్నుముట్ట వి
ద్యానిధి సద్భటుం గురుకులాగ్రణి రాజ్యధురీణుఁ జేయుచున్. 222

క. ఫలు దుది విధాత యాదిగఁ, గలవిశ్వమునందుఁ గాలకంఠుఁడు గౌరీ
లలనామనోహరుని మదిఁ, దెలిసి యతం డెల్ల వసుమతీవలయంబున్. 223

సీ. ధారివివేకంబు పుట్టినప్పుడె పుట్టెఁ, గాకున్న నొరులకుఁ గలదె యిట్లు
బుధపోషకేలియుఁ బుట్టినప్పుడె పుట్టెఁ, గాకున్న నొరులకుఁ గలదె యిట్లు
పుణ్యంబుఁ దెలివియుఁ బుట్టినప్పుడె పుట్టెఁ,గాకున్న నొరులకుఁ గలదె యిట్లు
భూతదయాప్తియుఁ బుట్టినప్పుడె పుట్టెఁ, గాకున్న నొరులకుఁ గలదె యిట్లు

గీ. బుద్ధియును బుట్టినప్పుడె పుట్టె నెనరుఁ, గలసి కాకున్న నొరులకుఁ గలదె యిట్టు
లనుచు నఖిలంబుఁ దనుఁ గొనియాడుచుండ, బల్లహోదులరీతిఁ బ్రాభవముఁ దాల్చె.

శా. కామక్రోధములం ద్యజించి మమతన్ ఖండించి శైవాగమ
ప్రామాణ్యంబు పరిగ్రహించి ధరణీ భక్తాళిసంరక్షణన్
సామర్థ్యంబున రోలాగిన ర్తవమునన్ సంపూర్ణవిజ్ఞానసం
ధామాన్యస్థితి మించె భూపతి సమస్తంబున్ మహిన్ మెచ్చఁగాన్. 225

మ. అరిసంహారము శైవనిర్ణయకథావ్యాసక్తియున్ సద్గుణ
స్ఫురదత్యద్భుతధర్మసంగతియు నేపార్చిద్దున్ వెలిన్ లోన ని
ర్భరతన్ బెంపువహింప రాజసమునన్ భాసిల్లునావల్లకీ
పుర మింపొందఁగ ముంజభోజుఁడు బుధాంభోజాతహంసాకృతిన్. 226

క. నలినీపత్రము నంటని,సలిలకణంబట్లు తగులు చాలించి ధరా
స్థలి నిట్లు ప్రోచుహిమకర, కులసంభవుఁ డైనరాజగురుఁ డీకరణిన్. 227

క. సుక్షేత్రంబునఁ బడసిన, నిక్షుప్తంబైనవిత్తు నెటి నీయెండ నా
యక్షీణమంత్రవిద్య మ,హాక్షణకరలీలఁ బొదలె నవనీశ్వరుఁడున్. 228

వ. ఇట్టి శిష్యునిం జూచి గురుం డిట్లనియె. 229

చ. వమనుఖమోదియై వినయసంగతుఁడై శుచితాభిరాముఁడై
యమరిననీతెఱంగు సుశుభాధ్యువశం బగు మాద్భశేరితా
గ్రామమువు మీఁదనుం బ్రబలినట్టితెఱంగున గూర్చు జాతికే
శమునకుఁ బోసినట్టి సలిలంబు విధంబున భూపురందరా. 280

సీ. సమవక్షపాతనిశ్చలభక్తియుక్తిఁ, గర్మాగ్ధామంబుల నాదరించి
దుష్టనిగ్రహముఁ శిష్టరక్షణమును, నిత్యకృత్యములుగా నిర్వహించి
సక్ర్చందనాదిపారవిదూరభోగంబు, లాలసి యొల్లమిగాఁగ నొందఁ జాలి
అప్రమత్తత్వంబు వఁది బాహ్యశత్రంత,రములశాత్రవులగర్వం బడంచి

గీ, జలధివలయితవసుమతీస్థలము నొక్క, పురముఁ బ్రోచుతెఱఁగునఁ బ్రోవ నేర్చె
రొప్ప నిమఁ బోలనేర్చనే యొక్కరుండు, భూరిరుచిరాజ! శ్రీముంజభోజరాజ!

క. నీవంటిశిష్యుకతమున, నావంటిగురుండు నిత్యవస్యయశశ్రీ
శ్రీవంటియఘవయోనిధి,నావంటినకరణిఁ గడుదు నరనాథమణీ! 232

క. శిష్యుఁడు పాపము చేసిన, దూష్యస్థితి గురునిఁ జెందుఁ దోరపువేఁకన్
శిష్యుఁడు పుణ్యము సేయ న,దూష్యస్థితి గురునిఁ జెందుఁ దోరపువేఁకన్. 233

వ. కావున శిష్యునిపుణ్యపాపంబులు గురునితలయవియు కాన యుత్తమశిష్యుండు
గలుగుట గురునిభాగ్యంబ శిష్యం డనుత్తముం డగుట గురునిదౌర్భాగ్యంబు
యని వేదవిదులు చెప్పుదు రీవు సచ్ఛిష్యుండ వగుటంజేసి మా కదృష్టంబయ్యె
ననియును గాక. 234

ఉ. ఏలరె? మున్ను భూపతుల నేకులు రామయయాతిముఖ్యు లీ
నేలయ నీవు ప్రోచునది నేలయ యిట్టియశంబు నిట్టిరూ
త్రాలతరప్రభావమును దక్కఁ బ్రొ లొందిరె నీక్రియన్ మహీ
పాలలామ! నీకయినభాగ్యము వర్ణనసేయ శక్యమే?. 235

శా. నీవున్ జేరమభూనరాదులగరిన్ నేత్రక్రియోద్భాసిలో
కావాసుం గరిచర్మవాసు భువనైకారాధ్యు నిమ్మేనితో

సేవావృత్తిఁ బ్రసన్నుఁ జేసి దిశలన్ శ్రీపూర్ణకీర్తిస్ఫుర
జ్జ్యోత్స్నాకాశంబున నిల్పఁగాఁ గలవు తథ్యం బిందువంశాగ్రణీ. 236

చ. అనుటయుఁ గృతప్రణాముఁ డయి యగ్గురు నిట్లని పల్కె ముంజభో
జన్యపతి యిట్లనం దగునె శైవగురూత్తమ! నీకృపారసం
బునఁ దగఁ బెట్టుగట్టు పదవొందుట చిత్రమె మంగళంబు తె
ల్లము సుకృతాధిపుం గొలుచులాభము గల్గినఁ గీర్తి గల్గదే ?. 237

ఆ. వెలఁగి పుత్త్రనిర్విశేషంబుగా నన్నుఁ, బ్రోచు నీప్రభావమునను గాదె
ఇట్టివైభవంబు నిట్టిసౌభాగ్యంబు, దొరకె నాకు నిఖిలగురువరేణ్య. 238

ఉ. వారక ప్రేలు నాకి యుపవాసఫలం బెడలించునట్లు ని
స్సారము లైన యిజ్జగతిసౌఖ్యములన్ మది దూర్వ్యమొంది వి
స్తారియఘంబు దూరమని శంక వహించియు మీయనుజ్ఞకుం
దారక పూనినాఁడ వసుధాభరమున్ గురుచంద్రశేఖరా! 239

ఉ. సేవకలోకముం బొదలఁజేయుటకై చరకల్పభూరుహా
శ్రీ వహియించు నీపదముఁ జేరినవాఁడఁ గృతార్థుఁ జేసి సం
భావనఁ బ్రోవు నన్ను భవబంధము పైఁ దగు లూడ్చి నావుడున్
భూవరుఁ గ్రమ్మఱం బలుకు భూనుతుఁ డుద్భటమూర్తి యాక్రియన్. 240

గీ. అన్న! విశ్వాసమొసరించు మస్మదీయ, వాక్యమున సంశయము మాని వసుధఁ బెద్ద
కాల మభిరక్షణము చేసి కడు భజింపఁ, గలవు కైలాసనాథుఁ శ్రీకంఠు నభవు.

వ. అని యుద్భటారాధ్యుండు ప్రియశిష్యుం డగు ప్రభావతీశ వయోవైరాగ్యంబునకుఁ
బరిహారంబు గఱపి రాజయోగిలక్షణంబులం బ్రేక్షణీయుండ వగు మని నియమిం
పుడు నప్పుడమి ఱేఁడును "గురో రాజ్ఞాం నలంఘయేత్," త్తనున్యాయంబున నశేష
భుజాభుజగాధినాథుమై ధరావలయోహ విశ్రమింపం జేసి ప్రజావనసమర్థుం
డయ్యె నిట్లు. 242

సీ. ఇందుశేఖరముచే నేమూర్తి దీపించు, నామూర్తి దానవై యతిశయిల్లి
ఇభచర్మపటమున నేమూర్తి గొమరారు, నామూర్తి దానవై పారవు చూపి
యిల రథంబుగఁ బన్ని యేమూర్తి జయమొందు, నామూర్తి దానవై యసువుమిగిలి
యిక్షుధనుర్మూర్తి నేమూర్తి పైఁబూయు, నామూర్తి దానవై యలయక గల్గి
గీ. యన్న యుద్భటగురునాథునగ్రికలుష
కరటికంఠీరవస్వామిచరణయుగళి

తనకు నిహపరఫలసిద్ధి జనని గాఁగ
భూమిఁ బాలించు శ్రీముంజభోజమూర్తి. 243

క. పరహృదయకమలకర్ణిక, గురుచరణద్వయము నిలిపి కువలయరక్షా
చరణమునఁ బొదలుఁ బ్రిమథేశ్వరతనయుండు ముంజభోజనవిభుఁ డెలమిన్. 244

క. చరలింగమూర్తియగు నా,గురుదేవుని సింహపీఠిఁ గోరిక నిడి త
చ్చరణాంభోరుహములకును, బరిచర్య యొనర్చు వనవిపతి యనుదినమున్. 245

ఉ. అంత మనంబులోనఁ బ్రియమారఁ దలంచు మహాత్ముఁ డుద్భటుం
డంతక వైరి తచ్చిలిచి యాత్మఁ గఠోరతరోక్తి కప్రియై
చింతఁ గలంగు ఖేచరులఁ జేర్చు మదాకృతి నంచుఁ దొల్లి య
త్యంతదయార్ద్రచిత్తుఁడయి యాగతి నాడినమాట లిక్రియన్. 246

మ. నిలిచెం ధారుణి శైవధర్మము సముత్సేకంబుతో దుర్మతం
బులు బౌద్ధాగమముఖ్యముల్ సడలె శ్రీపూర్ణాత్ముఁడై శంభుప
ద్జలజాతద్వయభృంగ మీతఁ డన నోజన్ ముంజభోజక్ష్మా
లలనాధీశుఁడు నాదుశిష్యుఁ డంబ యుల్లాసంబు నొందెం ధృతిన్ 247

క. మతియుం దక్కనపను లర,మఱ యొకయింతయును లేక మలహరునాజ్ఞన్
అతి ఫలియించె ధరాస్థలి, నుఱక వసింపంగ నాకు నుచితం బగునే? 248

మ. కలదా యింక లలాటనేత్రపటుతీవ్రక్రూరకాపానలా
ర్చులచేఁ బ్రేలుచు నానిమిత్తమున దూరూపంబులం బాయఁగాఁ
గల మంచుం గడుఁ గాంక్షలన్ బొదలుతద్గంధర్వులన్ బ్రోవ వా
రిజా నోలిన్ సమయాబ్దముల్ గడపి రోర్వంజాలి నీచత్వమున్. 249

చ. అని కృతనిశ్చయుం డగుచు సద్గురుకుంజరుఁ డొక్కనాఁడు పా
వనసలిలంబులం దడిసి వచ్చి విశుద్ధశిరస్థలంబునం
దనుపమభస్మరుద్రిమణు లాదిగఁ గల్గినశైవచిహ్నముల్
మన మలరంగఁ దాల్చి పరమర్ధవలింగముఁ బ్రాణలింగమున్. 250

శా. హస్తాబ్జంబున సంగ్రహించి పరభద్రాసీనుఁడై జాతవే
దస్తారాధిపభానుభానువులకున్ దానైక్యుఁడై యొప్పుత
న్నిస్తంద్రోజ్జ్వలమూర్తిపై విమయుమల్ నెక్కొల్పి యోగంబుచే
మస్తోద్భేదము చేసి జీవితముసంబంధంబుఁ ద్రోచెన్ వెసన్. 251

సీ. అనుపమయోగిబ్రహ్మరంధ్రాంతరంబు, వెడలె శతకోటిరవిదీప్తివిలసనంబు
గలుగు తేజం బొకండు తత్కరతలేశ,లింగమును గూడి తారఁ బొందె లీల నెగసి·

క. జితభవబంధనులగు తత్పుత్రు లధికులు శాస్త్రప్రసరణితోఁ దత్తనువుల్
చతురత శైవజ్ఞానా,హుతిగా భావించి రంత యోగ్యప్రాజ్ఞుల్. 253

ఉ. అప్రమహనీయమూర్తితనువందలిధూమము సర్వదిక్కులన్
గ్రమ్ముచు మీఁద రాలు నమర్త్యద్రుమనిర్గతపుష్పవృష్టిగం
ధమ్ములతావి గల్చి పటధామవిహారుల నప్పికాచబృం
దమ్ములఁ గప్పె నీలజలదప్రతిపత్తిమహాస్వహాయమై. 254

గీ. సిద్ధరసమున వేధించు చెనఁటిలోహ,దళము లమలసువర్ణత్వకలన వెలుఁగు
నట్లు ఖేచరు లుద్భటునంగధూమ,సంగమునఁ జేసి శంభువేషములఁ గనిరి. 255

సీ. శాలప్రిహాళరుక్ప్రాటచ్చరంబులౌ,జడల సైంధవశిలల్ బెడఁగుకొనఁగ
బంధురపరిణద్ధకంధరాంతరములఁ, బసిమిదేరెడి చేఁదువిసము అమర
ఘనకటాటాభవత్కపిశికలమీఁద, వెరకొన్న పెనుపాఁపసరులు బెరయ
శరదభ్రవిభ్రమాకారవిగ్రహంబులఁ, గంతుభస్మాంగరాగములు గ్రమ్మ
గీ, వజలు డాకాళ్లయందు నైవస్యత్రప
తాపసంక్షోభకరబిరుదప్రకీర్ణ
ముద్రలింపొందఁ దద్రుద్రమూర్తిఁ దాల్చి
నిలిచె గంధర్వతతి వెండిరుచులు చెలఁగి. 256

గీ. అగురుపం డిట్లు దేవరయందు నైన,రాత్రి గంధర్వపతి చిత్రరథుఁడు వచ్చి
తెలివితోఁడుత నెంద్రైనఁ దిరుగ నటకి,తంబు చని వేమఱలి సఖేందనంబు డాయ.

క. కాయలు రాల్చినమావిడి,సోయగమున నిట్లు మిత్రకావ్యం బగుచున్
దూయనితద్భూజముఁ గని, హా యనుచున్ గుండె పగిలి యతివిహ్వలుఁడై. 258

మ. పిలుచుం జొట్టల బఁటులన్ సుభటులన్ బేర్గ్రిచ్చి యందంద లోఁ
గలఁగుం హూఱు విధాత నన్నుఁ గరుణం గావంగ రావే పురా
చలకోదండ! యటంచు మ్రొక్కుఁ బోరలున్ సర్వాంగవాన్ గన్నుఁగో
నల నశ్రుల్ జడిచూప బిట్టొరలు గంధర్వేశ్వరుం డంతయున్. 259

ఉ. మోచితి మగ్రితాపభరమున్ శతదివ్యసమంబు లన్నియున్
జూచితి నష్టభోగములు చూచినవారలు నవ్వ మద్భట
శ్రీచరణాంగధూమములు చెందుట గానమి యీపువంతకున్
గాచి వృకాళి కిచ్చినవరికారము దోఁచె మదీయసిద్ధికిన్. 260

క. తమతలఁచినయత్నంబులు, సమకూరుచునుండు నెపుడు సత్కర్ములకుఁ
దమతలఁచినయత్నంబులు, సమకూరవు దుష్టకర్మసంఘమ్ములకుఁ. 261

క. నమ్మితి శంకరువాక్యము, నెమ్మనమునఁ బడ్డపాటు నిష్ఫలమయి నా
కిమ్మాలికంబు ఘటించెఁ బ్రియమ్మగునే నన్ను నేఁప నబ్జజ! నీకుఁ. 262

వ. అని యనేకప్రకారంబుల వితథమనోరథుండై చిత్రరథుం డాక్రందనంబు
సేయ నయ్యర్ధరాత్రంబునందు గురువియోగవ్యథాదోదూయమానమానసుండై
యామ్రలింపుచుఁ గ్రమ్మువేదనల నపగతనిద్రుండగు ముంజభోజనరేంద్రుం
డయ్యాక్రోశం బాకర్ణించి సంచలించి యిది యేమిపరిదేవనంబొక్కొ? యిప్పి
తృవనభూమినుండి యొడుగక విడువనిశోలంబై యతివేలంబగుచు సముద్ర
ఘోషంబునుం బోలె భీషణంబగుచు వినంచుచున్నయది దీని నరయుదముగాక
యని కాలభైరవంబగు కరాళకరవాలంబు కేలం గీలించి శైలశృంగంబు డిగ్గు
సింగంపుఁగొదమయుంబోలె హర్మ్యంబు డిగ్గనుఱికి పిటికిదనంబు వోఁడజిమ
తత్కృపాణప్రభాపటలంబులం దమస్సముదయంబు విరియింపుచు నొక్కరుండ
యుత్కలికోత్త నిర్ణిద్రవేగంబున రుద్రభూమి డాయం జని తద్రోదనంబు
నకు కారణంబగు నిశాచరు నుదారప్రభావాతిశయంబునం జేసి కనుంగొని
జాలి యతని నుద్దేశించి యిట్లనియె. 263

ఉ. ఎవ్వఁడ వీవు ధైర్యమతి యేడ్చెద విచ్చట నెద్ది కారణం
బెవ్వఁడు నిన్ను నిష్కృపత నింతటుచేసెను నేఁటిదాఁక నే
నెవ్వరి నిట్లు దుర్దశల కిక్కగఁ గన్గొనఁ జెప్పుమన్న వాఁ
డవ్విభుతోడ నిట్లనియె నల్లన గద్గదకంఠనాళుఁడై. 264

క. ఏమని చెప్పుదుఁ జెప్పిన, నేమి యొనర్పంగఁ జాలు దీవిధి భువన
స్వామి యగునట్టియీశ్వరు,చే మును నియమింపఁబడిరొఁ జిరపుణ్యనిధీ. 265

క. ఏపుణ్యసాధ్వికడుపున, నేపురుషవతంస పుట్టువొందితి నాహృ
త్తాపంబు పాపె నీపలు, కాపాదితనవసుధారసావిష్కృతియై. 266

చ. అనఘవిచార! నాదు తెఱఁ గంతయుఁ జెప్పెద నీదుపేరు పెం
పును వివరింపు నా కనుడు భూవరుఁ డిట్లను ముంజభోజుఁ డన్
జనపతి నేను విశ్వబుధసంఘనుతంబగు నిప్పురంబు నా
యునికి దగన్ మదీయగురుఁ డుద్భటుఁ డారయ భూతపుంగవా. 267

వ. ఏను గురువియోగంబునం జేసి గాసిల్లి వినుగుచు నిట్టి దుఃఖంబున నిదురలేక
యేకతంబ యొక్క హర్మ్యస్థలంబున మేను వైచియుండునవసరంబున నీయాక్రం
దనం బమందం బగుచు వినంబడిన దీని నరయుదముగాక యని సత్వరంబుగా
వచ్చితిఁ బొచ్చెంబుగాదు నీతెఱం గెఱింగింపు మనుడు నయ్యంబరచరుండు
హర్షాంబరంబులు మనంబునఁ బెనఁగొన ససంభ్రమంబుగాఁ బఱతెంచి
కృతవందనుండై భూపురందరున కిట్లనియె. 268

క. జనవర! మును హరువలనన్, వినియుండుదు నీప్రశస్తి వినుటకు ఫలమై
కనుఁగవకుం దోఁచితి విఁకఁ, గనుఁగొంటిని శాపమోక్షకల్యాణంబున్. 269

సీ. వినవయ్య! భూప సావృత్తాంతమెల్ల గంధర్వనాథుఁడఁ జిత్రరథుఁ డనంగఁ
బరగినవాఁడ ము న్నరమేశ్వరున కొక్క, నెపమున ద్రోహినై కుపితుఁడైన
యద్దేవుకినుకఁ జయ్యనఁ బిశాచాకృతిఁ, జేరితి నాతోడివారు నేను
జేరి తత్కృపకల్మి శ్రీయుద్భటారాధ్య,గురుకనుధామంబు వొరయునాఁడె
గీ, శాపమోక్షంబు గాంచునిశ్చయము వడసి, యావటంబున నుండితి నిన్నివాళ్లు
కర్మమునఁ జేసి యుప్పును నగ్గంబువాసు, ముక్తు లయిచన నా కిట్లు మోసమయ్యె.

ఉ. ఆగురుసార్వభౌమునకుఁ బ్రాణముపాళిను వైననిన్ను హృ
ద్రాగముతోడఁ గంటి వసుధావర! నెవ్వగలెల్లఁ బాసె నీ
వేగతినైన నాకయినయీదురవస్థఁ దొలంగఁజేయుము గు
ర్వాగమదర్శితంబయినయాత్మజపావనవైభవంబునన్. 271

మ. మదనధ్వంసిమనంబునం బొడమి సామర్థ్యంబుచే సాధుస
మ్మదలక్ష్మిం బొదలించి విశ్వజనతామాన్యస్థితిన్ మించి దు
ర్మదవాదిద్విపసింహమైన భవదారాధ్యుఁడు నాకైనతు
చ్ఛదశం దీర్ప నుపేక్షఁజేసె నకటా! సర్వజ్ఞుఁడైయుండియున్. 272

గీ. ఆది నుద్భటమూర్తి కామారిచేత, నేను వెందలైన ఖచరులనెల్ల శాప
ముక్తులుగఁ జేయుదని తల మోచి వచ్చి, నన్నుపేక్షించె నేఁ డిట్లు నరవరేణ్య

చ. ఎఱుఁగనివాఁడు గాఁడు నిఖిలేంగితవేది భవద్గురుండు తా
మఱచెనొకాక యేను వటధుందిరసీమఁ దొలంగి దిక్కులన్
గుఱిచి బుభుక్షకై చనుట కొంత దలంపక వేగిరించి యే
డ్తెఱ శివునందు నయ్యొ జగతీవర! యేమనవచ్చు నాయెడన్, 274

చ, కలుషవిదూర! యేనొకటిఁ గంటి మనంబున మత్ప్రచారమున్
దెలియనివాఁడు గాఁడు భవదీయగురుండు మదీయదుర్దశా

కలనఁ దొలంగఁ జేయఁగలకార్యము నీతల మోవ నుండి శ
త్రులఁ బొదలింపఁ బొంతె ననుఁ బ్రోవక మానె విముక్తిలబ్ధిచేన్. 275

సీ. శరణాగతత్రాణసంరక్షణంబుచే, వచ్చుపుణ్యంబు కైవసము సేయ
దుఃఖాతురత్వంబు దొడికిన నోనాడఁ, డామాటఁ జేయుదృఢప్రతిజ్ఞఁ
దగుటకు సకలభూతాళి ప్రభూతహర్షంబున నచ్చెరుపడుచునుండఁ
బ్రిబ్బినశేరబ్బుగంబున మజ్జారె!, బళిబళి యనఁగడుపావనేగఁ
గీ, కిన్నరులు పన్నగులు సిద్ధఖేచరులును, బోల విద్యాధరులు గూడి పొగడుపలుకు
లురుతరంబయ్యె దిక్కులు నొరసి మించి, చూచుజనులకు నానందశోభ చెంత.

వ. ఇట్లు మంధానమహీధరమధ్యమానసుధావయోధిధ్యానంబు విడంబింప నమ్మహీ
మహేంద్రుండు గంధర్వరక్షణార్థంబై ప్రాణబంధంబుతోడ నవంధ్యసంధాధురం
ధరత్వంబు సంబంధింపఁజేసి గురుచరణస్మరణపారీణుండై కరాళకరవాలంబుఁ
గేలఁ గీలించి శశాంకశేఖరుం గుఱించి. 277

శా. ఓకందర్పవిరోధి! యోపురహరా! యోహస్తిచర్మాంబరా!
యోకాంతాశ్రితదేహ! యోశశిధరా! యోపద్మగర్భార్చితా!
యోధ్వాంతహర! యోహరిహరా! యోమేరుబాణాసనా!
ఆకర్ణింపుము నాదువిన్నపము దేవా! వామదేవా! శివా! 278

సీ. కారణంబులు నీవ కార్యజాలము నీవ, భావజ్ఞుఁడవు నీవ భావ మీవ
జనకుండవును నీవ జన్యవస్తువు నీవ, ప్రాపకుండవు నీవ ప్రాప్య మీవ
ఆధారకును నీవ యాధేయమును నీవ, భోక్తవ్యమును నీవ భోక్త వీవ
రక్షకుఁడవు నీవ రక్షణీయము నీవ, హార్యంబు నీవ సంహర్త వీవ
గీ, పూజకుఁడ వీవ పూజ్యంబుఁ బోడవు నీవ, వాచకుఁడ వీవ తలపోయ వాచ్య మీవ
జ్ఞానమును నీవ చూడంగ జ్ఞాని వీవ, నిటలలోచన! సకలంబు నీవ నీవ. 279

మ. పదవాంభోజము లోచనత్రితయభాస్వల్లీలతోఁ గూడఁ బ
ద్మదళాక్షీమణి యోర్తు మేనఁ దిరమై మత్తిల్లఁగన్ రూపసం
పద సొంపొందియు రూపదూరపరతన్ భాసిల్లుచున్నట్టి ని
న్నిదమిత్థంబని వర్ణింప శకమే? యీశాన! యోహ్యాకిన్. 280

సీ. నీయందఁ బొడమూచు నీయంద పొదలుచు, నీయంద విలయించు నిఖిలజగము
సకలచరాచరాసక్తుండ వగు దీవు, రత్నంబులో నిమ్న సూత్రమునుబోలె

రజ్జువందు సర్పభ్రాంతి పొడకట్టు,కైవడిఁ బ్రకృతి నీపై వసించు
ననవద్య మచ్యుత మాద్య మాద్యంతవిరహిత మై వెలుఁగొందుమహిమ నీవ

గీ. విష్ణుఁ డన రుద్రుఁ డనఁగ వాగ్విభుఁ డనంగఁ
దగిననామాంతరంబులు దాల్చి నీవు
భ్రమము సమకూర్తు వెలుఁగనిప్రాకృతులకు
నీమహత్త్వంబు చిత్రంబు నీలకంఠ!. 281

చ. పనివడి మున్ను ఖేచరులపాటులు మాన్పఁ గుతించి కేవతోఁ
గనుఁగొనినాఁడ వుద్భటు జగన్నుతమూర్తి ననంతుఁ బూనుని
ప్పని గొడ యయ్యోసేని పురభంజన యేమియనంగవచ్చు నీ
యనుపమసత్త్వభావ మకటా! వికటాచరణంబు చూపదే? 282

మ. అనుచుఁ ఖేచరరక్షణార్థ మతిధైర్యస్ఫూర్తి చేపట్టి ప
ట్టినతెంపున్ విడకున్నరాజానకుఁ గంతేకాలుఁ డిష్టంబు నీ
యనుకూలస్థితితోడ రాఁ దొడఁగెఁ దారాగంబుపైనుండి గొ
బ్బున మక్షాధిపవల్గనైకవిచలన్నోభేంద్రవాఃరాశియై. 283

మ. నవరత్నద్యుతిపుంజపింజరితనానాదిగ్వితానంబు ని
ర్ధనధూగానవిశేషగుంభితముఁ బ్రోద్యత్కింకిణీకాశం
బు వినిర్మింపక కేతనంబు నగుచుఁ బొల్పొందును[illegible]వా
మవిమానంబున వచ్చె నుద్భటుఁడు కామద్వేషి పా[illegible]బునన్. 284

మ. హరువెంటం జనుదెంచి రత్తఱి విమానారూఢు[illegible]సిద్ధకి
న్నరగంధర్వసుపర్వచారణమహానాగాధినా[illegible] మనో
హరచామీకరభూషణప్రతతితో నాల్[illegible]హారాలితో
ఘురుకాశ్మీరరసాంగహారములతో నుద్దామహర్షంబుతోన్. 285

వ. వెండియు నకాండాండంబువం దక్షిణయక్షరక్షఃకులవరేణ్యులు ననూనరససార
శరణ్యులగు కుంభనికుంభకుంభోదరనందికేశ్వరభృంగిరిటిప్రభృతిపారిషదపుంగవు
లును బ్రాహ్మ్యాదిమాతృకలును నింద్రాదిదిక్పాలకులును వామదేవాదితత్త్వజ్ఞ
లును గరుడాద్యండజమండలేశ్వరులును బ్రహ్మాదిప్రధానదైవతంబులును నద్దేవ
తాసార్వభౌముపిఱుంద సమందానందకందళితహృదయారవిందులై ధనుదేర
సరభసకరాస్ఫాలిత[illegible]ఝర్ఝరీగభీరభాంకారంబులును రంభాదిత్రిదశపురంధ్రీ
మంథరకళ్యాణగాన[illegible]కోలాహలంబును సమరతరుపరిగళితసుమనస్సముదయ

సంభూతసాంద్రమధురసాస్వాదమదాంధపుష్పంధయఝంకారంబులును దుంబురు నారదప్రముఖముఖనిర్గతనిరర్గళజయజయశబ్దసౌష్ఠవంబులును దిక్కులం బిక్కటిల్ల మహోత్సాహంబునం బ్రత్యక్షంబైనయుక్షవాహనునకుం బ్రదక్షిణప్రణామంబు లక్షీణభక్తి నొనర్చి ధరాధ్యుండు కరకమలపుటఘటనాపాటవంబు నిటలంబు నలంకరింప నంకురితపులకాంకురుండై యుదారస్వరంబున నిట్లనియె. 286

రగడ. శ్రీకంధర! గంధేభముఖజనక, శీతాంశుకళాశోభిజటాభర
శాకోదరవల్లభహారలతా,కలిత! సుధీజనపద్మదివాకర!
నిటలచటులశిఖినేత్రమహోల్కా,నిర్ధూతాంతక! నమదాఖండల
పటుకరుణారసభరితకటాక్షని,పాతకృతార్థీకృతబుధమండల!
శ్రీమత్కైలాసమహీధరవర,శిఖరస్థలవిహరణపారాయణ!
చామీకరభూమీధరబాణా,సన! శిలీముఖనారాయణ!
త్రిపురపురంధ్రీజనఫాలాంచల,తిలకమృగమదహరణశరచ్ఛట!
శ్రీటద్వీపరాడ్ద్వీపికులాధిప,కర్కశచర్మపటీవృతకటితట!
ప్రాభవశాలి మహామునిసేవా,హేవాకసమంచితపదనీరజ
కృత! హుంకృతిదక్షాధ్వరదళ,గీర్వాణశ్రీఘటపాటనపటు
భుజగీకృతయోగతిమహాసీ,మంతిసరణి,సురుచిరసీమాధ్వన్యాలసద్గుణ!
చటులహిమాచలజామాతృత్వప్ర,శంపదబుద్ధిసమార్జితసుక్షణ
మిసమిసమనుబలువిసమునెకలకును, మెసవంగైకొనం గుత్తుక ధరియించితి
నొసల నెసంగుశిఖి గాసమున మసరుమ,నోభవు మెత్తని మే నీఱయించితి
బలువగు పరశువ్రపరుషముఖంబునం, బరశుమహాసురవరు విదళించితి
జలధరపటలము చెలువము గిరికొను,సామజపతిదర్పం బెడలించితి
పార మెఱుంగక కవిసినమృగ్యావు, పాల నలుగుసుం గపాలము సించితి
వారిమగంటిమి నెమరుజలంధరు,వాలుంగొని కడిమి యుడుంగక తుంచితి
వారినిధులు పరిసేకార్ణవమై, వోడియచూపినం బటమైతివి భళి
దారువిపినమునిచపలాత్ములచి,త్తములు గలంచుట కాపట మైతివి
హరివాణీరమణులు నిన్నరయ న,హంకారము చూపిన మిన్నందితి
అరుణజటామండలమధ్యమున ను,తావగ వెలకొన్నం గదుం జెన్నొందితి
బహుకాలము తప మొనరించిన భవ,పతి చాలికారకము నుపకృతి చేసితి
మిహిపదమగు సొబగున గినిసిన క్రతు,మృగమును దెగగొని పడ నేసితి

యాఱు మొగంబులఁ గనుపట్టినవిజ్జయాధిపునిఁ గుమారకుఁగాఁ గాంచితి
వాఱుదళంబులమంత్రకుసుమమున, నళిరాజముక్రియ లలిఁ గ్రీడించితి
వోడనం బెన్నకుఁగాఁ దళ్కొంతిన,ఘోరాఘరమున నోహోయనిపలికితి
కడుఁబ్రియమున బాణాసురుమోసలఁ, గాచుటకును నిరవధికృప చిలికితి
బలువిలు గొని విబ్బగముగ మోఁదిన,బలమర్దననందనుఁ జేపట్టితి
దశదళమనుమనుమ్ములకుల మెఱుఁగులు, దట్టపుఱుచుశూలము చేపట్టితి
నవముక్తాఫలవర్ణంబున గగ,నము మోచిన నందిన బల్లించితి
అవితథమై సర్వధురావంబగు,నయ్యాశ్వరశబ్దముఁ జెల్లించితి
సకలచరాచరసృష్టిస్థితిలయ,సంధాయకము నీపాలిదయ్యె దగు
నకలంక మమేయ మనుత్తమమగు,నావరతత్త్వవిభూతియు నీడగు
నిను జింతఁదని గురుతింపఁగ వా,సిరజభవముఖ్యులు నేర రనఁగ
ఘనభవపాశనిబద్ధులు మాదృగ్జను లర్హింతురె నీమహిముఁ గనఁగ
భక్తజనావనపరతంత్రిత చే,పట్టుము నన్ను గుణాత్రియభాస్వర! 287
భక్తిముక్తిఫలదాయక శంకర!,భూతేశ్వర!యైశ్వర్యవికస్వర!.

క ఈచందంబునఁ బొగడుమ,హీచక్రాధీశుమీఁద నీశ్వరుఁడు క... 288
గోచరకటాక్షపాత,ప్రాచుర్యం బొదవఁ బలుక బలుమృ... శ్రీ

క. మెచ్చితి నిను ముమ్మాటికి, నిచ్చెద వర మెద్దియైన నీ ... ప్రాంజలి యగుచున్.
మచ్చరిత యనుఁడు భూవరుఁ, డచ్చంద్రకిరీటుఁ బ...

చ. కరుణ యొకింత చిత్తమునఁ గల్గినమేటివి నీవు ...
శ్వర! తరుణేందుశేఖర! దివస్పతిముఖ్యనిలింప...
ర్జరతరుపుష్పనిర్గత పరాగవిరాజితపాదపద... 290
...గ్రహింపవే.
చరవిభు నీతనిన్ మనుపు శాపమువా...

...సపూన్కి యాడేర్పుటకై
క. నీయందు నుద్భవించిన,యాయుద్ధ... 291
క్రియతుఁ జేయు మితని వా,ల...మ్మునకుఁ దరుణహరిణలాంఛనమకుటా!

మ అనుచున్ వేదశిఖావతంస...యిత్యాదీంద్రజాజానిప
ద్యనజాతద్వితయంబుపై ...డు గంధర్వేశ్వరుం బెట్టి భో
రున దండాకృతి ద్రోఁప శంభుఁడును గారుణ్యంబుతో లెమ్ము రె 292
మ్మని తక్షేచరుమాళి... వరదానాసక్తముల్ హస్తముల్.

ఉ. ఆనిఖిలాధినాథుశుభహస్తము మస్తము మోచినంతఁ దే
జోనిధియై మణీమయవిశుద్ధసువర్ణకిరీటహారియై
మానితహారగుచ్ఛరుచిమండలమండితుఁడై వియచ్చరుం
డానినవేద్యుతోడఁ బ్రమథాకృతిఁ దాల్చె విచిత్రసంపదన్. 293

గీ. రాజగురుభక్తికిని భక్తరాజపాల, శంకరుఁడు గోరికంది వశంవదాత్ముఁ
డగుటకును సర్వభూతంబు లౌర యనుచు, నద్భుతావేశ మొదవంగ నభినుతించె.

సీ. అంతట నిఖిలజ్ఞుఁ డగువిరూపాక్షుఁ డత్యనుపమభక్తిసమగ్రుఁ డైన
క్షితిపతిగురుభక్తికిని జిత్తశుద్ధికి, సూనృతపాలనస్ఫురణ కార్త
రక్షణశక్తికిఁ బ్రముదితస్వాంతుఁడై, పలుకు నవ్విభు మహీపాలచంద్ర
వినుము నీయనవద్యవృత్తంబునకు మోద,మందితిఁ బటుశక్తి నుర్వి నింకఁ

గీ. గొన్నిసమములు పాలించి కూర్మి వెంచి
దిశల నిర్మలసత్కీర్తిఁ దెలివి నించి
నాదుసాలోక్యలక్ష్మిఁ బొందంగఁగలవు
పొమ్ము మది సంశయము మాని పురమునకును. 295

వ. అనునవపరంబున హస్తోత్కర్షంబున నద్భుతప్రాభవుండగునుద్భటుం డనుకం
పాసంపదభిరామస్వాంతుండై కృతవందనుండగు నమ్మహీకాంతు నహీనాశీర్వా
దంబుల నాదరించె తక్కినసురకిన్నరగరుడోరగాదులు నాదరంబున నతనిం
బ్రశంసించిరి చిత్రరథుండును వసుంధరాకళత్రు నగ్గింపుచుఁ గుంభనికుంభప్రభృ
తులగుపరివారులం గూడి నర్తించె నంతకాంతకుండు నంతర్ధానంబు సేసె నిట్లు
చరితార్థుఁడగుముంజభోజుండు నిజనగరంబుఁ బ్రవేశించె నంత. 296

ఉ. నీతియుఁ బెంపు సొంపు నతినిర్మలకీర్తియుఁ దేజమున్ మహా
ఖ్యాతియు వృద్ధిఁబొందఁ జతురంబుధివేష్టితభూస్థలంబు నే
కాతపవారణంబుగఁ బ్రియంబున నేలుచునుండె వైభవో
పేతుఁడు ముంజభోజుఁడు మహేంద్రుఁడు నాకముఁ బ్రోచుకైవడిన్. 297

వ. అనవుడు నమ్మహర్షులు హర్షంబున నారోమహర్ష[illegible]నిరి. 298

ఉ. అంచితపుణ్య! లక్ష్మికి నవై తగునుద్భటమూర్తి నిత్యని
ర్వంచితభద్రకీర్తి నఘవారణ! వింటిమి ముక్తికామినీ
చంచలదృగ్విలాసములసౌఖ్యము గంటిమి పూర్ణశేముషీ
కాంచనగర్భ! నీవలన గాఢతరాఘుతమంబుఁ దోలఁచుచున్. 299

వ. ము న్నుద్భటారాధ్యులకు సంతానంబు గలదని తన్నిర్యాణకాలంబునం గొంతవివరించితి నమ్మహాంశంబు విస్తృతంబుగ గణింగించి మమ్ముఁ గృతార్థులం జేయవే యనుడు నతం డమ్మహర్షుల కిట్లనియె. 300

మ. వినుఁడీ మామక దేశికోత్తముఁడు సద్విద్యావిమర్శాత్మకుం
డనఘుం డాఢ్యుఁడు సర్వశాస్త్రవిదుఁ డౌవ్యాసుండు సానందముం
దనరన్ నన్నుఁ గృతార్థుఁ జేయఁగను నిత్యం బీశ్వరధ్యానపూ
జనముం దత్సుతభక్తబాంధవకథాసద్గోష్ఠి బంధించినన్. 301

మ. పరమానందరసాబ్ధిఁ దేలి కరుణాపారీణ సాక్షిప్రమా
హరుభక్తావనసత్కథాశ్రీని మాజ్ఞాపించి జనాంబుధిన్
దరణం బొందఁగఁ జేయవే యనిన సాధన్యుండు నేతత్కథన్
వరమం దై విన బల్కె ము న్నటుల నే వర్ణింతు మీ కిప్పుడున్. 302

శా. ఆగంధర్వులశాపకారణముచే నార్యాకళత్రింతట
త్త్యాగంబున్ వరమిచ్చి వారికిని నాత్మజ్ఞోద్భవుం గూర్చి[illegible]
రాగంబందునఁ బల్కె నుద్భట త్రిలోకారాధ్య! నీ[illegible] డు
ద్వేగం బొప్పఁగ మత్స్యదేశికగుణావిష్టుఁడ [illegible]వృగున్. 303

ఉ. భూనుతమైనకాశి యనుపుణ్యమహానగరం[illegible]యున్
జేనను విశ్వనాథుఁ డన నిల్చితి వ[illegible]ాజకన్నికన్
మానుషరూపివై విబుధమాన్యవ[illegible] విస్తృతాత్మవై
నీనిజదివ్యదీప్తిఁ గని నివ్వెరగ[illegible]చు నుండు రందఱున్. 304

వ. అట్లుగావున. 305

సేవిం చీశ్వరమంత్రదీక్షల శుభశ్రీ లొంది గ్రామాలయ
ప్రావీణ్యంబున దానముల్ ఒసఁగ నారాధ్యప్రభల్ వర్ధిలెన్. 315

ఉత్తమశైవదీక్షల గురూత్తముఁ డుద్భటుఁ డీద్విజాళియం
దుత్తము లిష్టలింగు లని సూక్తులు చెప్పిరయా లింగధారణల్
కుతుకలందుఁ గొందఱుఁ గూర్పఁగ రాజులు మంత్రివర్గముల్
చిత్తములుం జిగుర్పఁగను శిష్యులునై గురుపూజ చేయఁగాన్. 316

గురుచరలింగపూజ లొనగూర్పఁగ నుద్భటు కంతఁ గంతుసం
హరుఁడు ప్రసన్నరూపమున నన్నియుఁ దానయి నిత్యనీమముల్
జరుపఁగ వచ్చి తత్క్రియను పొంగముగా నొనరింపఁ జేసి యీ
కరణి నప్రత్యక్షుఁడై మెలఁగఁగా మహిమాన్వితుఁ డయ్యె నుర్వరన్. 317

తద్బుధులలో సుబుద్ధి యన్ ధరణీసురుఁడు
సుగుణమణిగుణసౌభాగ్య సుందరి యను
పేరఁగలిగినకూఁతురఁ బెండ్లి చేసె
నుద్భటారాధ్యునకు నీశ్వరుంతు దెలుప. 318

అట్లు గావున. 319

శ్రీకంఠావరమూర్తి దుర్మతలతాశ్రేణీలవిత్రంబు సు
శ్లోకున్ సంతత తత్త్వదర్శనపరున్ శుద్ధాత్ము నాచార్యచూ
డాకల్పంబు వినమ్రకల్పకము వేదాంతార్థవేత్తృత్వల
క్ష్మీకంజాప్తను సాంద్రభక్తిఁ గొలుతున్ శ్రీయుద్భటారాధ్యులన్. 320

జనియించెన్ హరుమానసంబునఁ బిశాచత్వంబు మాన్పించి ది
వ్యనికాయంబుల శంభుమూర్తిఁ గనఁ జేయంజాలెఁ గైలాసశై
లనివాసంబున నట్టెఁ బట్టము బుధశ్లాఘాన్వితఖ్యాతిఁ దటన్
జననప్రాభవపుణ్యముక్తి కలని శక్యంబె వర్ణింపఁగాన్. 321

పరశమాకరలబ్ధవర్ణపుంగవులచేఁ, బోలె విజ్ఞానవిస్ఫూర్తిఁ గాంచి
దృఢసత్ప్రభావవ తీర్థోదకములచేఁ, బోలెఁ బావనవృత్తిఁ బొందఁజాలి
శారదారంభవిస్మేరేందురుచులచేఁ, బోలె నాహ్లాదంబు చాలఁ దాల్చి
చారుప్రభాసాంద్రజాతిరత్నములచేఁ, బోలె నలంక్రియాశ్రీల మెఱసి
పరలు నిఖిలజగంబు లెవ్వానివిమలధర్మగుణములచే నట్టిభాగ్యశాలి
వివిధసేవకసంకల్పదివిజసురభి, యుద్భటస్వామి యద్భుతోద్యోగి వెలయు. 322

సీ. అగ్న్యనీనులు చతురామ్నాయవీధికి, కాందిశీకులు వరనిందగుఱించి
భారవాహులు పు(ణ్య)పరిపాకకలనచే, మారదర్శులు తత్త్వసారదృష్టి
కర్మఠు లఖిలసత్కర్మకల్పన గూర్చి, దానశౌండులు పెట్టఁ దగినయెడల
జాగరూకులు శంభుసంపూజనాకేలి, నైష్ఠికు లనవద్యనిష్ఠఁ గలిమి
గీ. సకలదేశికరాజన్యమకుటనూత్న,రత్నకోరకమై బుధారాధ్యుఁడైన
యుద్భటారాధ్యవంశపయోధిఁ బుట్టె,నట్టిగురుచంద్రు లఖిలధర్మార్థవిదులు. 323

వ. ఇట్లఖిలజగత్కీర్తియమానంబగు నవ్వమహాభాగువంశం బతిశయసౌభాగ్యభాగ్యజన
కంబై క్రమక్రమంబునఁ బహుమాసవర్షాయనసంవత్సరంబు లతిక్రమించి వివేకం
బునకు నాకరంబును, విభవంబునకుఁ బ్రభవంబును, ధర్మంబునకుఁ గూర్మియు,
భద్రంబులకు మూదరియు, పుణ్యంబునకు శరణ్యంబునై పినాకశరాసనశాసనం
బున నాంగీరసబార్హస్పత్యభారద్వాజగోత్రంబునకుఁ బాత్రంబయ్యె నందు
కల్లోలినీవల్లవికునందు హల్లకోల్లాసకరుండగు వేల్పుపాలుపున విశాలాక్షివల్ల
భుండు...మల్లికార్జునగురుం డుదయించె నతండు. 324

మ. ప్రణమద్భూపకిరీటకోటిఘటితద్రాఘిష్ఠరత్నచ్ఛటా
ఘృణికిర్మీరితపాదపద్ముఁడు బుధక్షేమంకరుం డింద్రవా
రణసంతానలరంగరంగదురుసారస్ఫారసత్కీర్తి ని
...మత్త్వపారగుఁడు శ్రీరమ్యుండు సౌమ్యుం డిలన్. 325

క. ఆమల్లికార్జునగురుస్వామికిఁ బోలయగురుఁడు జనియించి దిశా
సామజకర్ణపుటతట,చామరలీలాయమానసాంద్రయశుండై. 326

సీ. శాంకరీదేవికి షణ్ముఖుండునుబోలె, నాప్రియనార్యనర్ధాంగలక్ష్మి
యైనశాంకరికి స్వయంభువుగారు జనించు భద్రాంబికానేత యగుచు
... ... ... శ్రీభవానీభర్గ మహాప్రాభవమున
గల్గువారలకు శంకరదేశికస్వామి, యావిర్భవించు నాయలఘుమతికి
గీ. గౌరమాప్రాణనాథుండు శంభుయజ్వుఁడు, సోమనాథయ్యయాయాసనూనుఁ డొప్ప
లింగనారాధ్యుఁ డారాధ్యశేఖరవిభుఁడు, మల్లికావల్లభుఁడు కీర్తివల్లభుండు. 327

శా. మానాథప్రవణాత్ముఁ డాత్మవిదుఁ డామ్నాయార్థసారైకపా
వనజిహ్వాంచలుఁ డంచితస్మృతికథావ్యాసుండు చార్వాకజై
ననదీవల్లభకుంభసంభవుఁడు జన్మంబొందె మస్మయ్యలిం
గనకుం బల్లమకుం గుమారుఁడంబు గంగాంబామనోభర్తయై. 328

ఉ. పర్వతరాజధైర్యుఁ డనుపర్వతపర్వతవైరి సత్ప్రభా
పార్వణశర్వరీశ్వరుఁ డపారకృపావరతంత్రబుద్ధి సౌ
పర్వణధేనురత్నతరుభంగదదానగుణాఢ్యుఁ డుర్వరా
పార్వతిమైన పార్వతికి భర్త దగ(న్) మలికార్జునుం డిలన్. 329

క. ఆగమవిద్యాత్మక యోగ, సాగమకు న్నాథుఁ డగుచు నానావిధస
ద్భోగమహేంద్రుఁడు పుట్టెను, రాగమహాధైర్యుఁ డార్యుఁడై పతి దానన్.

క. ఆజంపతులకుఁ గలిగెడు, భూజనమందారశాఖి పురహరపూజా
భాజిష్ణుఁడు పుణ్యఫల, శ్రీజన్మస్థలము చంద్రశేఖరుఁ డెలమిన్. 331

మ. గంగామౌళిపదాబ్జభృంగము మరుత్కాంతేశు నావర్తులో
త్తుంగస్నిగ్ధపయోధరద్యుతతటీనోర్మ్యాలవాటీముఖ
ర్వాంగీకారసమస్తకీర్తినిధి శైవారాధ్యముఖ్యుండు వే
దాంగార్థజ్ఞుఁడు చంద్రశేఖరుఁడు భవ్యప్రాభవుం డుర్వరన్. 332

సీ. కువలయోల్లాసంబుఁ గూర్పుట శశియయ్యు, దోషాకరత్వంబు దొడఁకఁ డెచట
విపులవాగ్వృత్తి దర్వీకరేశ్వరుఁ డయ్యు, జిహ్మసంచారంబు సేయఁ డెచట
కమలావివర్ధనోత్కంఠ సూర్యుం డయ్యు, రాజదూరస్థితిఁ గ్రాలఁ డెచట
దివ్యభోగస్ఫూర్తి దేవతానాథుఁ డయ్యు, గోత్రవిభేదంబు (గూర్పఁ డెచట)
గీ. ... ... సురశాఖి యయ్యుఁ, గొయ్యదనమున వర్తింపఁగోరఁ డెచట
నఖిలమంత్రరహస్యసిద్ధాంతవేది, చంద్రశేఖరగురురాజచక్రవర్తి. 333

శా. పాగ్యస్త్రీజనగీతకీర్తి పరమైశ్వర్యాద్యవిద్వన్నికా
యాధ్యక్షోన్నతి చంద్రశేఖర ... ... ...
...ధ్యాస్ఫోటితజాహ్నవీసుతులఁ గాంచున్ బుత్రులన్ మన్మనా
రాధ్యారాధ్యసమాఖ్యులన్ దినమణిప్రాలేయరుఙ్మిత్రులన్. 334

క. ఇది యుద్భటదేశికమణి, సవిభినుతాచారభావిసంతతిచందం
బొదవించు నీ ..., ... ... ఖిలమంగళసిద్ధుల్. 335

క. సారమతుల్ట్లకుజనులు, హరిశివస్తోత్రమునకు హర్షింప రకూ
పారము ల (వోలె) నూతులు, కైరవహితురాకఁ బొంగఁగా నేర్చునొకో!. 336

వ. కావున మహా......మాహేశ్వరాచారపారీణులు గావున నపరత్రిపురాధీయగు ముద్భటారాధ్యులచరితంబు వినుటకుఁ గాంక్ష చేసితిరి ఏను నాచేర్చుచందంబున నుపన్యసించితి నిందునను గుణంబు పరిగ్రహించి ... ... ... తని సూతుండు శౌనకాదులకు మేదురామోదంబు సంపాదితంబు చేసి వారిచేత సంభావితుండై యథేచ్ఛంబుగం జనియె నని. 337

క. ఈకథఁ జదివిన వ్రాసిన, లోకులు భవబంధములకు లో ...
... ... నమహా,లోకంబున నుండఁగలరు లోకులు మెచ్చన్.

మ. అనహంకారనిరంకుశప్రతిభదివ్యస్త్రీసద్వృత్తల
స్తనకుంభద్వయగంధసారనవముద్రాకల్పనానల్పశో
భనకీర్తిప్రియ విప్రపూజనపరా భా ... ...
... నాపిత్స్రవఃశ శంభువదసేవాసావధానాత్మకా! 339

క. నటదనము నేత్రిజూటీ,తటకోటినీకటులనినదధారారజియో
ద్భటభేరీభాంకార,స్ఫుటఘటనా యాచకాఘశోకత్రుటనా! 340

మా. ...శాలనుధీమణిజాలఃచస్తుతసాంద్రకృపా
పార్వతాపజితాంబుజబాంధవ, పారహిమోరసుధా...
పారమరాళమహారమణీయమ,హాస్ఫటికీర్తిగృహాకులని
స్తార ... ..., రకనవ్యసుధానిధీ. 341

గద్యము.

ఇది శ్రీమదేలేశ్వరగురువరేణ్యచరణారవిందషట్చరణసకలకళాభరణ
రామనార్యసుపుత్త్రి సుకవిజనమిత్రి కుమారభారతీ
బిరుదాభిరామ రామలింగనామధేయ ప్రణీతంబైన
శ్రీమదుద్భటారాధ్యచరిత్రం బనుమహా
ప్రబంధంబునందు సర్వంబును
దృతీయాశ్వాసము
సంపూర్ణము.